శ్రీశంకరాచార్యవిరచిత

# దక్షిణామూర్తిస్తోత్రమ్

(మానసోల్లాస సహితం)



శ్రీశుకబ్రహ్మాశ్రమము
శ్రీకాళహస్తి



జగద్గురు శ్రీ ఆదిశంకరాచార్యులవారు



## గురుపరమ్పరాస్తోత్రమ్

ఓమ్ సదాశివ సమారమ్భాం శంకరాచార్యమధ్యమామ్ ।
అస్మదాచార్యపర్యన్తాం వందే గురుపరమ్పరామ్ ॥

ఓమ్ గురవే సర్వలోకానాం భిషజే భవరోగిణామ్ ।
నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తయే నమః ॥

ఓమ్ నారాయణం పద్మభువం వసిష్ఠం శక్తితాపసమ్ ।
పరాశరఞ్చ తత్పుత్రం వ్యాసం వేదాబ్జభాస్కరమ్ ॥

ఓమ్ విరక్తం శ్రీశుకం దేవం జ్ఞానవైరాగ్యరూపిణమ్ ।
గౌడపాదం చ గోవిన్దం యోగీన్ద్రం జ్ఞానినాం వరమ్ ॥

ఓమ్ తచ్ఛిష్యం శంకరాచార్య మద్వైతస్థాపకం గురుమ్ ।
నమామి భగవదత్పాదం శంకరం లోకశంకరమ్ ॥

ఓమ్ సచ్చిదానందరూపాయ జ్ఞానవైరాగ్యదాయినే ।
అసంగానందదేవాయ తస్మై శ్రీ గురవే నమః ॥

ఓమ్ విద్యాప్రకాశనామానం వేదవేదాన్తకోవిదమ్ ।
గీతాతత్త్వప్రబోద్ధారం సద్గురుం ప్రణమామ్యహమ్ ॥

ఓమ్ అసంగానంద గుర్వాద్యాం విద్యాప్రకాశమధ్యమామ్ ।
అస్మదాచార్యపర్యన్తాం వందే గురుపరమ్పరామ్ ॥

# శ్రీదక్షిణామూర్తి స్తోత్రమ్

మానసోల్లాస సహితం

రచన

జగద్గురు శంకరాచార్యులవారు

మానసోల్లాస రచన

శ్రీ సురేశ్వరాచార్యులు

తెలుగు అనువాదం

శ్రీ నారాయణానంద సరస్వతి స్వాములవారు



ప్రచురణ

గీతా పబ్లికేషన్స్

శ్రీ శుకబ్రహ్మాశ్రమము

2015

శ్రీదక్షిణామూర్తి స్తోత్రమ్ - మానసోల్లాస సహితం

ముద్రణ : 2015 - 1000 ప్రతులు



వెల : రూ.

గ్రంథప్రాప్తి స్థానం :
శ్రీశుబ్రహ్మాశ్రమము,
శ్రీస్వామి విద్యాప్రకాశానందనగర్,
శ్రీ శుకబ్రహ్మాశ్రమం(పోస్టు),
శ్రీకాళహస్తి
చిత్తూరు జిల్లా-517 640
ఫోను : 08578-222239

డి.టి.పి. :
శ్రీవారిగ్రాఫిక్స్, తిరుపతి.
సెల్ నెం. 9948434277

ముద్రణ :
సి.ఎన్. ప్రింటర్స్, తిరుపతి.

# ముందుమాట

మానవునిచే పొందదగిన పురుషార్థములు నాల్గు ధర్మ, అర్థ, కామ, మోక్షములని. వీనిని చతుర్విధపురుషార్థములందురు. వీనిలో మొదటి మూడు సామాన్యమైనవి. వీనివలన మరల జన్మ - పుట్టుట చచ్చుట మరల పుట్టుట గలదు. కానీ నాల్గవదగు పురుషార్థము మోక్షము వలన మరల జన్మ రాదు. పునరావృత్తి కలుగదు. అందుచేత దానిని పరమపురుషార్థమనిరి. ఇదే మానవుని చరమలక్ష్యం. ఇది జ్ఞానంచే లభించును. "జ్ఞానాదేవ తు కైవల్యం" అని పెద్దల వాక్యము.

ఈ జ్ఞానాన్నిచ్చేవి వేదాలు, శాస్త్రాలు. ఆ వేదాల శిరస్సులు ఉపనిషత్తులు. ఈ ఉపనిషత్తులు 108 అని పెద్దల అభిప్రాయం. వీనిని లోతుగా పరిశీలిస్తే తప్ప వీనిచే ప్రతిపాదిత సత్యం ఒకటే అని అవగాహనకు రాదు. ఈ శ్రుతి శిరస్సులకు భిన్న భిన్న అర్థాలు పండితులు చెప్పారు. అలాంటప్పుడు ఏ అర్థం సరైనదని సామాన్యులకు తెలియదు.

అట్టి స్థితిలో జగద్గురు శంకరాచార్యులవారు భారతదేశంలో జన్మించారు. ఆయన ధర్మోద్ధరణకు జన్మించిన-అవతరించిన సాక్షాత్ శంకరులు (శివుడు) అని అందరి అభిప్రాయము. ఆయన అవతారపురుషుడు కాబట్టే అతి చిన్నవయస్సులోనే సమస్త శాస్త్రాలను చదివి వాటి సారాన్ని ప్రస్థానత్రయాలకు భాష్యాలుగా వ్రాసి అద్వైతసిద్ధాంతాన్ని దేశమంతా తిరిగి పునఃస్థాపించారు.

అవిద్యవలన సత్యజ్ఞానానందస్వరూపమగు తన స్వరూపాన్ని గుర్తించక ప్రాణి 'పునరపి జననం పునరపి మరణం' అనే సంసారంలో

ద్వంద్వాలకు లోనై పుడ్తూ చస్తూ ఉన్నాడు. విద్య–జ్ఞానం ద్వారా ఎప్పుడు అవిద్యనశిస్తుందో అపుడు అవిద్యాకార్యమగు సంసారం కూడా పోతుంది. తాను తన సహజ ఆనందస్వరూపంలో వుంటాడు. అదే ముక్తావస్థ. ఈ జీవన్ముక్తి జ్ఞానం వలననే కలుగుతుంది. అదికూడా దృఢ అపరోక్షజ్ఞానం వలననే సాధ్యమవుతుంది.

శ్రీ శంకరాచార్యులువారు అట్టి జ్ఞానాన్ని తన ప్రస్థానత్రయభాష్యాల ద్వారా లోకానికి తెలియజేశారు. ఆచార్యులవారు ఈ భాష్యాలలో దుర్మతములను ప్రమాణవచనాలతో, సూక్తులతో ఖండించి సుందరమైన శైలిలో అద్వైతసిద్ధాంతాన్ని ప్రతిపాదించారు.

ఈ వేదాన్త భాష్యాలను చదివి గ్రహించు సూక్ష్మబుద్ధి లేనివారికోనరం, మందాధికారులకోనరం శ్రీ జగద్గురు శంకరాచార్యులవారే కొన్ని ప్రకరణ గ్రంథాలను వ్రాశారు. కొన్ని స్తోత్రాలను కూడా రచించారు.

అట్టి స్తోత్రాలతో శ్రీ దక్షిణామూర్తి స్తోత్రం ప్రధానమైనది. వేదాన్తశాస్త్రమందలి మాయావాదాన్ని జీవబ్రహ్మైక్యము మొదలగు విషయాలను గురుపరంపరగా తాము గ్రహించి సుబోధకమగునట్లు ఇతరులకు ప్రవచన చేసిన బ్రహ్మశ్రీ మద్దులపల్లి మాణిక్యాలశాస్త్రి గారు ఈ దక్షిణామూర్తిశాస్త్రాన్ని గురించి "శంకరభగవత్పాదులవారు వేదాంతమనే మందరపర్వతంతో మథించగా అద్వైతామృతం బయటికి వచ్చినది. అట్టి అద్వైతామృతాన్ని ఈ దక్షిణామూర్తి స్తోత్రం అనే పాత్రలో నింపినట్లున్నది" అని తెలిపియున్నాడు. శ్రీశంకరభగత్పాద విరచిత ఇట్టి శ్రీదక్షిణామూర్తిస్తోత్రానికి ఆచార్యులవారి ప్రముఖశిష్యులగు



శ్రీసురేశ్వరాచార్యులవారు పది ఉల్లాసాలతో మానసోల్లాసమనే పేరుతో వార్తికాలను వ్రాసియున్నారు.

శ్రీసురేశ్వరాచార్యులవారి మానసోల్లాసం సహితంగా శ్రీదక్షిణామూర్తి స్తోత్రాన్ని తెలుగు అనువాదంతో ప్రజలకందించాలనే సంకల్పంతో 1984 వ సం॥లో శ్రీవ్యాసాశ్రమంలో ఎన్‌ట్రెన్స్ వరకు సంస్కృతం చదివి ఆ పైన చెన్నై సంస్కృతకళాశాలలో వేదాన్త శిరోమణి చదివి పరమపూజ్య శ్రీశ్రీశ్రీ శుద్ధచైతన్య స్వాములవారి అనుంగుశిష్యుడై విరక్తజీవితాన్ని సన్యాసజీవితాన్ని హిమాలయాలలో ఋషీకేశ్‌యందలి స్వర్గాశ్రమంలో గడపుతూ నివసిస్తుండిన పూజ్యశ్రీశ్రీశ్రీ నారాయణానంద సరస్వతి స్వాములవారిని కోరగా వారు శ్రీ దక్షిణామూర్తి స్తోత్రం మరియు సురేశ్వరాచార్యుల 'మానసోల్లాసమ'నే వార్తికాలను చక్కటి తెలుగులో వ్రాసి 1984లో పంపినారు. దాన్ని తిరుపతి శ్రీ మళయాల సద్గురు సేవాసమాజం ద్వారా మేము నడుపుచుండిన సద్గురువాణి త్రైమాసిక పత్రికలో ధారావాహికంగా ప్రచురించాము. ముముక్షువుల కోరికపై దానినే (శ్రీ దక్షిణామూర్తి స్తోత్రం, మానసోల్లాస సహితం) నేడు శ్రీశుకబ్రహ్మాశ్రమప్రచురణ రూపంలో మీముందుంచుచున్నాము.

దీనిని డి.టి.పి చేసిన శ్రీవారిగ్రాఫిక్స్ గుణభూషణ్‌గారిని, (తిరుపతి), దీని ప్రూఫ్‌లు చూచిన శ్రీ సముద్రాల దశరథగారిని, దీనిని ఆమూలాగ్రంగా పరిశీలించిన మహామహోపాధ్యాయ శ్రీడా॥సముద్రాల లక్ష్మణయ్యగారిని గురోర్గురువు శ్రీ దక్షిణామూర్తి అనుగ్రహించుగాక!

**– స్వామి విద్యాస్వరూపానందగిరి**

# నివేదన

మహామహోపాధ్యాయ
**సముద్రాల లక్ష్మణయ్య**

అతివిస్తృతమైన భారతీయవాఙ్మయంలో సంస్కృత వాఙ్మయమునకు అత్యంత విశిష్టమైన స్థానమున్నది. ప్రపంచ సాహిత్యంలోనే అతి పురాతనమైనదిగా భావింపబడుతున్న ఋగ్వేదం సంస్కృతభాషలోనే నిబద్ధమైనది.

ఋగ్వేదం స్తుతిరూపమైనది. ఋక్కులన్నీ స్తుతులే. 'అగ్నిమీళే పురోహితం' అన్న అగ్నిస్తుతితో ఋగ్వేదం ప్రారంభమైనది. తరువాత వివిధదేవతల స్తోత్రాలు అందులో కనిపిస్తాయి.

భగవంతుడు స్తోత్రప్రియుడు. వేదంలోనే కాక పురాణాలలోనూ, కావ్యాలలోనూ, శతకాలలోనూ, ఇతర వాఙ్మయంలోనూ, నానావిధాలైన స్తోత్రాలు కనిపిస్తాయి. రామాయణంలో ఆదిత్యహృదయాది స్తోత్రాలు, భారతంలో విష్ణుసహస్రనామాది స్తోత్రాలు, భాగవతంలో భీష్మస్తుతి మొదలగు స్తోత్రాలు సుప్రసిద్ధాలే.

కాలక్రమంలో ఈ స్తోత్రాలు ప్రత్యేకమైన గ్రంథాలుగా కూడా రూపొందాయి. సంస్కృతంలోనే కాక ఇతర భాషల్లో కూడా ఈనాడు స్తోత్రసాహిత్యం విరివిగా లభిస్తున్నది. స్తోత్ర గ్రంథకర్తలలో 'శ్రీశంకరభగవత్పాదులు' మొదట పేర్కొనదగియున్నారు. వారి రచనలుగా నానావిధాలైన స్తోత్రాలు నేడు ప్రచారంలో ఉన్నాయి. అందులో ఏవి ఆదిశంకరుల రచనలు? ఏవి తదనంతర శంకర



పీఠాధిపతుల రచనలు? అని నిర్ధారణచేయడం కష్టం. ఐతే భజగోవిందస్తుతి, సౌందర్యలహరి, శివానందలహరివంటి స్తోత్రాలు మాత్రం అందలి రచనా సౌందర్యాన్నిబట్టి ఆదిశంకర విరచితములేయని నిస్సందేహంగా చెప్పవచ్చు.

'శ్రీదక్షిణామూర్తిస్తోత్రం' కూడా నిస్సంశయంగా శంకరభగవత్పాదుల కృతియని విశ్వసించవచ్చు. ఈ స్తోత్రం చాలా అర్థవంతమైనది. అంతేకాక వారిముఖ్యశిష్యులైన 'శ్రీ సురేశ్వరాచార్యులవారు' ఈ స్తోత్రానికి 'మానసోల్లాసం' అనే పేరుతో వార్తికాలను వ్రాశారు. మాండూక్యకారికలు ఎంత ప్రసిద్ధి వహించాయో అంత ప్రసిద్ధి ఈ వార్తికాలకు కూడా కలిగింది. శంకరుని శ్లోకాలలో నిగూఢంగా ఉన్న అర్థాన్ని ఈ వార్తికాలు వ్యక్తీకరిస్తాయి.

'దక్షిణామూర్తి స్తోత్రం' కేవలం దక్షిణామూర్తిని స్తుతించడానికి మాత్రమే పరిమితం కాదు. దీనిలో వేదాంతప్రబోధం ప్రధానమైనది. బ్రహ్మయొక్క సత్యత్వం, జగత్తు యొక్క మిథ్యాత్వం, పురుషార్థస్వరూపం, మోక్షప్రాప్తికి కావలసిన సాధన ఇత్యాదులైన అంశాలు ఈస్తోత్రంలో నిబంధింపబడియున్నాయి.

'వ్యాఖ్యానతో విశేషప్రతిపత్తిః' అన్నట్లు వ్యాఖ్యానంతోనే పాఠకులకు విశేషాంశాలు గోచరిస్తాయి. శంకరుల భాష్యాలు, గీతాదిగ్రంథాలను వివవరించినట్లే 'సురేశ్వరుల వార్తికాలు ఈస్తోత్రంలోని విశిష్టాంశాలను విశదీకరిస్తున్నాయి.

స్తోత్రము, వార్తికాలు, సంస్కృతంలోనే రచింపబడినాయి. ఈ కాలంలో సంస్కృతం తెలిసినవారి సంఖ్య గణనీయంగా తగ్గినది.

ప్రాంతీయభాషలలో వివరిస్తే గాని గ్రంథంలోని విషయాలను పాఠకులు గ్రహింపజాలరు. 'శ్రీనారాయణానంద సరస్వతీస్వామి' వారు దీనిని గ్రంథరూపంగా అనువదించారు. ప్రస్తుతం 'శ్రీ శుకబ్రహ్మాశ్రమ పీఠాధిపతులు పూజ్యశ్రీ విద్యాస్వరూపానందస్వామి' వారు దీనిని ఆశ్రమం ద్వారా ప్రకటింపజేసి భక్త పాఠకులకు మహోపకారం చేశారు.

ఆశ్రమాల కర్తవ్యాలలో ఆధ్యాత్మిక గ్రంథ ప్రకటన ముఖ్యాతిముఖ్యమైనది. 'శ్రీ సద్గురు మలయాళస్వామి' వారు, వారి ప్రముఖ శిష్యులు 'శ్రీ విద్యాప్రకాశానందస్వామి' వారు ఈవిధమైన గ్రంథాలు ఎన్నో ప్రకటించి కృతకృత్యులైనారు. వీటిని శ్రద్ధతో పఠించి పాఠకులు కృతార్థులు కావాలి.

ఈ అనువాద రచన గావించిన 'శ్రీ నారాయణానంద సరస్వతీస్వామి' వారికి, దీనిని వెలువరిస్తున్న 'శ్రీ విద్యాస్వరూపానంద స్వామి' వారికి నా ప్రణామాంజలులు.

తిరుపతి — డా॥ సముద్రాల లక్ష్మణయ్య

1-4-2015

# శ్రీదక్షిణామూర్తి స్తోత్రమ్

## శ్రీశంకరాచార్య విరచితమ్

## " మానసోల్లాసః "

## శ్రీ సురేశ్వరాచార్య విరచితః

## ప్రస్తావన

శ్రీ శంకరాచార్యులు రచించిన స్తోత్రములలో శ్రీదక్షిణామూర్తి స్తోత్రము వారిదే అని నిస్సందేహముగ చెప్పవచ్చు. వారి శిష్యులైన శ్రీసురేశ్వరాచార్యులు ఈ స్తోత్రమునకు మానసోల్లాసమను నామముతో ప్రసిద్ధమైన వార్తికములను వ్రాసియుండుటయే ఈ అభిప్రాయమునకు ముఖ్య కారణము. దక్షిణామూర్తి స్తోత్రము దక్షిణామూర్త్యష్టకమను పేరుతోను ప్రసిద్ధిని బడసియున్నది. ఇది వర్ణనాత్మక స్తోత్రము కాదు. వేదాంతోపదేశమే దీని ముఖ్య సందేశము. బ్రహ్మ సత్యత్వము, ఇతర వస్తువుల అనిత్యత్వము, పురుషార్థము, జ్ఞానప్రాప్తికి వలసిన సాధన మున్నగు మూల తత్త్వములను ప్రతి యొక్కడును చక్కగ ఎఱుగునట్లు ఆచార్యులు నిస్సందిగ్ధముగ దీనిలో ప్రతిపాదించియున్నారు. ఈ స్తోత్రమును చదువుచున్నపుడు శ్రీగురు స్వరూపుడగు శ్రీ దక్షిణామూర్తియందు మనకు భక్తి కలుగునట్లు జ్ఞానముకూడా కలుగును. వంట చేయునపుడు చలికూడ పోవునట్లు ఈ స్తోత్రముచేత ఆత్మస్వరూపము తెలిసినపుడు ఇష్టములేని ఫలములును లభించునని వార్తికకారులు (ఉ.10-వా. 3) చెప్పియున్నారు.

శ్రీశంకరాచార్యుల సాక్షాత్ శిష్యులలో సురేశ్వరాచార్యులు వార్తికకారులని ప్రసిద్ధిని బడసియున్నారు. ఆచార్యుల భాష్యములకు ప్రసన్న గంభీరము, ప్రతిభాన్వితమునగు వార్తికములను వ్రాసి వేదాంత ప్రచారమును

గావించుట ద్వారా వీరుచేసిన సేవ మిక్కిలి అమోఘమైనది. ఉక్తము అనుక్తము, దురుక్తమునగు అర్థమును వ్యక్తమొనర్చుటకు వార్తికమని పేరు. ఈ లక్షణ దృష్టిచే సురేశ్వరాచార్యుల వార్తికములు అర్థభావ పూర్ణములై యున్నవి. వీరి సుప్రసిద్ధ గ్రంథరత్నములు ఐదు -1,మానసోల్లాసము, 2.ప్రణవవార్తికము, 3. నైష్కర్మ్యసిద్ధి, 4.తైత్తిరీయోపనిషద్భాష్య వార్తికములు, 5. బృహదారణ్యకోపనిషద్భాష్య వార్తికములు.

ఏతద్గ్రంథ పఠన శ్రవణ మననములు జిజ్ఞాసువులకు సర్వాత్మ భావమును కలిగించును గాక!



# శ్రీదక్షిణామూర్తి స్తోత్రమ్

**విశ్వం దర్పణ దృశ్యమాన నగరీతుల్యం నిజాంతర్గతం**
**పశ్యన్నాత్మని మాయయా బహిరివోద్భూతం యథా నిద్రయా ।**
**యస్సాక్షాత్కురుతే ప్రబోధసమయే స్వాత్మానమేవాద్వయం**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే ॥1॥**

యః =ఎవడు, దర్పణ దృశ్యమాన నగరీతుల్యం = అద్దమందు కనుపించు పట్టణమునకు పోల్చదగిన, నిజాంతర్గతం = తనలోనున్న, విశ్వం= జగత్తును, నిద్రయా = నిద్ర(కల)చే, యథా = ఎట్లో, అట్లు, మాయయా = మాయచే, బహిః = బయట, ఉద్భూతం ఇవ = కలిగి యున్నట్లు, పశ్యన్ = చూచుచు, ప్రబోధ సమయే = మేల్కొని (జ్ఞానోదయమై) నపుడు, అద్వయం = ద్వైత రహితమైన, స్వాత్మానం = తన ఆత్మ తత్త్వమును, ఆత్మని ఏవ = తనయందే, సాక్షాత్కురుతే = సాక్షాత్కారము చేసికొనునో, తస్మై = అట్టి, శ్రీగురుమూర్తయే = శ్రీగురు స్వరూపుడైన, శ్రీదక్షిణామూర్తయే= శ్రీదక్షిణామూర్తికి, ఇదం = ఈ, నమః = నమస్కారము.

ఎవడు అద్దమునందు కనబడు నగరమునకు పోల్చదగిన తనలోనున్న ప్రపంచమును కలలో కనబడు విషయముల వలె, మాయచే బయట కలిగియున్నట్లు చూచి జ్ఞానోదయమైనపుడు అద్వితీయమైన ఆత్మ తత్త్వమును తనయందే సాక్షాత్కారము చేసికొనునో అట్టి శ్రీ గురు స్వరూపుడైన శ్రీదక్షిణామూర్తికి ప్రణామము.

### మానసోల్లాసః

**మంగళం దిశతు మే వినాయకోమంగళం దిశతు మే సరస్వతీ ।**
**మంగళం దిశతు మే మహేశ్వరో మంగళం దిశతు మే సదాశివః॥2॥**

వినాయకః = వినాయకుడు, మే = నాకు, మంగళం= మంగళమును, దిశతు = ఇచ్చుగాక! సరస్వతీ = సరస్వతి, మే = నాకు, మంగళం = మంగళమును, దిశతు = ఇచ్చుగాక! మహేశ్వరః = మహేశ్వరుడు, మే = నాకు, మంగళం = మంగళమును, దిశతు = ఇచ్చుగాక! సదాశివః = సదాశివుడు, మే= నాకు, మంగళం = మంగళమును, దిశతు= ఇచ్చుగాక!

వినాయకుడు, సరస్వతి, మహేశ్వరుడు, సదాశివుడును నాకు మంగళమును కలిగింతురు గాక!

**ఆత్మలాభాత్పరో లాభో నాస్తీతి మునయో విదుః ।**
**తల్లాభార్థం గురుః స్తౌతి స్వాత్మానం పరమేశ్వరమ్ ॥2॥**

ఆత్మలాభాత్ = ఆత్మలాభము కంటె, పరః = శ్రేష్ఠమైన, లాభః = లాభము, న అస్తి ఇతి = లేదని, మునయః = మననశీలురయిన ఋషులు, విదుః = తలచి యుండిరి, తల్లాభార్థం = ఆ లాభము కొఱకు, గురుః = గురువు, స్వాత్మానం = తన ఆత్మయేయైన, పరమేశ్వరం = పరమేశ్వరుని, స్తౌతి = స్తోత్రము చేయుచున్నాడు.

ఆత్మలాభముకంటె శ్రేష్ఠమైన లాభము లేదని ఋషులు తలచియుండిరి. ఆ లాభము కొఱకు గురువు తన ఆత్మయే అయిన పరమేశ్వరుని స్తుతించుచున్నాడు.

**స్వేచ్ఛయా సృష్టమావిశ్య విశ్వం యో మనసి స్థితః ।**
**స్తోత్రేణ స్తూయతేఽనేన స ఏవ పరమేశ్వరః ॥3॥**

స్వేచ్ఛయా = తన ఇచ్ఛచే, సృష్టం = సృజింపబడిన, విశ్వం = జగత్తును, ఆవిశ్య = ప్రవేశించి, యః = ఎవడు, మనసి = మనస్సున, స్థితః = ఉంటున్నాడో, సః = ఆ, పరమేశ్వరః ఏవ = పరమేశ్వరుడే, అనేన= ఈ, స్తోత్రేణ = స్తోత్రముచే, స్తూయతే = స్తుతింపబడుచున్నాడు.

ఏ పరమేశ్వరుడు తన ఇచ్ఛచే నిర్మింపబడిన ఈ జగత్తును ప్రవేశించి మనస్సున ఉంటున్నాడో ప్రతియొక్కని మనస్సునందును కనుపించుకొనుచున్నాడో ఆతడే ఈ స్తోత్రముచే పొగడబడుచున్నాడు.

**అస్తి ప్రకాశత ఇతి వ్యవహారః ప్రవర్తతే ।**
**తచ్చాస్తిత్వం ప్రకాశత్వం కస్మిన్నర్థే ప్రతిష్ఠకమ్ ॥4॥**

అస్తి = ఉన్నది, ప్రకాశతే = మెరయు (కనుపించు) చున్నది, ఇతి= అను, వ్యవహారః = వ్యవహారము, ప్రవర్తతే = నడచుచున్నదో, తత్ = ఆ, అస్తిత్వం = ఉండుట, చ = మరియు, ప్రకాశత్వం = మెరయుట, కస్మిన్= ఏ, అర్థే = పదార్థమున, ప్రతిష్ఠితం = నెలకొనియున్నది.

ఉన్నది, గోచరమగుచున్నది అను వ్యవహారము సమస్త పదార్థములయందును నడచుచునే యుంటున్నది. ఆ ఉండుట, ప్రకాశించుట ఏ పదార్థమునందు ఆశ్రయమును పొందియున్నది?

**కిం తేషు తేషు వార్థేషు కిం వా సర్వాత్మనీశ్వరే ।**
**ఈశ్వరత్వం చ జీవత్వం సర్వాత్మత్వం చ కీదృశమ్ ॥5॥**

తేషు తేషు = ఆయా (వేర్వేరుగా కనుపించు), అర్థేషు కిం = విషయములయందా, వా = లేదా, సర్వాత్మని = సర్వాత్మయగు, ఈశ్వరే కిం = ఈశ్వరునియందా, ఈశ్వరత్వం = ఈశ్వరత్వము, జీవత్వం = జీవత్వము, చ = మఱియు, సర్వాత్మత్వం = సర్వాత్మత్వము, కీదృశం = ఎట్టిది.

ఇది ఆశ్రయమును పొందియుంటున్నది వేర్వేరుగా కన్పించు ఆ యా విషయములయందా? లేదా సర్వాత్మ యగు ఈశ్వరునియందా? ఈశ్వరత్వ జీవత్వ సర్వాత్మత్వములు ఎటువంటివి?

**జానీయా త్తత్కథం జీవః కిం తజ్జ్ఞానస్య సాధనమ్ ।**
**జ్ఞానాత్తస్య ఫలం కిం స్యాదేకత్వం చ కథం భవేత్ ॥6॥**

జీవః = జీవుడు, తత్ =దానిని, కథం = ఎట్లు, జానీయాత్ = తెలిసికొనును, తత్ = ఆ, జ్ఞానస్య = జ్ఞానముయొక్క = జ్ఞానమును పొందు, సాధనం = ఉపాయము, కిం = ఏమి, తస్య = దాని, జ్ఞానాత్ = జ్ఞానమువలన, కిం = ఏమి, ఫలం = ప్రయోజనము, స్యాత్ = అగును, చ = మఱియు, ఏకత్వం = (జీవాత్మ పరమాత్ముల) ఐక్యము, కథం = ఎట్లు, భవేత్ = అగును.

దానిని జీవు డెట్లు తెలిసికొనును? ఆ జ్ఞానమును పొందు ఉపాయమేమి? ఆ జ్ఞానముచే కలుగు ఫలమేమి? జీవాత్మ పరమాత్మల ఐక్య మెట్లు?

**సర్వజ్ఞః సర్వకర్తా చ కథమాత్మా భవిష్యతి ।**
**శిష్యం ప్రతీత్థం పృచ్ఛంతం వక్తుమారభతే గురుః ॥7॥**

ఆత్మా = ఆత్మ, సర్వజ్ఞః = సర్వజ్ఞుడు, చ = మఱియు, సర్వకర్తా= సర్వకర్త, కథం = ఎట్లు, భవిష్యతి = కాగలడు, ఇత్థం = ఇట్లు, పృచ్ఛంతం= అడుగుచున్న, శిష్యంప్రతి = శిష్యుని గుఱించి, గురుః= గురువు, వక్తుం = చెప్పుటకు, ఆరభతే = ప్రారంభించుచున్నాడు.

ఆత్మ సర్వము నెఱిగిన వాడును సర్వకర్తయు నెట్లగును? అని అడుగుచున్న శిష్యుని గూర్చి గురువు ఉపదేశింప నారంభించుచున్నాడు.



**అంతరస్మిన్నిమే లోకా అంతర్విశ్వమిదం జగత్ ।**
**బహిర్వన్మాయయా భాతి దర్పణే స్వశరీరవత్ ॥8॥**

ఇమే = ఈ, లోకాః = లోకములు, అస్మిన్ = ఈ చైతన్యము నందు, అంతః = లోపల(కలవు), ఇదం = ఈ, విశ్వం = ఎల్ల, జగత్ = ప్రపంచము, అంతః = లోపల (కలదు), దర్పణే = అద్దమందు (కనుపించు), స్వశరీరవత్ = తన శరీరమువలె, మాయయా = మాయచే, బహిర్వత్ = బయట నున్నట్లు, భాతి = తోచుచున్నది.

ఈ లోకములు ఈ ప్రపంచమంతయు ఈ ఆత్మయందే ఉన్నవి. అద్దమునందు చూచిన తన శరీరమువలె మాయచే బయట (వేఱుగా) నున్నట్లు కనుపించుచున్నది.

**స్వప్నే స్వాంతర్గతం విశ్వం యథా పృథగవేక్షతే ।**
**తథైవ జాగ్రత్కాలేఽపి ప్రపంచోఽయం వివిచ్యతామ్ ॥9॥**

యథా = ఎట్లు, స్వప్నే = కలలో, స్వాంతర్గతం = తనయందే ఉన్న, విశ్వం = జగత్తు, పృథక్ = వేరుగా, అవేక్షతే = చూస్తున్నాడో, అయం = ఈ, ప్రపంచః = ప్రంచము, జాగ్రత్కాలే అపి = మేల్కొని యున్నపుడుకూడ, తథా = ఏవ = అట్లే అని, వివిచ్యతాం = తెలియబడవలెను.

కలలో ఎట్లు తనలోనే ఉన్న జగత్తు వేరుగా నున్నట్లు కనుపించుచున్నదో మేల్కొనియున్నపుడును ఈ ప్రపంచము ఆత్మయందే ఉన్నను వేరుగా నున్నట్లు కనబడు చున్నదని తెలియవలెను.

**స్వప్నే స్వసత్తైవార్థానాం సత్తా నాన్యేతి నిశ్చితా ।**
**కో జాగ్రతి విశేషోఽస్తి జడానామాశునాశినామ్ ॥10॥**

స్వప్నే = కలలో (అనుభవించు), అర్థానాం = విషయముల, సత్తా= ఉనికి, స్వసత్తా ఏవ = తన ఉనికియే, అన్యా = వేరు, న = కాదు, ఇతి = ఇట్లని, నిశ్చితా = నిశ్చయింపబడినది, జడానాం = అచేతనములైన, ఆశు నాశినాం = త్వరలో నశించువాని, జాగ్రతి = మేల్కొనియున్నపుడు అనుభవించు విషయములయందు, కః = ఏమి, విశేషః = భేదము, అస్తి = కలదు.

కలలో అనుభవించు విషయముల ఉనికియు ఆత్మయొక్క ఉనికియే వేరుకాదని నిశ్చయమైనది. అచేతనములు త్వరలో నశించు నవియునగు విషయములయందు, మేల్కొనియున్నపుడు అనుభవించు విషయములయందు కలలో కన్న విషయములకంటె ఏమి భేదమున్నది?

**స్వప్నే ప్రకాశో భావానాం స్వప్రకాశాన్న హీతరః ।**
**జాగ్రత్యపి తథైవేతి నిశ్చిన్వంతి విపశ్చితః ॥11॥**

స్వప్నే = కలలో, భావానాం = విషయముల, ప్రకాశః = ప్రకాశము, స్వప్రకాశాత్ = తన (ఆత్మ) ప్రకాశముకంటె, ఇతరః = వేరు, న హి = కాదు. జాగ్రతి అపి = మేల్కొని యున్నప్పుడు కూడ, తథా ఏవ = అట్లె, ఇతి= అని, విపశ్చితః = తెలిసినవారు, నిశ్చిన్వంతి = నిశ్చయము చేయు చున్నారు.

కలలో కన్న విషయప్రకాశము ఆత్మప్రకాశము కంటె వేరు కాదు. మేల్కొనియున్నపుడు కనుపించు విషయములయందు కూడా అట్లే అని తెలిసినవారు నిశ్చయించి యున్నారు.

**నిద్రయా దర్శితానర్థాన్న పశ్యతి యథోత్థితః ।**
**సమ్యగ్జ్ఞానోదయా దూర్ధ్వం తథా విశ్వం న పశ్యతి ॥12॥**



యథా = ఎట్లు, ఉత్థితః = లేచియున్నవాడు, నిద్రయా = నిద్రచే, దర్శితాన్ = చూపబడిన, అర్థాన్ = విషయములను, న పశ్యతి = చూచుటలేదో, తథా = అట్లె, సమ్యగ్జ్ఞానోదయాత్ ఊర్ధ్వం = సరియైన తెలివికలిగిన పిదప, విశ్వం = జగత్తును, న పశ్యతి = చూచుట లేదు.

ఎట్లు కలలో కన్న విషయములు మేల్కొనియున్నపుడు కనుపించవో అట్లే సరియైన జ్ఞానము కల్గిన తర్వాత జగత్తుకూడ కనుపించదు.

**అనాదిమాయయా సుప్తో యదా జీవః ప్రబుధ్యతే ।**
**అజన్మ నిద్రమస్వప్నమద్వైతం బుధ్యతే తదా ॥13॥**

యదా = ఎప్పుడు, అనాదిమాయయా = అనాదియగు (ఆదిలేని) మాయచే, సుప్తః= నిద్రలోనున్న (మోహితుడైన) జీవః= జీవుడు, ప్రబుధ్యతే మేల్కొనుచున్నాడో (జ్ఞానమును పొందుచున్నాడో) తదా = అప్పుడు, అజన్మ నిద్రం = పుట్టుక నిద్ర లేని (మోహమునకు వశము కాని) అస్వప్నం = కలలేని, అద్వైతం = అద్వితీయమైన (తన కంటె వేరైన రెండవ వస్తువులేని) తత్త్వము, బుధ్యతే = తెలియును.

ఎప్పుడు అనాదియగు మాయకు వశుడై నిద్రించుచున్న జీవుడు మేల్కొనుచున్నాడో అప్పుడు జన్మ నిద్ర కలలేని అద్వితీయమయిన ఆత్మతత్త్వము శుద్ధ బుద్ధికి గోచరమగును.

**శ్రుత్యాచార్యప్రసాదేన యోగాభ్యాసవశేన చ ।**
**ఈశ్వరానుగ్రహేణాపి స్వాత్మబోధో యదా భవేత్ ॥14॥**

**భుక్తం యథాన్నం కుక్షిస్థం స్వాత్మత్వేనైవ పశ్యతి ।**
**పూర్ణాహంతా కబళితం విశ్వం యోగీశ్వర స్తథా ॥15॥**

శ్రుత్యా = వేదవాక్యము చేతనో, ఆచార్య ప్రసాదేన = గురువుయొక్క ప్రసన్నత చేతనో, యోగాభ్యాసవశేన = యోగాభ్యాసశక్తి చేతనో, ఈశ్వరానుగ్రహేణాపి చ = లేదా, ఈశ్వరానుగ్రహముచేతనో, యదా = ఎప్పుడు, స్వాత్మబోధః = ఆత్మజ్ఞానము, భవేత్ = అగునో, అప్పుడు, భుక్తం= తినిన, కుక్షిస్థం = పొట్టలోనున్న, అన్నం = అన్నమును, యథా= ఎట్లు, ఆత్మత్వేన ఏవ = తాననియే (తన దేహమనియే) పశ్యతి = చూచుచున్నాడో, తథా = అట్లు, యోగీశ్వరః = యోగీశ్వరుడు, పూర్ణాహంతా కబళితం = నిండిన నేను అను భావముచే మ్రింగబడిన, విశ్వం = జగత్తును, (తానే అని తనకంటె వేరుకాదని) పశ్యతి = చూచు (తెలియు) చున్నాడు.

వేదవాక్యము చేతనో, గురుకృప చేతనో, యోగాభ్యాసము చేతనో అథవా ఈశ్వరానుగ్రహము చేతనో ఎప్పుడు ఆత్మజ్ఞానము కలుగునో అప్పుడు భుజించి పొట్టలోనున్న ఆహారమును తన దేహమనియే ఎట్లు సామాన్య మానవుడు తెలియుచున్నాడో అట్లే యోగీశ్వరుడు నిండిన తాననుభావముచే మ్రింగబడిన జగత్తును తాననియే – తన ఆత్మ కంటె వేరు కాదనియే తెలియుచున్నాడు.

**యథా స్వప్నే నృపో భూత్వా భుక్త్వా భోగాన్యథేప్సితాన్ ।**
**చతురంగబలోపేతః శత్రుం జిత్వా రణాంగణే ॥16॥**

**పరాత్పరాజితో భూత్వా వనం ప్రాప్య తపశ్చరన్ ।**
**ముహూర్తమాత్రమాత్మానం మన్యతే కల్పజీవినమ్ ॥17॥**

**తథైవ జాగ్రత్కాలేఽపి మనోరాజ్యం కరోత్యసౌ ।**
**కాలనద్యోఘయోగేన క్షీణమాయుర్న పశ్యతి ॥18॥**

స్వప్నే = కలలో, యథా = ఎట్లు, ముహూర్తమాత్రం = ఒక్క ముహూర్తములోనే, నృపః = రాజు, భూత్వా = అయి, యథేప్సితాన్ = తన ఇచ్ఛ వచ్చినట్లు, భోగాన్ = సుఖములను, భుక్త్వా = అనుభవించి, చతురంగ బలోపేతః = సిద్ధమైన సైన్యముతో కూడినవాడై, రణాంగణే = యుద్ధభూమియందు, శత్రుం = శత్రువును, జిత్వా = జయించి పరాత్ = శత్రువునుండి, పరాజితః భూత్వా = ఓడింపబడినవాడయి, వనం = అడవిని, ప్రాప్య = పొంది, తపః = తపస్సును, చరన్ = చేసి, ఆత్మానం = తనను, కల్పజీవినం = బహుకాలము జీవించియున్నట్లు, మన్యతే = తలచునో, తథా ఏవ = అట్లే, అసౌ = ఈ జీవుడు, జాగ్రత్కాలే అపి = మేల్కొనియున్నపుడు కూడ, మనోరాజ్యం = మనోరాజ్యమును, కరోతి = చేయును. కాలనద్యోఘ యోగేన = కాల నదీ ప్రవాహమున చిక్కుకొనుటచే, క్షీణం = తగ్గుచున్న, ఆయుః = ఆయుస్సును, న పశ్యతి = చూచుట లేదు– తెలియుట లేదు.



కలలో ఎట్లు ఒక్క ముహూర్త మాత్రమున రాజై యథేచ్ఛగా సుఖముల ననుభవించి సజ్జితమైన సేనతో కూడి యుద్ధభూమిలో శత్రువును జయించి శత్రువునుండి ఓడి అడవికి వెళ్ళి తపమాచరించి తనను చిరకాలము జీవించి యున్నట్లు తలచునో అట్లే ఈ జీవుడు మేల్కొనియున్నపుడును మనోరాజ్యమునే చేయుచున్నాడు. కాల నదీ ప్రవాహమున చిక్కుకొని క్షీణించుచున్న ఆయుష్యము నెరుంగుట లేదు.

**మేఘచ్ఛన్నోఽంశుమాలీవ మాయయా మోహితోఽధికమ్ ।**
**కించిత్కర్తా చ కించిజ్జ్ఞో లక్ష్యతే పరమేశ్వరః ॥19॥**

మేఘచ్ఛన్నః = మేఘములచే కప్పబడిన, అంశుమాలీ ఇవ = సూర్యుడువలె, మాయయా = మాయచే, అధికం = హెచ్చుగ, మోహితః= ఆవరింపబడిన, పరమేశ్వరః = పరమాత్మయే, కించిత్కర్తా = అల్పకర్తగాను

మితమగు శక్తి కలవాడుగను, చ = మఱియు, కించిత్‌జ్ఞః = అల్పజ్ఞానము కలవాడుగను, లక్ష్యతే = కనుపించును.

మేఘముల చాటుననున్న సూర్యునివలె మాయచే ఆవరించబడిన పరమేశ్వరుడే మితశక్తి, మితజ్ఞానము కలవాడుగ కనుపించుచున్నాడు.

**యద్యత్కరోతి జానాతి తస్మిన్ తస్మిన్ పరేశ్వరః ।**
**రాజా విద్వాన్ స్వసామర్థ్యాదీశ్వరోఽయమితీర్యతే ॥20॥**

పరమేశ్వరః = పరమేశ్వరుడు, స్వసామర్థ్యాత్ = తన శక్తి వలన, యద్యత్ = ఏది ఏది, కరోతి = చేయుచున్నాడో, జానాతి = తెలియుచున్నాడో, తస్మిన్ తస్మిన్ = ఆ యా సందర్భమున, అయం = ఇతడు, రాజా = రాజు, విద్వాన్ = విద్వాంసుడు, ఈశ్వరః = ఈశ్వరుడు, ఇతి = అని, ఈర్యతే = చెప్పబడుచున్నాడు.

ఆ మాయచే ఆవరింపబడిన పరమేశ్వరుడే తన శక్తిచే దేనిని చేయునో, దేనిని తెలియునో ఆయా సందర్భమున వానినే ఇతడు రాజు, పండితుడు, ఈశ్వరుడు అని యిట్లు జనులు తెలియుదురు.

**జ్ఞానక్రియే శివేనైక్యాత్ సంక్రాంతే సర్వజంతుషు ।**
**ఈశ్వరత్వం చ జీవానాం సిద్ధం తచ్ఛక్తి సంగమాత్ ॥21॥**

శివేన = శివునితో, ఐక్యాత్ = ఏకత్వము నొందుటవలన, సర్వ జంతుషు = సమస్త జీవులయందును, జ్ఞానక్రియే = జ్ఞాన కర్మలు, సంక్రాంతే= చేరియున్నవి. తచ్ఛక్తి సంగమాత్ = అతని శక్తి యొక్క కలయికవలన, జీవానాం = జీవులకు, ఈశ్వరత్వం = ఈశ్వరత్వము, సిద్ధం= సిద్ధించెను.



శివునితో అభిన్నముగా నుండుటవలననే జ్ఞానక్రియలు సర్వ జీవులయందును చేరియున్నవి. అతని శక్తి సంబంధముచే జీవుల ఈశ్వరత్వము సిద్ధించుచున్నది.

**అయం ఘటోఽయం పట ఇత్యేవం నానాప్రతీతిషు ।**
**అర్కప్రభేవ స్వజ్ఞానం స్వయమేవ ప్రకాశతే ॥22॥**

అయం = ఇది, ఘటః = కుండ, అయం = ఇది, పటః = బట్ట, ఇతి ఏవం = అని ఈ విధమైన, నానా ప్రతీతిషు = బహువిధ జ్ఞానములయందు, స్వజ్ఞానం = ఆత్మ జ్ఞానము, అర్కప్రభా ఇవ = సూర్యుని కాంతివలె, స్వయం ఏవ = తానుగానే, ప్రకాశతే = ప్రకాశించుచున్నది.

ఇది కుండ, ఇది బట్ట అన్నట్లు సర్వ జ్ఞానములయందును ఆత్మజ్ఞానము సూర్యుని వెలుగువలె తానుగనే ప్రకాశించుచున్నది.

**జ్ఞానం న చేత్స్వయం సిద్ధం జగదంధం తమో భవేత్ ।**
**న చేదస్య క్రియా కాచిద్వ్యవహారః కథం భవేత్ ॥23॥**

జ్ఞానం = జ్ఞానము, స్వయం సిద్ధం = స్వతస్సిద్ధమైనది (ప్రమాణాంతరాపేక్ష లేనిది)న చేత్ = కానిచో, జగత్ = ప్రపంచము, అంధంతమః = కటిక చీకటిగా, భవేత్ = అయి యుండును. అస్య = దీని, క్రియా = క్రియ, కాచిత్ = ఏదియు, నచేత్ = లేనిచో, వ్యవహారః = కర్తృత్వాది వ్యవహారము, కథం = ఎట్లు, భవేత్ = అగును.

జ్ఞానము స్వతస్సిద్ధము కానిచో, ప్రపంచము కటిక చీకటియైయుండెడిది. దీనిక్రియ ఏదియు లేనిచో కర్తృత్వాది వ్యవహారమెట్లు కాగలదు?

**క్రియా నామ పరిస్పంద పరిణామ స్వరూపిణీ ।**
**స్పందమానే బహిర్జ్ఞానే తదంకురవదుద్భవేత్ ॥24॥**

క్రియా నామ = క్రియ అనునది, పరిస్పంద పరిణామ స్వరూపిణీ= చలన పరిణామరూపమైనది, జ్ఞానే = జ్ఞానము, బహిః = బయట, స్పందమానే = చలించుచుండ, తదంకురవత్ = దాని మొలకవలె, ఉద్భవేత్ = పుట్టును.

క్రియ యనునది చలనము, పరిణామము స్వరూపముగ గలది. జ్ఞానము బయట చలించుచుండ దాని మొలకవలె ఉద్భవించును.

**ఉత్పాద్య ప్రాప్య సంస్కార్య వికార్యోపాశ్రయా క్రియా ।**
**కరోతి గచ్ఛత్యున్మార్ష్టి ఛినత్తీతి ప్రతీయతే ॥25॥**

క్రియా = కార్యము, ఉత్పాద్య ప్రాప్య సంస్కార్య వికార్యోపాశ్రయా= ఉత్పత్తి, ప్రాప్తి, సంస్కారము, వికారము గల ద్రవ్యమును ఆశ్రయించి యుండును. కరోతి = చేయుచున్నాడు, గచ్ఛతి = వెళ్ళుచున్నాడు. ఉన్మార్ష్టి = శుభ్రము చేయుచున్నాడు, ఛినత్తి = ఛేదించుచున్నాడు. ఇతి= అని యిట్లు, ప్రతీయతే = చెప్పబడుచున్నది.

కార్యము ఉత్పత్తియగు, పొందదగు, సంస్కరింపదగు లేదా మారదగు వస్తువును ఆశ్రయించి యుండును. ఘటపటాది వస్తువులను చేయుచున్నాడు. స్థానము నుండి స్థానాంతరము వెళ్ళుచున్నాడు. వస్తువును శుద్ధము చేయుచున్నాడు. లేదా ముక్కలు చేయుచున్నాడు. ఇత్యాదులు ఉదాహరణలు.

**శివో బ్రహ్మాది దేహేషు సర్వజ్ఞ ఇతి భాసతే ।**
**దేవతిర్యఙ్మనుష్యేషు కించిజ్జ్ఞస్తారతమ్యతః ॥26॥**



శివః = శివుడు, బ్రహ్మాది దేహేషు = బ్రహ్మాది దేహముల యందు, సర్వజ్ఞః ఇతి = సర్వజ్ఞుడుగ, భాసతే = కనుపించుచున్నాడు. దేవ తిర్యఙ్మనుష్యేషు = దేవతల, ప్రాణుల మఱియు మనుష్యుల దేహములందు, తారతమ్యతః = హెచ్చు తగ్గు ప్రమాణముల వలన, కించిజ్జ్ఞః = అల్పజ్ఞుడుగ కన్పించుచున్నాడు.

శివుడే బ్రహ్మాది దేహములయందు సర్వజ్ఞుడుగను, దేవప్రాణి మానవ శరీరములయందు తరతమ భావమువలన అల్పజ్ఞుడుగను కనుపించు చున్నాడు.

**జరాయుజోఽండజశ్చైవ స్వేదజః పునరుద్భిదః ।**
**ఏతే చతుర్విధా దేహాః క్రమశో న్యూనవృత్తయః ॥27॥**

జరాయుజః = మావినుండి పుట్టినది, చ ఏవ = మఱియు, అండజః= గ్రుడ్డునుండి పుట్టినది, స్వేదజః = చెమట నుండి పుట్టినది, పునః = మఱియు, ఉద్భిదః = భూమినుండి పుట్టినది, ఏతే = ఈ, చతుర్విధాః= నాల్గువిధములైన, దేహాః = దేహములు, క్రమశః = క్రమముగా న్యూన వృత్తయః = తక్కువ (జ్ఞాన) వృత్తి గలవి.

మావి, గ్రుడ్డు, చెమట మఱియు భూమి నుండి పుట్టునట్టి నాల్గు విధములైన దేహములు క్రమముగ ఒక దానికంటే ఒకటి తక్కువ జ్ఞానవృత్తి గలవి.

**బ్రహ్మాది స్తంబపర్యంతా స్వప్నకల్పైవ కల్పనా ।**
**సాక్షాత్కృతేఽనవచ్ఛిన్న ప్రకాశే పరమాత్మని ॥28॥**

అనవచ్ఛిన్న ప్రకాశే = నిర్విశేషాఖండానంత ప్రకాశ రూపుడైన, పరమాత్మని = పరమాత్మ, సాక్షాత్కృతే = సాక్షాత్కరింపజేసికొనబడినపుడు

బ్రహ్మాది స్తంబపర్యంతా = బ్రహ్మ మొదలు గడ్డిపోచవరకుగల (సకల) కల్పనా = సృష్టియు, స్వప్నకల్పైవ = కలవంటిదే (అగును).

అఖండ ప్రకాశస్వరూప పరమాత్మ సాక్షాత్కారానంతరము బ్రహ్మాదిస్తంబ పర్యంతముగల సృష్టియంతయు కలవలె అవిద్యా కల్పితమని తెలియును.

**అణోరణీయాన్మహతో మహీయానితి వేదవాక్ ।**
**రుద్రోపనిషద ప్యేతం స్తౌతి సర్వాత్మకం శివమ్ ॥29॥**

అణోః = అణువు కంటెను, అణీయాన్ = చిన్నవాడు, మహతః = మహత్తు కంటె, మహీయాన్ పెద్దవాడు, ఇతి = అని, వేదవాక్ = వేదవాక్యము. రుద్రోపనిషత్ అపి = రుద్రోపనిషత్తు కూడ, ఏతం = ఈ, శివం= శివుని, సర్వాత్మకం = సర్వాత్మకుడని, స్తౌతి = స్తుతించుచున్నది.

ఈ పరమాత్మ అణువుకంటె అణువు, మహత్తు కంటె మహత్తు, అని వేదమాత నుడువుచున్నది. ఈ జీవుడే సర్వాత్మ యని రుద్రోపనిషత్తుకూడ ఇతనిని స్తుతించుచున్నది.

**ఈశ్వరో గురురాత్మేతి మూర్తిభేద విభాగినే ।**
**వ్యోమవద్వ్యాప్త దేహాయ దక్షిణామూర్తయే నమః ॥30॥**

ఈశ్వరః = ఈశ్వరుడు, గురుః = గురువు, ఆత్మా = ఆత్మ, ఇతి = అను, మూర్తిభేద విభాగినే = వేర్వేరు రూపములతో విభాగమై కాన్పించు, వ్యోమవత్ = ఆకాశమువలె, వ్యాప్తదేహాయ = వ్యాపించిన రూపముగల, దక్షిణామూర్తయే = దక్షిణామూర్తికి, నమః = నమస్కారము.

ఈశ్వరుడు, గురువు, ఆత్మ అను రూప భేదములతో భిన్నముగ



కనుపించువాడును, ఆకాశమువలె సర్వవ్యాపియై యున్న శ్రీదక్షిణామూర్తికి వందనము.

**ఇతి శ్రీ దక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకే ।**
**ప్రబంధే మానసోల్లాసే ప్రథమోల్లాస సంగ్రహః ॥31॥**

ఇతి = ఇట్లు, శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకే = శ్రీదక్షిణామూర్తి స్తోత్రమును చెప్పునట్టి, మానసోల్లాసే = మానసోల్లాసమను, ప్రబంధే = గ్రంథమున, ప్రథమోల్లాస సంగ్రహః = సంగ్రహమగు మొదటి ఉల్లాసము.

ఇట్లు శ్రీదక్షిణామూర్తి స్తోత్రమును వివరించు మానసోల్లాసమను గ్రంథమున సంగ్రహమైన ప్రథమోల్లాసము సమాప్తము.

హరిః ఓం తత్సత్



శ్రీ సురేశ్వరాచార్య విరచితః - మానసోల్లాసః

## ద్వితీయోల్లాసము

**బీజస్యాంతరివాంకురో జగదిదం ప్రాఙ్నిర్వికల్పం పున**
**ర్మాయా కల్పిత దేశ కాలకలనా వైచిత్ర్య చిత్రీకృతమ్ ।**
**మాయావీవ విజృంభయత్యపి మహాయోగీవ యః స్వేచ్ఛయా**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 2**

బీజస్య = బీజముయొక్క, అంతః = లోపల, అంకురః ఇవ = మొలకవలె, నిర్వికల్పం = వికల్పరహిత (అవ్యక్త) మైయుండి. పునః = తరువాత, మాయాకల్పిత దేశకాల కలనా వైచిత్ర్య చిత్రీకృతం = మాయచే కలిగిన దేశకాలముల సంయోగముచే నానావిధముగ కనుపించు, ఇదం= ఈ, జగత్ = జగత్తును, మాయావీ ఇవ = మాయావివలె, అపి = మఱియు-లేదా, మహాయోగీ ఇవ = యోగీశ్వరునివలె, స్వేచ్ఛయా = తన ఇచ్ఛామాత్రముచే, యః = ఎవడు, విజృంభయతి = వికసింప జేయుచున్నాడో, తస్మై =ఆ, శ్రీగురుమూర్తయే = శ్రీ గురుస్వరూపుడైన, శ్రీదక్షిణామూర్తయే = శ్రీదక్షిణామూర్తికి, ఇదం = ఈ, నమః = వందనము.

బీజములోని మొలకవలె సృష్టికి పూర్వము నిర్వికల్పముగ నుండి అటుపిమ్మట మాయచే కలిగిన దేశకాలముల సంయోగముచే పలువిధములుగ కనబడుచున్న ఈజగత్తును ఎవడు మాయావివలెనో అథవా యోగీశ్వరునివలెనో తన ఇచ్ఛామాత్రముచే వికసింపజేయుచున్నాడో ఆ శ్రీగురు స్వరూపుడైన శ్రీ దక్షిణామూర్తికి నమస్కారము.



మానసోల్లాసః

వైశేషికమతము

**ఉపాదానం ప్రపంచస్య సంయుక్తాః పరమాణవః ।**
**మృదన్వితో ఘట స్తస్మాద్భాసతే నేశ్వరాన్వితః ॥1॥**

సంయుక్తాః = చేరియున్న, పరమాణవః = పరమాణువులు, ప్రపంచస్య = జగత్తుకు, ఉపాదానం = ఉపాదానకారణము, తస్మాత్ = అందువలన, ఘటః = కుండ, మృదన్వితః = మట్టితో కూడినదై, భాసతే = కనుపించుచున్నది. ఈశ్వరాన్వితః = ఈశ్వరునితో కూడినదిగ, న భాసతే= కనుపించుటలేదు.

జగత్తుకు ఉపాదానకారణము కూడియున్న పరమాణువులే. కాబట్టి కుండ మట్టితో కూడినదిగ కనుపించుచున్నదే కాని ఈశ్వరునితో కూడినదిగ కనుపించుటలేదు.

**పరమాణుగతా ఏవ గుణా రూపరసాదయః ।**
**కార్యే సమానజాతీయ మారభంతే గుణాంతరమ్ ॥2॥**

రూపరసాదయః = రూపము రసము మున్నగు, గుణాః = గుణములు, పరమాణుగతాః ఏవ = కారణమగు పరమాణువులయందే ఉండుచు, సమానజాతీయం = సమానజాతీయమగు, గుణాంతరం = వేరుగుణములను, కార్యే = కార్య(ప్రపంచ)మందు, ఆరభంతే = ఆరంభించుచున్నవి.

రూపరసాదిగుణములు కారణరూప పరమాణువులయందే ఉండుచు, కార్యరూపప్రపంచమందు సమానజాతీయమైన ఇతర గుణములను ఆరంభించుచున్నవి.

**కార్యం యత్ర సమన్వేతి కారణం సమవాయి తత్ ।**
**చక్రాద్యం సాధనం యత్తు ఘటస్యాసమవాయి తత్ ॥3॥**

యత్ర = దేనియందు, కారణం = కారణము, కార్యం = కార్యమును, సమన్వేతి = చేరియుండునో, తత్ = ఆ కారణము, సమవాయి = సమవాయి యను పేరుగలది. ఘటస్య = కుండకు, సాధనం ఉపకరణమైన, చక్రాద్యం= చక్రము మున్నగునది, అసమవాయి = అసమవాయి యను పేరుగలది.

ఏ కారణము కార్యమందు చేరుకొనియేయుండునో అది సమవాయి కారణము. ఏది కార్యమందు చేరక కార్యో(ఘటో)త్పత్తికి చక్రాదులవలె సాధనమగునో అది అసమవాయి కారణము.

**సమవాయిని తిష్ఠేద్యత్సమవాయ్యాశ్రయే తథా ।**
**కార్యేఽవధృతసామర్థ్యం కల్ప్యతేఽసమవాయి తత్ ॥4॥**

యత్ = ఏది, కార్యే = కార్యమందు, అవధృతసామర్థ్యం = సామర్థ్యమునుపొంది కార్యోత్పత్తికి ఆవశ్యకమై, సమవాయిని = సమవాయి కారణమున, తథా = అట్లే, లేదా, సమవాయ్యాశ్రయే = సమవాయికారణాశ్రయ (అధిష్ఠాన)మున, తిష్ఠేత్ = ఉండునో, తత్ = అది, అసమవాయి = అసమవాయి కారణము, కల్ప్యతే = అగును.

ఏ కారణము కార్యోత్పత్తికి ఆవశ్యకమై సమవాయి కారణముననో లేదా సమవాయికారణాధిష్ఠానముననో నెలకొనియుండునో అది అసమయాయికారణము.

**నిమిత్తం కారణం తేషామీశ్వరశ్చ కులాలవత్ ।**
**యత్కార్యం జాయతే యస్మా త్తస్మిం స్తత్ప్రతితిష్ఠతి ॥5॥**



తేషాం = వాని (జగత్తులోని సమస్త వస్తువుల) నిమిత్తం కారణం= నిమిత్తకారణము, కులాలవత్ = (కుండకు) కుమ్మరివలె, ఈశ్వరః = ఈశ్వరుడు. యస్మాత్ = ఏ కారణమునుండి, యత్ = ఏ, కార్యం = కార్యము, జాయతే = పుట్టునో, తస్మిన్ = ఆ కారణమందు, తత్ = ఆ కార్యము, ప్రతితిష్ఠతి = నెలకొనియుండును.

ఈశ్వరుడు కుండకు కుమ్మరివలె ఎల్లవస్తువులకు నిమిత్త కారణము. ఏ కారణము నుండి ఏ కార్యము పుట్టునో ఆ కారణమున ఆ కార్యము నెలకొనియుండును.

**మృత్తికాయాం ఘట స్తంతౌ పటః స్వర్ణేఽఙ్గులీయకమ్ ।**
**ఇతి వైశేషికాః ప్రాహు స్తథా నైయ్యాయికా అపి ॥6॥**

మృత్తికాయాం = మట్టిలో, ఘటః = కుండ, తంతౌ = దారములో, పటః = బట్ట, స్వర్ణే = బంగారంలో, అంగులీయకం = ఉంగరము (నెలకొనియున్నవి) ఇతి = అని యిట్లు, వైశేషికాః = వైశేషికులు, తథా యట్లే, నైయ్యాయికాః అపి = నైయ్యాయికులుకూడ, ప్రాహుః = చెప్పుచున్నారు.

మట్టిలో కుండ, దారములో బట్ట, బంగారంలో ఉంగరము నెలకొనియున్నవని వైశేషికులమతము. నైయ్యాయికుల మతమును ఇదియే.

**రజస్సత్త్వం తమశ్చేతి ప్రధానస్య గుణాస్త్రయః ।**
**రజో రక్తం చలం తేషు సత్త్వం శుక్లం ప్రకాశకమ్ ॥7॥**

**తమః కృష్ణం చావరకం సృష్టిస్థిత్యంతహేతవః ।**
**ఇతి సాంఖ్యాశ్చ భాషంతే తేషాం దూషణముచ్యతే ॥8॥**

ప్రధానస్య = ప్రకృతియొక్క, గుణాః = గుణములు, రజః = రజస్సు, సత్త్వం = సత్త్వము, చ = మఱియు, తమః = తమస్సు, ఇతి = అని యిట్లు, త్రయః = మూడు. తేషు = వానిలో, రజః = రజస్సు, రక్తం = ఎఱ్ఱని వన్నె గలది, చలం = చలనశీలమైనది, సత్త్వం = సత్త్వము, శుక్లం = తెల్లనిది, ప్రకాశకం = (వస్తువులను) తెలియునట్లు చేయునది, తమః = తమస్సు, కృష్ణం = నల్లనిది, చ = మఱియు, ఆవరకం = (వస్తువులను) కనబడకుండచేయునది, సృష్టి స్థిత్యంతహేతవః = (ఈ మూడు గుణములు జగత్తుయొక్క) పుట్టుక ఉనికి నాశములకు (క్రమముగ) కారణములు, ఇతి = అని, సాంఖ్యాః = సాంఖ్యులు, భాషంతే = చెప్పుచున్నారు, తేషాం= వారి (వైశేషిక నైయ్యాయిక సాంఖ్య మతముల) దూషణం = ఖండనము, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

రజస్సు, సత్త్వము. తమస్సు ఈ మూడు ప్రకృతిగుణములు. వీనియందు రజస్సు ఎఱ్ఱనిది, చలనశీలమైనది. సత్త్వము తెల్లనిది, వస్తువులను ప్రకాశింపజేయునది. తమస్సు నల్లనిది, వస్తువులను కనబడకుండచేయునది. ఈ త్రిగుణములు క్రమముగ జగత్తుయొక్క సృష్టి స్థితి లయములకు కారణమని సాంఖ్యులు చెప్పుచున్నారు. ఈ 3 (వైశేషిక నైయ్యాయిక సాంఖ్య) మతముల ఖండన ఇపుడు చెప్పబడును.

**అంకురాదిఫలాంతేషు కార్యేష్వస్తిత్వమిష్యతే ।**
**కుత ఆగత్య సంబద్ధా వటబీజేషు తే కణాః ॥9॥**

అంకురాది ఫలాంతేషు = మొలకనుండి (మొదలై) పండువఱకుగల, కార్యేషు = కార్యములయందు, అస్తిత్వం = ఉండుట, ఇష్యతే = అంగీకరింపబడినది, వటబీజేషు = మఱ్ఱివిత్తనములయందు, తే = ఆ,



కణాః = పరమాణువులు, కుతః = ఎక్కడనుండి, ఆగత్య = వచ్చి, సంబద్ధాః= చేరికొనినవి?

మొలకనుండి పండువఱకుగల కార్యశ్రేణియందు ప్రతి యొక్క అవస్థలోను ఉనికిని ఎల్లరు అంగీకరించియే తీరవలె. పరమాణువులు ఎక్కడనుండి వచ్చి మఱ్ఱివిత్తనములయందు చేరికొనినవి? (పరమాణుల చేరికకు కారణమేమి?)

**కారాణానుగతం కార్యం ఇతి సర్వైశ్చ సమ్మతమ్ ।**
**తస్మాత్సత్తా స్ఫురత్తా చ సర్వత్రాప్యనువర్తతే ॥** **10**

కార్యం = కార్యము, కారణానుగతం = కారణము వెంట నుండును, ఇతి = అని, సర్వైశ్చ = ఎల్లరచేతను, సమ్మతం = అంగీకరింపబడియున్నది, తస్మాత్ = అందువలన, సత్తా = ఉనికి, చ = మఱియు, స్ఫురత్తా = ప్రకాశము, సర్వత్ర అపి = ఎల్లచోట్ల, ప్రతివస్తువునందును, అనువర్తతే = చేరియున్నది.

కార్యము కారణముతో చేరియుండునని ఎల్లరు ఒప్పుకొను చున్నారు. కావుననే ఉనికి, ప్రకాశము ఎల్లవస్తువులలో చేరియున్నవి.

**పుష్పే ఫలత్వమాపన్నే క్షీరే చ దధితాం గతే,**
**విజాతీయా ప్రతీయంతే గుణా రూపరసాదయః.** **11**

పుష్పే = పూవు, ఫలత్వం = పండుతనమును, ఆపన్నే = పొందగా, చ = మఱియు, క్షీరే = పాలు, దధితాం = పెరుగుతనమును, గతే = పొందగా, రూపరసాదయః = రూపము రసము మొదలగు, గుణాః = గుణములు, విజాతీయాః = విజాతీయములై – పూర్వగుణములకంటె వేఱై, ప్రతీయంతే = కన్పట్టుచున్నవి.

పూవు పండుగా, పాలు పెరుగుగా ఐనపుడు వానిలో కనబడు రూప రసాదిగుణములు పూర్వస్థితికంటె వేరుగా నుండుట కనబడుచున్నది.

**కారణం కార్యమంశోఽంశీ జాతివ్యక్తీ గుణీ గుణః ।**
**క్రియా క్రియావానిత్యాద్యాః ప్రకాశస్యైవ కల్పనా ॥12॥**

కారణం = కారణము, కార్యం = కార్యము, అంశః = భాగము, అంశీ = భాగముగలది, జాతివ్యక్తీ = జాతి, వ్యక్తి, గుణీ = గుణముగలది, గుణః = గుణము, క్రియా = పని, క్రియావాన్ = పనిగలది, ఇత్యాద్యాః = ఇత్యాదులు, ప్రకాశస్య = (ఒకటే ఐన) ప్రకాశముయొక్క, కల్పనా ఏవ = కల్పనమాత్రమె.

కారణము, కార్యము, అంశము, అంశి, జాతి, వ్యక్తి, గుణము, గుణి, క్రియ క్రియగలది ఇత్యాదులెల్ల అద్వితీయ ప్రకాశమున మాయాకల్పనలు మాత్రమే.

**చైతన్యం పరమాణూనాం ప్రధానస్యాపి నేష్యతే ।**
**జ్ఞానక్రియే జగత్క్లుప్తౌ దృశ్యేతే చేతనాశ్రయే ॥13॥**

జగత్క్లుప్తౌ = జగన్నిర్మాణకార్యమున, పరమాణూనాం = పరమాణువుల, అపి = మఱియు, లేదా, ప్రధానస్య = ప్రకృతియొక్క, చైతన్యం = జ్ఞానలక్షణముగా నుండుట, న ఇష్యతే = ఒప్పుకొనబడదు, జ్ఞాన క్రియే = జ్ఞానక్రియలు, చేతనాశ్రయే = చేతనమును ఆశ్రయించియున్నట్లు, దృశ్యేతే = చూడబడుచున్నవి.

జగన్నిర్మాణ కార్యమున పరమాణువులకు లేదా ప్రకృతికి చైతన్యమును ఒప్పుకొనలేదు. జ్ఞాన కర్మలు చేతనాశ్రయములుగా కనబడుచున్నవి.



**కాలరూపక్రియాశక్త్యా క్షీరాత్పరిణమేద్దధి ।**
**జ్ఞాతృజ్ఞానజ్ఞేయరూపం జ్ఞానశక్త్యా భవేజ్జగత్ ॥14॥**

కాలరూపక్రియాశక్త్యా = కాలరూప(ఈశ్వర) క్రియా శక్తిచే, క్షీరాత్ = పాలనుండి, దధి = పెరుగు, పరిణమేత్ = పరిణామమగును, జ్ఞానశక్త్యా = ఈశ్వరజ్ఞానశక్తిచే, జ్ఞాతృజ్ఞాన జ్ఞేయరూపం = తెలియువాడు, తెలివి, తెలియదగినది అను రూపముగల, జగత్ = ప్రపంచమగును.

కాలరూప (ఈశ్వర) క్రియాశక్తిచే పాలు పెరుగుగ మారును, ఈశ్వర జ్ఞానశక్తిచే జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము అను రూపముగల ప్రపంచమగును.

**జ్ఞానం ద్విధా వస్తుమాత్రద్యోతకం నిర్వికల్పకమ్ ।**
**సవికల్పం తు సంజ్ఞాది ద్యోతకత్వాదనేకధా ॥15॥**

జ్ఞానం = జ్ఞానము, ద్విధా = రెండు విధములైనది, వానిలో, నిర్వికల్పకం = నిర్వికల్పకజ్ఞానము, వస్తుమాత్రద్యోతకం = వస్తువును మాత్రము కనబరచును- వస్తువు ఉండుట మాత్రము ప్రకాశింపజేయును, గుణము మున్నగునవి ఇట్టి జ్ఞానమునకు విషయము కదా. సవికల్పంతు = సవికల్ప జ్ఞానమో- ఇది విశేషణ గ్రాహియగు జ్ఞానము, సంజ్ఞాదిద్యోతకత్వాత్ = (నామరూపాది) సంజ్ఞాదులనే కనబరచుటవలన, అనేకధా బహువిధమైనది.

జ్ఞానము రెండు విధములు. వీనిలో నిర్విశేషజ్ఞానము వస్తు మాత్ర ప్రకాశకము. సవిశేషజ్ఞానము నామరూపాది విశేషణ ప్రకాశ మగుటచే బహువిధమైనది.

**సంకల్పసంశయభ్రాంతిస్మృతి సాదృశ్య నిశ్చయాః ।**
**ఊహోఽనధ్యవసాయశ్చ తథాన్యేఽనుభవా అపి ॥16॥**

సంకల్ప సంశయభ్రాంతి స్మృతి సాదృశ్యనిశ్చయాః = కల్పన, సందేహము, భ్రమ, జ్ఞాపకము, పోలిక, నిశ్చయము, ఊహః = ఊహ, చ= మఱియు, అనధ్యవసాయః = తెలియకుండుట, తథా = అట్లె, అన్యే = వేరు, అనుభవాః అపి = అనుభవములుకూడ, సవికల్పకజ్ఞాన వైవిధ్యమునకు ఉదాహరణలు.

కల్పన, సంశయము, భ్రాంతి, స్మృతి, పోలిక, నిశ్చయము, ఊహ తెలియకుండుట, ఇతర సకలానుభవములు సవికల్పక జ్ఞానవైవిధ్యోదాహరణలు.

## ప్రమాణములు

**ప్రత్యక్షమేకం చార్వాకాః కణాదసుగతౌ పునః ।**
**అనుమానం చ తచ్చాపి సాంఖ్యాః శబ్దం చ తే అపి ॥17॥**

చార్వాకాః = చార్వాకులు, ప్రత్యక్షం = ప్రత్యక్ష ఇంద్రియ జన్యజ్ఞానమును, ఏకం = ఒకదానిని, పునః = ఐతే, కణాదసుగతౌ = కణాదబుద్ధులు, తత్ = దానిని, చ అపి = ఇంకను, అనుమానం = అనుమాన (విచారజన్య జ్ఞాన)మును, సాంఖ్యాః = సాంఖ్యులు, తే = ఆ రెంటిని, అపి = మఱియు, శబ్దం (ఆప్తవాక్య జన్యజ్ఞానమును.)

చార్వాకులు ఇంద్రియ జన్యజ్ఞానము నొక్కదానిని, కణాదబుద్ధులు దీని జతకు విచారజన్య జ్ఞానమును, సాంఖ్యులు ఈ రెంటి జతకు ఆప్తవాక్య జన్యజ్ఞానమును (ప్రమాణములని చెప్పుచున్నారు.)

**న్యాయైకదేశినోఽ ప్యేవముపమానం చ కేచన ।**
**అర్థాపత్త్యా సహైతాని చత్వార్యాహ ప్రభాకరః ॥18॥**



అపి = మఱియు, న్యాయైకదేశినః = నైయ్యాయికులలో కొందరు, ఏవం = ఇట్లె, కేచన = మఱికొందఱు, ఉపమానం చ = పోలికను, ప్రభాకరః = ప్రభాకరుడు - మీమాంసకులలో ఒకపక్షపు ఆచార్యుడు, ఏతాని = వీనిని, చత్వారి = నాల్గింటిని, అర్థాపత్త్యా సహ = అర్థాపత్తితోను, ఆహ = చెప్పుచున్నాడు.

నైయ్యాయికులలో కొందఱు సాంఖ్యులవలెను, మఱి కొందఱు ఆ మూడింటి జతకు ఉపమానమును, మీమాంసకులలో ఒక పక్షపు ఆచార్యుడగు ప్రభాకరుడు పై జెప్పిన నాల్గింటి జతకు అర్థాపత్తిని కూడ ప్రమాణమని చెప్పుచున్నాడు.

**అభావషష్ఠాన్యేతాని భాట్టా వేదాంతిన స్తథా ।**
**సంభవైతిహ్యయుక్తాని తాని పౌరాణికా జగుః ॥19॥**

భాట్టాః = మీమాంసకులలో వేరుపక్షము వారైన భట్టమతానుయాయులు, తథా = మఱియు, వేదాంతినః = వేదాంతులు, ఏతాని = వీనిని, అభావషష్ఠాని = అభావ (ఏదేని ఒక వస్తువు లేదను జ్ఞానమును చేర్చి ఆరింటిని, పౌరాణికాః = పౌరాణికులు, తాని = వానిని, సంభవైతిహ్యయుక్తాని = సంభవ,ఐతిహ్యములతో కూడినవనియు, జగుః= చెప్పిరి.

మీమాంసకులలో ఒక తెగవారైన భట్టమతానుయాయులు, వేదాంతులు కూడ పై జెప్పినవాని జతకు అభావమును చేర్చి ఆరు ప్రమాణములనియు, పౌరాణికులు వీని జతకు సంభవమును ఐతిహ్యమును కూడ చేర్చవలెనని చెప్పుచున్నారు.

**ద్రవ్యం గుణ స్తథా కర్మ సామాన్యం సవిశేషకమ్ ।**
**సమవాయం చ కాణాదాః పదార్థాన్ షట్ ప్రచక్షతే ॥20॥**

కాణాదాః = కణాద మతానుయాయులు = వైశేషికులు, పదార్థాన్= పదార్థములను, ద్రవ్యం = ద్రవ్యము, గుణః = గణము, కర్మ = పని, సామాన్యం = జాతి(ఏదేని ఒక గుణము అనేక పదార్థములయందున్నచో ఆ సామాన్యగుణమును కల్గియున్నందున ఆ పదార్థములన్నియు ఒక జాతికి చేరినవి అను వ్యవహారమునకు కారణమైన ధర్మము) సవిశేషకం = విశేష(భేద)ముతో కూడి (భేదమన ప్రతి పదార్థమును ఇతర పదార్థముకన్న వేరు అను వ్యవహారమునకు కారణమైన ధర్మము) చ = మఱియు, సమవాయః= సమవాయ (రెండు పదార్థముల మిక్కిలి దగ్గర సంబంధ)ము, ఇట్లు, షట్ = ఆరు అని, ప్రచక్షతే = చెప్పుచున్నారు.

వైశేషికులు పదార్థములు ద్రవ్య గుణ కర్మ జాతి భేద సమవాయములు ఆరు అని చెప్పుచున్నారు.

**నవ ద్రవ్యాణి భూతాని దిక్కాలాత్మమనాంసి చ ।**
**చతుర్వింశతిరేవ స్యుర్గుణాః శబ్దాది పంచకమ్ ॥21॥**

**పరిమాణం చ సంఖ్యా చ ద్వౌ సంయోగవిభాగకౌ ।**
**స్వభావతః పృథక్త్వం చ గురుత్వం ద్రవతా పునః ॥22॥**

**పరత్వం చాపరత్వం చ స్నేహః సంస్కార ఇత్యపి ।**
**ధీర్ద్వేషసుఖదుఃఖేచ్ఛా ధర్మాధర్మ ప్రయత్నకాః ॥23॥**

ద్రవ్యాణి = ద్రవ్యములు, నవ = తొమ్మిది, భూతాని = భూమి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము అవి పంచ భూతములు, చ = మఱియు, దిక్కాలాత్మమనాంసి = దిక్కు, కాలము, ఆత్మ, మనస్సు అని నాల్గు, గుణాః = గుణములు, స్వభావతః = స్వాభావికముగ, చతుర్వింశతిః ఏవ = ఇరువది నాల్గే, స్యుః = ఉందురు, శబ్దాది పంచకం = శబ్ద స్పర్శ రూపరస గంధములైదు, చ = మఱియు, పరిమాణం = పరిమాణము, చ= మఱియు, సంఖ్యా = సంఖ్య, సంయోగ విభాగకౌ = సంయోగవిభాగములు, ద్వౌ = రెండు, పృథక్త్వం = వేరుగా నుండుట, గురుత్వం = దేశకాలములందు దూరముగా నుండుట, చ = మఱియు, అపరత్వం = దేశకాలములయందు దగ్గరగా నుండుట, స్నేహః = జిడ్డు, అపి = మఱియు, సంస్కారః = సంస్కారము, ధీర్ద్వేష సుఖ దుఃఖేచ్ఛా ధర్మాధర్మ ప్రయత్నకాః = బుద్ధి, ద్వేషము సుఖము, దుఃఖము, ఇచ్ఛ, ధర్మము, అధర్మము, ప్రయత్నము, ఇతి = అని.



పృథివ్యప్తేజో వాయ్వాకాశములను పంచ భూతములు దిక్కాలాత్మ మనస్సులు నాల్గు చేరి తొమ్మిది ద్రవ్యములు. శబ్దస్పర్శ రూప రస గంధములు ఐదు పరిమాణము, సంఖ్య, సంయోగ విభాగములు, పృథక్త్వము, గురుత్వము, ద్రవత్వము, పరత్వము, స్నేహము, సంస్కారము, బుద్ధి, ద్వేషము సుఖము ఇచ్ఛ ధర్మము అధర్మము ప్రయత్నము చేరి ఇరువది నాల్గు గుణములు.

**సంస్కారస్త్రివిధో వేగ ఇష్వా దేర్గతికారణమ్ ।**
**దృష్ట శ్రుతానుభూతార్థ స్మృతిహేతుశ్చ భావనా ॥24॥**

**స్థితస్థాపకతా నామ పూర్వావస్థితి కారణమ్ ।**
**ఆకృష్ట శాఖాభూర్జాదౌ స్పష్టమేవోపలక్ష్యతే ॥25॥**

సంస్కారః = సంస్కారము, త్రివిధః = మూడు విధములైనది, ఇష్వాదేః = బాణాదుల, గతి కారణం = గమన కారణమగు, వేగః = వేగము, చ = మఱియు, దృష్టశ్రుతానుభూతార్థస్మృతిహేతుః = కన్న విన్న లేదా అనుభవించిన విషయ స్మరణ కారణమగు, భావనా = భావన,

స్థితస్థాపకతా నామ = స్థితస్థాపకత యనునది, పూర్వావస్థితి కారణం = ముందున్న స్థితిని పొందుటకు కారణమగు (గుణము)ఆకృష్ట శాఖా భూర్జాదౌ= లాగబడిన చెట్టుకొమ్మ భూర్జ పత్రాదులయందు, స్పష్టమేవ = స్పష్టముగనే, ఉపలక్ష్యతే = కనబడును.

సంస్కారమను గుణము మూడు విధములు-1. విడిచిన బాణాదుల గమనకారణమగు వేగము,2. కని విని అనుభవించిన విషయముల స్మరణ కారణమగు భావన, 3. పూర్వ మున్న స్థితిని పొందించు శక్తిగల స్థితిస్థాపకత యను గుణము వంచి విడిచిన కొమ్మ భూర్జపత్రాలు మున్నగువానియందు స్పష్టముగ కనుపించును.

**ఉత్క్షేపణ మపక్షేపో గమనం చ ప్రసారణమ్ ।**
**ఆకుంచనమితి ప్రాహుః కర్మ పంచవిధం బుధాః ॥26॥**

బుధాః = పండితులు, కర్మ = కర్మను, ఉత్క్షేపణం = పైకి వేయుట, అపక్షేపః = క్రిందికి వేయుట, గమనం = పొందుట, ప్రసారణం = చాచుట, ఆకుంచనం = ముడుచుకొనుట, ఇతి = అని, పంచవిధం = ఐదువిధములుగా, ప్రాహుః = చెప్పుచున్నారు.

కర్మ పైకి వేయుట, క్రిందికి వేయుట, పొందుట, చాచుట, ముడుచుకొనుట ఇట్లు ఐదు విధములని పండితులు పలుకుచున్నారు.

**సామాన్యం ద్వివిధం ప్రోక్తం పరం చాపరమేవ చ ।**
**పరం సత్తైవ సర్వత్ర తదనుస్యూత వర్తనమ్ ॥27॥**

**ద్రవ్యత్వం చ గుణత్వాద్యం సామాన్యమపరం తథా ।**
**విశేషాః స్యురనంతాస్తే వ్యావృత్తిజ్ఞానహేతవః ॥28**



సామాన్యం = సామాన్యము, ద్వివిధం = రెండు విధములని, ప్రోక్తం = చెప్పబడినది. పరం = పెద్దది, చ = మఱియు,అపరం = చిన్నది, సత్ ఏవ = ఉనికియే. తథా అట్లు, తదనుస్యూతవర్తనం = దానిననుసరించి కలిగిన, ద్రవ్యత్వం = ద్రవ్యత్వము, చ = మఱియు, గుణత్వాద్యం = గుణత్వము మొదలైనది, అపరం = చిన్న, సామాన్యం = సామాన్యము, వ్యావృత్తిజ్ఞానహేతవః = భేదజ్ఞాన కారణములగు, విశేషాః = విశేషములు, అనంతాః = అనంతములై-లెక్కలేనన్ని, స్యుః = ఉండును.

సామాన్యము రెండువిధములు. పెద్దది మఱియు చిన్నది. అన్నిటికంటె పెద్ద సామాన్యము ఉనికియే. దాని ననుసరించి కలిగిన (దానియందణగియున్న) ద్రవ్య గుణముల ఉనికి ఇత్యాదులు చిన్న సామాన్యములు. భేద జ్ఞాన కారణములైన విశేషములు అసంఖ్యేయములుగా నున్నవి.

**రూపస్యేవ ఘటే నిత్యః సంబంధః సమవాయకః ।**
**కాలాకాశదిగాత్మానో నిత్యాశ్చ విభవశ్చ తే ॥29॥**

ఘటే = కుండలో, రూపస్య ఇవ = రూప (సంబంధ)ము వలె, నిత్యః = నిత్యమైన, సంబంధః = సంబంధము, సమవాయకః = సమవాయము, కాలాకాశదిగాత్మానః = కాలము, ప్రకాశము, దిక్కు, ఆత్మ ఇవి, నిత్యాః = నిత్యములు, చ = మఱియు, తే = అవి, విభవః చ = విభువులు కూడ.

ఘటమందు రూపసంబంధమువలె నిత్యమైన సంబంధమునకు సమవాయమని పేరు. కాలము, ఆకాశము, దిక్కు, ఆత్మ ఇవి నిత్యములు (ఎల్లప్పుడు ఉండునవి) విభువులు మూర్త ద్రవ్య సంయోగము గలవి) కూడ.

**చతుర్విధాః పరిచ్ఛిన్నా నిత్యాశ్చ పరమాణవః ।**
**ఇతి వై శేషికమతే పదార్థాః షట్ ప్రకీర్తితాః ॥30॥**

చతుర్విధాః = నాల్గు విధములైన, పరమాణవః = పరమాణువులు, పరిచ్ఛిన్నాః = వేర్వేరై (యున్నవి), చ = మఱియు, నిత్యాః = నిత్యములు, ఇతి = అని, వైశేషికమతే = వైశేషికులమతమున, షట్ = ఆరు, పదార్థాః= పదార్థములు, ప్రకీర్తితాః = చెప్పబడినవి.

చతుర్విధ పరమాణువులు వేర్వేరుగాను నిత్యముగాను ఉన్నవి. ఇట్లు వైశేషిక మతమున ఆరు పదార్థములు చెప్పబడినవి.

**సాంఖ్య తత్త్వములు**

**మాయా ప్రధానమవ్యక్త మవిద్యాజ్ఞానమక్షరమ్ ।**
**అవ్యాకృతం చ ప్రకృతి స్తమ ఇత్యభిధీయతే ॥31॥**

ప్రకృతిః = ప్రకృతి, మాయా = మాయ, ప్రధానం = ప్రధానము, అవ్యక్తం = అవ్యక్తము, అవిద్యా = అవిద్య, అజ్ఞానం = అజ్ఞానము, అక్షరం= అక్షరము, అవ్యాకృతం = అవ్యాకృతము, చ మఱియు, తమః = తమస్సు, ఇతి = అని, అభిధీయతే = పిలువబడుచున్నది.

మూల ప్రకృతికి మాయ, ప్రధానము, అవ్యక్తము, అవిద్య, అజ్ఞానము, అక్షరము, అవ్యాకృతము, తమస్సు అను పేర్లు కలవు.

**మాయాయాం బ్రహ్మచైతన్య ప్రతిబింబానుషంగతః ।**
**మహత్కాలపుమాంసః స్యుః మహత్తత్త్వాదహంకృతిః ॥32॥**

మాయాయాం = మాయయందు, బ్రహ్మచైతన్య ప్రతిబింబానుషంగతః = బ్రహ్మచైతన్య ప్రతిబింబ సంపర్కము వలన, మహత్కాల పుమాంసః = మహత్తు, కాలము, పురుషుడు అను తత్త్వములు, స్యుః = అగును, మహత్తత్త్వాత్ = మహత్తత్త్వమునుండి, అహంకృతిః = అహంకారము(పుట్టును)

మాయయందు బ్రహ్మచైతన్య ప్రతిబింబ సంపర్కమువలన మహత్తు, కాలము, పురుషుడు అను తత్త్వములు, మహత్తత్త్వమునుండి అహంకారము పుట్టుచున్నది.



**తామసాత్స్యురహంకారాత్ఖానిలాగ్న్యంబుభూమయః ।**
**శబ్దః స్పర్శశ్చ రూపం చ రసోగంధోఽప్యనుక్రమాత్ ॥33॥**

**ఇంద్రియాణాం చ విషయా భూతానామపి తే గుణాః ।**
**దేవాః సదాశివ శ్చేశో రుద్రో విష్ణుశ్చతుర్ముఖః ॥34॥**

తామసాత్ = తామసమైన, అహంకారాత్ = అహంకారమునుండి, అనుక్రమాత్ = క్రమముగ, ఖానిలాగ్న్యంబు భూమయః = ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి, శబ్దః = శబ్దము, స్పర్శః = స్పర్శ, చ = మఱియు, రూపం = రూపము, చ = మఱియు, రసః = రసము, గంధః = గంధము, స్యుః = కలుగును, తే = అవి, ఇంద్రియాణాం = ఇంద్రియముల, విషయాః = విషయములు, అపి చ = మఱియు, భూతానాం = భూతముల, గుణాః = గుణములు, సదాశివః = సదాశివుడు, చ = మఱియు, ఈశః = ఈశ్వరుడు, రుద్రః = రుద్రుడు, విష్ణుః = విష్ణువు, చతుర్ముఖః = బ్రహ్మ, దేవాః = దేవతలు కలుగుచున్నారు.

తామసాహంకారమునుండి ఆకాశవాయ్వగ్నిజల భూములను పంచభూతములు, శబ్దస్పర్శరూప రసగంధములు క్రమముగ కలుగుచున్నవి. ఈ శబ్దస్పర్శాదులు పంచేంద్రియముల విషయములు, పంచభూతముల

గుణములు ఐయున్నవి. వీని అధిదేవతలు సదాశివ, ఈశ్వర, రుద్ర, విష్ణు, బ్రహ్మలు.

**సాత్త్వికాత్స్యాదహంకారాదంతఃకరణధీంద్రియమ్ ।**
**మనోబుద్ధిరహంకారశ్చిత్తం కరణమాంతరమ్ ॥35॥**

**సంశయో నిశ్చయో గర్వః స్మరణం విషయా అమీ ।**
**చంద్రః ప్రజాపతీ రుద్రః క్షేత్రజ్ఞ ఇతి దేవతాః ॥36॥**

సాత్త్వికాత్ = సాత్త్వికమైన, అహంకారాత్ = అహంకారము నుండి, అంతఃకరణధీంద్రియం = లోపలి ఇంద్రియములైన జ్ఞానేంద్రియములు, స్యాత్ = కలుగును; ఆంతరం = లోపలి, కరణం = సాధనము, మనః = మనస్సు, బుద్ధిః = బుద్ధి, అహంకారః = అహంకారము, చిత్తం = చిత్తము, సంశయః = సందేహము, నిశ్చయః = నిశ్చయము, గర్వః = గర్వము, స్మరణం = స్మృతి, అమీ = ఇవి, విషయాః = క్రమముగ అంతఃకరణ చతుష్టయవిషయములు; చంద్రః = చంద్రుడు, ప్రజాపతిః = ప్రజాపతి, రుద్రః = రుద్రుడు, క్షేత్రజ్ఞః = క్షేత్రజ్ఞుడు, ఇతి = అనువారు, దేవతాః = దేవతలు.

సాత్త్వికాహంకారము నుండి అంతఃకరణము జ్ఞానేంద్రియములు కలుగుచున్నవి. అంతఃకరణమనగ మనస్సు, బుద్ధి, అహంకారము, చిత్తము. వీనికి క్రమముగ సంశయము నిశ్చయము గర్వము స్మరణ విషయములు. చంద్రుడు, ప్రజాపతి, రుద్రుడు, క్షేత్రజ్ఞుడు దేవతలు.

**శ్రోత్రం త్వక్చక్షుషీ జిహ్వా ఘ్రాణం జ్ఞానేంద్రియం విదుః ।**
**దిగ్వాతసూర్యవరుణా నాసత్యౌ దేవతాః స్మృతాః ॥37॥**

శ్రోత్రం = చెవి, త్వక్ = చర్మము, చక్షుషీ = కన్నులు, జిహ్వా = నాలుక, ఘ్రాణం = ముక్కు (వీనిని) జ్ఞానేంద్రియం = జ్ఞానేంద్రియమని, విదుః = తలచిరి. దిగ్వాత సూర్య వరుణాః = దిక్కు, వాయువు, సూర్యుడు, వరుణుడు, నాసత్యౌ = అశ్వినీదేవతలు (వీనికి క్రమముగ) దేవతాః = దేవతలు అని, స్మృతాః = తలచబడిరి.

చెవి, చర్మము, కన్ను, నాలుక, ముక్కు ఇవి జ్ఞానేంద్రియములు. వీనికి క్రమముగ దిక్కు, వాయువు, సూర్యుడు, వరుణుడు అశ్వినీదేవతలు వీరు దేవతలు.



**రాజసాత్స్యురహంకారాత్కర్మేంద్రియ సమీరణాః,**
**కర్మేంద్రియాణి వాక్పాణిః పాదః పాయురుపస్థకమ్. 38**

రాజసాత్ = రాజసమైన, అహంకారాత్ = అహంకారము నుండి, కర్మేంద్రియ సమీరణాః = కర్మేంద్రియములు, ప్రాణాదివాయువులు, స్యుః= కలుగుచున్నవి, వాక్ = మాట, పాణిః = హస్తం, పాదః = కాలు, పాయుః = గుదము, ఉపస్థకం = జననాంగము ఇవి, కర్మేంద్రియాణి = కర్మేంద్రియములు.

రాజసాహంకారము నుండి కర్మేంద్రియములు, ప్రాణాది వాయువులు కలుగుచున్నవి. వాక్పాణి పాదపాయూపస్థములు కర్మేంద్రియములు.

**వచనాదానగమనవిసర్గానంద సంజ్ఞకాః ।**
**విషయా దేవతాస్తేషాం వహ్నీంద్రో పేంద్ర మృత్యుకాః ॥39॥**

తేషాం = వాని, విషయాః = విషయములు, క్రమముగ, వచనాదానగమన విసర్గానంద సంజ్ఞకాః = మాట్లాడుట, పట్టుకొనుట, నడచుట, విడుచుట, ఆనందము ఈ సంజ్ఞలు గలవి. దేవతాః = దేవతలు,

వహ్నీంద్రోపేంద్ర మృత్యుకాః = అగ్ని, ఇంద్రుడు, ఉపేంద్రుడు, మృత్యువు, ప్రజాపతి.

మాట్లాడుట, పట్టుకొనుట, నడచుట, విడుచుట, ఆనందము క్రమముగ కరేంద్రియ విషయములు. అగ్ని ఇంద్రుడు, ఉపేంద్రుడు, మృత్యువు, ప్రజాపతి (వీనికి) దేవతలు.

**ప్రాణోఽపానః సమానశ్చోదానవ్యానౌ చ వాయవః ।**
**భూతైస్తు పంచభిః ప్రాణైశ్చతుర్దశభిరింద్రియైః ॥40॥**
**చతుర్వింశతి తత్త్వాని సాంఖ్యశాస్త్రవిదో విదుః ।**

ప్రాణః = ప్రాణము, అపానః = అపానము, సమానః = సమానము, చ = మఱియు, ఉదానవ్యానౌ = ఉదానము, వ్యానము, వాయుః = వాయువులు, పంచభిః భూతైః = పంచభూతములతో, ప్రాణైః = పంచప్రాణములతో, చతుర్దశభిః ఇంద్రియైః =పదునాల్గు ఇంద్రియములతో, (కలిసి) చతుర్వింశతి తత్త్వాని = ఇరువదినాల్గు తత్త్వములను, సాంఖ్యశాస్త్రవిదః = సాంఖ్యశాస్త్రజ్ఞులు, విదుః = తలచుచున్నారు.

ప్రాణాపాన సమానవ్యానోదానములు అను 5 వాయువులు, 5భూతములు, 14 ఇంద్రియములు, (అంతఃకరణములు 4 జ్ఞానేంద్రియములు 5 కర్మేంద్రియములు 5) చేరి 24 తత్త్వములని సాంఖ్యమతము.

**మహాన్కాలః ప్రధానం చ మాయావిద్యే చ పూరుషః ॥41॥**
**ఇతి పౌరాణికాః ప్రాహుస్త్రింశ తత్త్వాని తైః సహ ।**

తైఃసహ = వానితో గూడ, మహాన్ = మహత్తు, కాలః = కాలము, చ = మఱియు, ప్రధానం = ప్రధానము, మాయావిద్యే = మాయ, అవిద్య, చ = మఱియు, పూరుషః = పురుషుడు, చేరి, త్రింశత్తత్త్వాని = ముప్పది తత్త్వములు, ఇతి = అని, పౌరాణికాః = పౌరాణికలు, ప్రాహుః = పలుకుచున్నారు.

పై 24 తోటి మహత్తు, కాలము, ప్రధానము, మాయ, అవిద్య, పురుషుడు వీనిని చేర్చి 30 తత్త్వములని పౌరాణికుల మతము.



**బిందునాదౌ శక్తిశివౌ శాంతాతీతౌ తతః పరమ్ ॥42॥**
**షట్త్రింశ తత్త్వమిత్యుక్త శైవాగమ విశారదైః ।**

తతః పరం = దానిపై, బిందునాదౌ = బిందువు నాదము, శక్తిశివౌ= శక్తి, శివుడు, శాంతాతీతౌ = శాంతము, అతీతము, చేరి, షట్త్రింశత్తత్త్వం = ముప్పదియారు తత్త్వములు, ఇతి = అని, శైవాగమవిశారదైః = శైవాగమ పండితులచే, ఉక్తం = చెప్పబడెను.

పై 30 తోటి బిందు, నాద, శక్తి, శివ, శాంతాతీతములను చేర్చి 36 తత్త్వములని శైవాగమసిద్ధాంతము.

**సర్వే వికల్పాః ప్రాగాసన్ బీజేఽంకుర ఇవాత్మని ॥43॥**
**ఇచ్ఛాజ్ఞాన క్రియారూపమాయయా తే విజృంభితాః ।**

సర్వే వికల్పాః = సకల వికల్ప (తత్త్వ)ములు, ఆత్మని = ఆత్మయందు, బీజే = బీజమున, అంకురః ఇవ = మొలకవలె, ప్రాక్ = మొదలే, ఆసన్ = ఉండినవి, తే = అవి, ఇచ్ఛాజ్ఞాన క్రియారూపమాయయా = ఇచ్ఛా జ్ఞాన క్రియారూప మాయచే, విజృంభితాః = వ్యక్తమైనవి.

**ఈ వికల్ప (తత్త్వ)ములెల్ల ఆత్మయందు విత్తనమందు మొలకవలె పూర్వమే ఉండినవి. ఇచ్ఛాజ్ఞాన క్రియారూప మాయచే అవి వ్యక్తమైనవి.**

**ఇచ్ఛాజ్ఞానక్రియాపూర్వా యస్మాత్సర్వాః ప్రవృత్తయః ॥44॥**

**సర్వేఽపి జంతవ స్తస్మాదీశ్వరా ఇతి నిశ్చితాః ।**

యస్మాత్ = ఎందువలన, సర్వాః ప్రవృత్తయ.ః = సర్వకార్యములు, ఇచ్ఛాజ్ఞాన క్రియాపూర్వాః = ఇచ్ఛాజ్ఞానక్రియలను కారణముగా పొందియున్నవో, తస్మాత్ = అందువలన, సర్వే జంతవః అపి = సర్వజీవములుకూడ, ఈశ్వరాః ఇతి = ఈశ్వరులే అని, నిశ్చితాః = నిశ్చయింపబడినవి.

సర్వకార్యములకు ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులు కారణమగుటవలన సర్వజీవులును ఈశ్వరులేయని నిశ్చయమైనది.

**బీజాద్వృక్ష స్తరోర్బీజం పారంపర్యేణ జాయతే ॥45॥**

**ఇతి శంకానివృత్త్యర్థం యోగిదృష్టాంతకీర్తనమ్ ।**

బీజాత్ = విత్తనము నుండి, వృక్షః = చెట్టు, తరోః = చెట్టునుండి, బీజం = విత్తనము, పారంపర్యేణ = ఒకటి నుండి ఒకటి, జాయతే = పుట్టుచున్నది, ఇతి = అను, శంకా నివృత్త్యర్థం = సందేహనివారణకై, యోగిదృష్టాంత కీర్తనం = యోగి దృష్టాంతము చెప్పుట.

బీజమునుండి వృక్షము, వృక్షమునుండి బీజము పరంపరగ పుట్టుచుండును. కాన ఆదికారణమును కనుగొనజాలమను సంశయనివృత్తికై యోగి దృష్టాంతమివ్వబడినది.

**విశ్వామిత్రాదయః పూర్వే పరిపక్వసమాధయః ॥46॥**

**ఉపాదానోపకరణ ప్రయోజన వివర్జితాః ।**

**స్వేచ్ఛయా ససృజుః సర్గం సర్వభోగోపబృంహితమ్ ॥47॥**



పూర్వే = పూర్వకాలమున, విశ్వామిత్రాదయః = విశ్వామిత్రాదులు, ఉపాదానోపకరణ ప్రయోజన వివర్జితాః = ఉపాదానము సాధనము ఫలము ఏదియు లేనివారైనను, స్వేచ్ఛయా = తమ ఇచ్ఛచేతనే, సర్వభోగోప బృంహితం= సకల భోగములతో కూడిన, సర్గం = సృష్టిని, ససృజుః = సృష్టించిరి.

పూర్వకాలమున యోగసిద్ధిగల విశ్వామిత్రాదులు; ఉపాదాన సాధనఫలము లేవియు లేకున్నను తమ ఇచ్ఛా మాత్రముచే సర్వభోగములతో కూడిన సృష్టిని చేసిరి.

**ఈశ్వరోఽనంతశక్తిత్వాత్స్వతంత్రోఽన్యా నపేక్షకః ।**

**స్వేచ్ఛామాత్రేణ సకలం సృజత్యవతి హంతి చ ॥48॥**

అనంత శక్తిత్వాత్ = అనంత శక్తియుక్తుడగుట వలన, ఈశ్వరః = ఈశ్వరుడు, స్వతంత్రః = స్వతంత్రుడు, అన్యానపేక్షకః = తాను తప్ప ఇతర సాధనాపేక్ష లేనివాడు, సకలం = సమస్తమును, స్వేచ్ఛామాత్రేణ = తన ఇచ్ఛ (యొక్క దాని) చేతనే, సృజతి = సృష్టించుచున్నాడు, అవతి = రక్షించుచున్నాడు, చ = మఱియు, హంతి = సంహరించు చున్నాడు.

ఈశ్వరుడు అనంత శక్తిసంపన్నుడగుటవలన స్వతంత్రుడు, తాను తప్ప ఇతర సాధనాపేక్షారహితుడై తన ఇచ్ఛామాత్రముచేతనే సర్వమును సృష్టించి రక్షించి సంహరించుచున్నాడు.

**న కారకాణాం వ్యాపారాత్కర్తా స్యాన్నిత్య ఈశ్వరః ।**

**నాపి ప్రమాణవ్యాపారాత్‌జ్ఞాతాసౌ స్వప్రకాశకః ॥49॥**

నిత్యః = నిత్యుడగు, ఈశ్వరః = ఈశ్వరుడు, కారకాణాం = ఉపాదానసాధన నిమిత్తాది కారణముల, వ్యాపారాత్ = వ్యాపారమువలన,

కర్తా = కార్యము చేయువాడు, న = కాడు, అపి = మఱియు, స్వప్రకాశకః= స్వయం ప్రకాశ స్వరూపుడగు, అసౌ = ఇతడు, ప్రమాణ వ్యాపారాత్ = ప్రత్యక్షాది ప్రమాణముల సహాయమువలన, జ్ఞాతా = తెలియువాడును, న= కాడు.

నిత్యుడగు ఈశ్వరుడు కారకముల సహాయము లేకయే కార్యములను చేయును. స్వయంప్రకాశుడు కాన ప్రమాణముల సహాయము లేకయే తెలియ సమర్థుడయి యున్నాడు.

**జ్ఞాతృత్వమపి కర్తృత్వం స్వాతంత్ర్యాత్తస్య కేవలమ్ ।**
**యా చేచ్ఛాశక్తివైచిత్రీ సాస్య స్వచ్ఛందకారితా ॥50॥**

**యయా కర్తుం న వా కర్తు మన్యథా కర్తుమర్హతి ।**
**స్వతంత్రామీశ్వరేచ్ఛాం కే పరిచ్ఛేత్తుమిహేశతే ॥51॥**

తస్య = ఆ ఈశ్వరుని, జ్ఞాతృత్వం = తెలిసికొనుట, అపి = మఱియు, కర్తృత్వం = కార్యము చేయుట, కేవలం = వట్టి, స్వాతంత్ర్యాత్ = స్వతంత్రతవలననే, చ = మరియు, అస్య = ఇతని, ఇచ్ఛాశక్తివైచిత్రీ = ఇచ్ఛాశక్తి విచిత్రత, యా = ఏదో, సా = అది, స్వచ్ఛందకారితా = తన ఇచ్ఛవచ్చినట్లు చేయుట, యయా = దేనిచే, కర్తుం = కార్యము చేయుటకు, వా = అథవా, న కర్తుం = చేయకుండుటకు, అన్యథా కర్తుం = వేరుగా చేయుటకు, అర్హతి = సమర్థుడగుచున్నాడో, అట్టి, స్వతంత్రాం = స్వతంత్రమైన, ఈశ్వరేచ్ఛాం = ఈశ్వరేచ్ఛను, ఇహ = ఇట, కే = ఎవరు, పరిచ్ఛేత్తుం = నిష్కర్షింప, ఈశతే = సమర్థులు?

ఈశ్వరుని తెలివి, కార్యము చేయుట అతని స్వాతంత్ర్యము చేతనే నడచుచున్నది. తన ఇష్టము వచ్చినట్లు చేయుటయే ఆతని ఇచ్ఛాశక్తి



విచిత్రత. కార్యమును చేయుటకు, చేయకుండుటకు, వేరురీతిగా చేయుటకును స్వతంత్రమైన ఈశ్వరేచ్ఛను ఎవరు తానే నిష్కర్షింప గలరు?

**శ్రుతిశ్చ సోఽకామయతేతీచ్ఛయా సృష్టిమీశితుః ।**
**తస్మాదాత్మన ఆకాశః సంభూత ఇతి చ్చాబ్రవీత్ ॥52॥**

శ్రుతిః చ = వేదముకూడ, ఈశితుః = ఈశ్వరుని, ఇచ్ఛయా ఇచ్ఛచేతనే, సృష్టిం = సృష్టిని, సః = అతడు, అకామయత = కోరెను, ఇతి= అని, చ = మఱియు, తస్మాత్ ఆత్మనః = ఆ ఆత్మ నుండి, ఆకాశః = ఆకాశము, సంభూతః = పుట్టెను, ఇతి = అని, అబ్రవీత్ = చెప్పెను.

ఈశ్వరేచ్ఛ చేతనే సృష్టి యాయెనని "అతడు ఇష్టపడెను" "ఆ ఆత్మ నుండి ఆకాశము కలిగెను" అను తైత్తిరీయ వాక్యములచే వేదముకూడ పల్కుచున్నది.

**నిమిత్తమాత్రం చేదస్య జగతః పరమేశ్వరః ।**
**వికారిత్వం వినాశిత్వం భవేదస్య కులాలవత్ ॥53॥**

పరమేశ్వరః = పరమేశ్వరుడు, అస్య జగతః = ఈ జగత్తుకు, నిమిత్త మాత్రం చేత్ = నిమిత్తకారణము మాత్రమైనచో, అస్య = ఇతనికి, కులాలవత్ = కుమ్మరివలె, వికారిత్వం = మార్పుచెందుట, వినాశిత్వం = నాశము పొందుట, భవేత్ = ఐయుండును.

పరమేశ్వరుడు ఈ జగత్తుకు నిమిత్త కారణము మాత్రమై యున్నచో అతనికి కుమ్మరివలె మార్పు, నాశము కావలసియుండును. (ఇది శ్రుత్యాది ప్రమాణ విరోధము.)

**బుద్ధ్యాదయో నవగుణా నిత్యా ఏవేశ్వరస్యచేత్ ।**
**నిత్యేచ్ఛావాన్ జగత్స్రష్టా ప్రవర్తేతైవ సర్వదా ॥54॥**

ఈశ్వరస్య = ఈశ్వరుని, బుద్ధ్యాదయః = బుద్ధిమున్నగు, నవగుణాః= తొమ్మిది గుణములు, నిత్యాః ఏవచేత్ = నిత్యములే ఐయున్నచో, జగత్సృష్టౌ = జగత్సృష్టి యందు, నిత్యేచ్ఛావాన్ = నిత్యమైన ఇచ్ఛగలవాడై, సర్వదా = ఎల్లప్పుడు, ప్రవర్తేత ఏవ = ప్రవృత్తిగలవాడై ఉండని.

బుద్ధి మొదలగు ఎనిమిది గుణములు ఈశ్వరునియందు నిత్యములై యున్నచో నిత్యేచ్ఛగలవాడై సదా జగత్సృష్టియందే ప్రవృత్తుడై యుండవలసి వచ్చును.

**ప్రవృత్త్యుపరమాభావాత్సంసారో నైవ నశ్యతి ।**
**మోక్షోపదేశో వ్యర్థః స్యాదాగమోఽపి నిరర్థకః ॥55॥**

ప్రవృత్త్యుపరమాభావాత్ = ప్రవృత్తికి నిలుకడ లేనందున, సంసారః= సంసారము, న నశ్యతి ఏవ = నాశము కానేకాదు, మోక్షోపదేశః = మోక్షోపదేశము, వ్యర్థః = అర్థము లేనిది, స్యాత్ = అగును, అపి = మఱియు, ఆగమః = వేదము, నిరర్థకః = నిష్ఫలము.(అగును)

ప్రవృత్తికి నిలుకడలేనందున సంసారము అంతము లేనిదియై యుండును. అట్లయిన మోక్షోపదేశము, వేదము నిష్ఫలము లగును.

**తస్మాన్మాయావిలాసోఽయం జగత్కర్తృత్వ మీశితుః ।**
**బంధమోక్షోపదేశాదివ్యవహారోఽపి మాయయా ॥56॥**

తస్మాత్ = అందువలన, ఈశితుః = ఈశ్వరుని విషయమగు, అయం = ఈ, జగత్కర్తృత్వము, మాయావిలాసః = మాయావిలాసము, బంధమోక్షోపదేశాదివ్యవహారః అపి = బంధము మోక్షము ఉపదేశము మున్నగు వ్యవహారము కూడ, మాయయా= మాయచేతనే.



కావున ఈశ్వరుని జగత్కర్తృత్వము, బంధమోక్షోపదేశాది వ్యవహారమును్న మాయాకల్పితములే.

**ఇతి శ్రీ దక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకే ।**
**ప్రబంధే మానసోల్లాసే ద్వితీయోల్లాస సంగ్రహః ॥**

ఇతి = ఇట్లు, శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకే = శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థమును వివరించు, మానసోల్లాస ప్రబంధే మానసోల్లాసమను, కృతియందు, ద్వితీయోల్లాస సంగ్రహః = సంగ్రహమైన రెండవ ఉల్లాసము.

ఇట్లు శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థమును వివరించు మానసోల్లాసమను కృతియందు సంగ్రహమైన రెండవ ఉల్లాసము.

హరిః ఓమ్ తత్సత్.



# తృతీయోల్లాసము

**యస్యైవ స్ఫురణం సదాత్మకమసత్కల్పార్థగం భాసతే**
**సాక్షాత్తత్త్వమసీతి వేదవచసా యో బోధయత్యాశ్రితాన్ ।**
**యత్సాక్షాత్కరణాద్భవేన్న పునరావృత్తిర్భవాంభోనిధౌ**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥3॥**

యస్య = ఎవని, సదాత్మకం = సద్రూపమగు, స్ఫురణం = ప్రకాశము, అసత్కల్పార్థగం = ఉనికి లేనిది వలె నున్న విషయమును చేరి, దానిని, భాసతే = ప్రకాశింప జేయుచున్నదో, యః = ఎవడు, ఆశ్రితాన్ = ఆశ్రయించినవారిని, సాక్షాత్ = నిజముగ, తత్ = అది, త్వం = నీవు, అసి= అయియున్నావు, ఇతి = అను, వేదవచసా = వేదవాక్కుచే, బోధయతి= తెలుపుచున్నాడో, యత్సాక్షాత్కరణాత్ = ఎవని ప్రత్యక్షానుభవమును పొందుటవలన, భవాంభోనిధౌ = సంసార సాగరమున, పునరావృత్తిః = మరలి వచ్చుట, నభవేత్ = కలుగదో, తస్మై= ఆ, శ్రీగురుమూర్తయే = శ్రీగురుస్వరూపుడగు, శ్రీదక్షిణామూర్తయే = శ్రీదక్షిణామూర్తికి, ఇదం = ఈ నమః = నమస్కారము.

ఎవని సద్రూప ప్రకాశము అసద్రూప ప్రపంచమును చేరి దానిని ప్రకాశింప జేయుచున్నదో, ఎవడు తన భక్తులకు నిజముగ "నీవే అది అయియున్నావు" అను వేదవాక్కుచే తత్త్వమును తెలియజేయుచున్నాడో, ఎవని ప్రత్యక్షానుభవముచే సంసారసాగరమున మరలివచ్చుట లేదో, ఆ శ్రీగురుస్వరూపుడగు శ్రీదక్షిణామూర్తికి నమస్కారము.

**సత్తాస్ఫురత్తే భావేషు కుత ఆగత్య సంగతే ।**
**బింబాది దర్పణ న్యాయాదిత్థం పృచ్ఛన్ప్రబోధ్యతే ॥1॥**



భావేషు = వస్తువుల యందు, సత్తాస్ఫురత్తే = ఉనికి, వెలుగు, బింబాదిదర్పణ న్యాయాత్ = ప్రతిబింబాదులు అద్దమునందున్నట్లు, కుతః= ఎక్కడనుండి, ఆగత్య = వచ్చి, సంగతే = చేరికొనినవి? ఇత్థం = ఇట్లు, పృచ్ఛన్ = అడుగుచున్న శిష్యుడు, ప్రబోధ్యతే = ఉపదేశింప బడుచున్నాడు.

వస్తువులయందు ఉండుట, ప్రకాశము అద్దములో ప్రతిబింబము చేరినట్లు ఎక్కడనుండి వచ్చి చేరికొనినవి? అను ప్రశ్నకు ఉత్తరము పై శ్లోకమున చెప్పబడినది.

**అసత్కల్పేషు భావేషు జడేషు క్షణనాశిషు ।**
**అస్తిత్వం చ ప్రకాశత్వం నిత్యాత్సంక్రామతీశ్వరాత్ ॥2॥**

అసత్కల్పేషు = ఉనికి లేనివివలె నున్న, జడేషు = అచేతనములగు, క్షణనాశిషు = క్షణకాలమున నశించు, భావేషు = వస్తువుల యందు, అస్తిత్వం = ఉనికి, చ = మఱియు, ప్రకాశత్వం = ప్రకాశము, నిత్యాత్ = నిత్య (నాశరహిత)మగు, ఈశ్వరాత్ = ఈశ్వరుని నుండి, సంక్రామతి = చేరుచున్నది.

ఉనికిలేనివివలె నున్న అచేతనములగు స్వల్పకాలములో నాశమును పొందు సమస్త వస్తువులయందు కనుపించు ఉనికి మఱియు ప్రకాశము అవినాశియగు ఈశ్వరుని నుండి వచ్చి వానియందు చేరుచున్నవి.

**ఆత్మసత్తైవ సత్తైషాం భావానాం న తతోఽధికా ।**
**తథైవ స్ఫురణం చైషాం నాత్మస్ఫురణతోఽధికమ్ ॥3॥**

ఏషాం భావానాం సత్తా = ఈ వస్తువుల ఉనికి, ఆత్మ సత్తా ఏవ = ఆత్మ యొక్క ఉనికియే, తతః = అంతకంటే, అధికా న = హెచ్చైనది కాదు,

తథా = అట్లే, ఏషాం స్ఫురణం = వీనిప్రకాశము, ఆత్మస్ఫురణతః = ఆత్మ ప్రకాశము కంటె, అధికం న = హెచ్చైనది కాదు.

ఈ వస్తువుల ఉనికి ఆత్మయొక్క ఉనికియే. అంత కంటె వేరు కాదు. అట్లే వీనిప్రకాశమును ఆత్మ ప్రకాశము కంటె వేరు కాదు.

**జ్ఞానాని బహురూపాణి తేషాం చ విషయా అపి ।**
**అహంకారేఽనుషజ్యంతే సూత్రే మణిగణా ఇవ ॥4॥**

బహురూపాణి = అనేక రూపములైన, జ్ఞానాని = జ్ఞానములు, అపి చ = మఱియు, తేషాం విషయాః = వాని విషయములు, సూత్రే = దారములో, మణిగణా ఇవ = మణుల సమూహమువలె, అహంకారే = అహంకారమున, అనుషజ్యంతే = చేరికొని యున్నవి.

బహురూపములగు జ్ఞానములు వాని విషయములు కూడా దారమున మణుల సమూహములవలె అహంకారమున చేరికొని యున్నవి.

**ప్రకాశాభిన్న మే వైతద్విశ్వం సర్వస్య భాసతే ।**
**లహరీ బుద్బుదాదీనాం సలిలాన్న పృథక్స్థితిః ॥5॥**

సర్వస్య = ప్రతి వానికి, ఏతత్ విశ్వం = ఈ జగత్తు, ప్రకాశాభిన్నమేవ= ప్రకాశముకంటె వేరుకానట్లు, భానతే = కనుపించుచున్నది. లహరీబుద్బుదాదీనాం = అలలు బుడగలు మున్నగువానికి, సలిలాత్ = నీటికంటె, పృథక్ స్థితిః న = వేరు ఉనికి లేదు.

ఈ జగత్తు ప్రకాశముకంటె వేరుకానట్లు ఎల్లరకు తోచుచున్నది. అలలు నీటిబుడగలు మున్నగువానికి నీటి కంటె వేరు ఉనికి లేదు.



**జానామీత్యేవ యజ్జ్ఞానం భావానావిశ్య వర్తతే ।**
**జ్ఞాతం మయేతి తత్పశ్చా ద్విశ్రామ్యత్యంతరాత్మని ॥6॥**

భావాన్ = వస్తువులను, ఆవిశ్య = ప్రవేశించి(న) యత్ జ్ఞానం = ఏ జ్ఞానమును, జానామి ఇతి = తెలిసికొనుచున్నానని, వర్తతే = ఉంటున్నదో, తత్ = ఆ జ్ఞానము, పశ్చాత్ = పిదప, మయా = నాచే, జ్ఞాతం = తెలియబడినది, ఇతి = అని, అంతరాత్మని = అంతరాత్మలో, విశ్రామ్యతి = విశ్రాంతిని పొందుచున్నది.

వస్తువులను తెలుసుకొనుచున్నాను అని ఏ జ్ఞానం వుందో అది తరువాత నాచే తెలియబడినదని అంతరాత్మలో విశ్రమిస్తున్నది.

**ఘటాదికాని కార్యాణి విశ్రామ్యంతి మృదాదిషు ।**
**విశ్వం ప్రకాశాభిన్నత్వా ద్విశ్రామ్యేత్పరమేశ్వరే ॥7॥**

ఘటాదికాని = కుండమున్నగు, కార్యాణి = కార్యములు, మృదాదిషు= మన్ను మున్నగు కారణములయందు, విశ్రామ్యంతి = విశ్రాంతిని పొందుచున్నవో, అట్లే, విశ్వం = కార్యమగు జగత్తు, ప్రకాశాభిన్నాత్ = ప్రకాశము కంటె వేరుగా లేనందున, పరమేశ్వరే = కారణమగు పరమేశ్వరుని యందు, విశ్రామ్యేత్ = విశ్రాంతిని పొందును.

కార్యరూపమగు కుండ మున్నగునవి వానికి కారణమగు మన్ను మున్నగువానియందెట్లు విశ్రాంతిని పొందుచున్నవో, అట్లె కార్యమగు జగత్తు ప్రకాశముకంటె వేరుకానందున ప్రకాశ స్వరూప పరమేశ్వరుని యందే విశ్రాంతిని పొందుచున్నది.

**స్వగతేనైవ కాలిమ్నా దర్పణం మలినం యథా ।**
**అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః ॥8॥**

స్వగతేన ఏవ = తనయందే ఉన్న, కాలిమ్నా = మైలచే, దర్పణం= అద్దము, యథా = ఎట్లు, మలినం = మాలిన్యమును పొందుచున్నదో, అట్లె, జ్ఞానం = జ్ఞానము, అజ్ఞానేన = అజ్ఞానముచే, ఆవృతం = ఆవరింపబడినది, తేన = అందుచే జంతవః = జీవులు, ముహ్యంతి = మోహమును పొందుచున్నారు.

తనయందే ఉన్న మైలచే అద్దము మాలిన్యమును పొందునట్లు జ్ఞానము అజ్ఞానముచే ఆవరింపబడినది. కాన జీవులు మోహమును పొందుచున్నారు.

**ఘటాకాశో మహాకాశో ఘటోపాధికృతో యథా ।**
**దేహోపాధికృతో భేదో జీవాత్మ పరమాత్మనోః ॥9॥**

యథా = ఎట్లు, ఘటాకాశః = ఘటమందున్న ఆకాశము, ఘటోపాధికృతః = ఘటమను ఉపాధిచే కల్పితమైన, మహాకాశః = మహాకాశమో, అట్లె, జీవాత్మ పరమాత్మనోః = జీవాత్మ పరమాత్మల, భేదః= భేదము, దేహోపాధికృతః = దేహమను ఉపాధిచే కల్పితమైనది.

ఘటాకాశ మహాకాశముల భేదము ఎట్లు ఘటమను ఉపాధిచే కల్పితమో అట్లె జీవాత్మ పరమాత్మల భేదము దేహమను ఉపాధిచే కల్పితము.

**తత్త్వమస్యాది వాక్యైస్తు తయోరైక్యం ప్రదర్శ్యతే ।**
**సోఽయం పురుష ఇత్యుక్తే పుమానేకో హి దృశ్యతే ॥10॥**

తత్త్వమస్యాదివాక్యైః తు = నీవు అదియే అయియున్నావను మొదలగు వాక్యములచే, తయోః = ఆ జీవాత్మపరమాత్మల, ఐక్యం = అభేదము, ప్రదర్శ్యతే = చూపబడినది. అయం పురుషః = ఈ మనుష్యుడు, సః ఇతి=



అతడే అని, ఉక్తే = చెప్పినపుడు పుమాన్ = మనుష్యుడు, ఏకః = ఒక్కడే, దృశ్యతే హి = కనబడుచున్నాడు కదా.

"నీవు అదియే అయియున్నావు." ఇత్యాది వాక్యములచే జీవాత్మ పరమాత్మల అభేదమే చూపబడినది. "ఈ మనుష్యుడు అతడే" అను వాక్యముచే తెలుపబడు మనుష్య డొక్కడే కదా?

**యజ్జగత్కారణం తత్త్వం తత్పదార్థః స ఉచ్యతే ।**
**దేహాదిభిః పరిచ్ఛిన్నో జీవస్తు త్వం పదాభిధః ॥11॥**

యత్ = ఏది, జగత్కారణం = జగత్కారణమగు, తత్త్వం = తత్త్వమో, సః = అది, తత్పదార్థః = "అది" అను పదముయొక్క అర్థముగ, ఉచ్యతే = చెప్పబడినది.దేహాదిభిః = దేహమే మున్నగు ఉపాధులచే, పరిచ్ఛిన్నః = విశేషణమును పొందిన, జీవఃతు = జీవుడో, త్వంపదాభిధః = "నీవు" అను పేరు గలవాడు.

జగత్కారణమగు పరబ్రహ్మ తత్త్వము "అది" అను మాటచే చెప్పబడినది. దేహమే మున్నగు ఉపాధులతో కూడిన జీవుడు "నీవు" అను పదముయొక్క అర్థము.

**తద్దేశ కాలావస్థాదౌ దృష్టః స ఇతి కథ్యతే ।**
**తథైతద్దేశ కాలాదౌ దృష్టోఽయమతి కీర్త్యతే ॥12॥**

తద్దేశకాలావస్థాదౌ = ఆ దేశము, కాలము, అవస్థమున్నగు దానియందు, దృష్టః = చూడబడినవాడు, సః ఇతి = "అతడు" అని, కథ్యతే= చెప్పబడుచున్నాడు, తథా = అట్లె, ఏతద్దేశకాలాదౌ = ఈ దేశము కాలము మున్నగు వానియందు, దృష్టః = చూడబడినవాడు, అయం ఇతి = "ఇతడు" అని, కీర్త్యతే = పిలువబడుచున్నాడు.

ఆ దేశకాలావస్థాదులయందు కనబడిన మనుష్యుడు "అతడు" అని పిలువబడుచున్నాడు. ఈ దేశకాలాదుల యందు కనబడు ఆ మనుష్యుడే "ఇతడు" అను మాటచే పిలువబడుచున్నాడు.

**ముఖ్యం తదేతద్వైశిష్ట్యం విసృజ్య పదయోర్ద్వయోః ।**
**పుంమాత్రం లక్షయత్యేకం యథా సో౽యం పుమాన్వచః ॥13॥**

**ప్రత్యక్త్వం చ పరాక్త్వం చ త్యక్త్వా తత్త్వమసీతివాక్ ।**
**తథైవ లక్షయత్యైక్యం జీవాత్మపరమాత్మనోః ॥14॥**

యథా = ఎట్లు, అయం పుమాన్ = ఈ మనుష్యుడు, సః = అతడే, అను, వచః = వాక్యము, తదేతద్వైశిష్ట్యం = అది, ఇది అను విశేషణముల అర్థమును, విసృజ్య = విడిచి, పుంమాత్రం = మనుష్యుని మాత్రము, లక్షయతి = తెలుపుచున్నదో, తథా ఏవ = అట్లే, త్వంతత్ అసి= నీవు అదియే అయియున్నావు, ఇతి వాక్ = అనువాక్యము, ప్రత్యక్త్వం చ = లోపలనుండుట, పరాక్త్వం చ = బయటనుండుట అను గుణములను, త్యక్త్వా = విడిచి, జీవాత్మపరమాత్మనోః ఐక్యం = జీవాత్మపరమాత్మల అభేదమును, లక్షయతి = తెలుపుచున్నది.

"ఇతడు ఆ మనుష్యుడే" అను వాక్యము "ఇది" "అది" అను విశేషణముల అర్థమును విడిచి ఒక్కడే అయియున్న మనుష్యుని ఎట్లు తెలుపుచున్నదో అట్లే "నీవు అదియే అయియున్నావు" అను వాక్యము కూడ లోపలనుండుట, బయట నుండుట అను గుణములను విడిచి జీవాత్మ పరమాత్మల అభేదమునే తెలుపుచున్నది.

**సామానాధికరణ్యాఖ్యః సంబంధః పదయోరిహ ।**
**విశేషణం విశేష్యత్వం సంబంధః స్యాత్పదార్థయోః ॥15॥**



ఇహ = ఇచ్చట-"తత్త్వమసి" 'నీవు అదియే అయి యున్నావు' అను వాక్యమున, పదయోః = 'నీవు', 'అది' అను పదముల, సంబంధః = సంబంధము, సామానాధికరణ్యాఖ్యః = ఒకే ఆధారమును పొందియుండుట అను పేరు గలది. పదార్థయోః = ఈ పదములచ్చే చెప్పబడిన విషయముల సంబంధః = సంబంధము, విశేషణ విశేష్యత్వం = పరస్పరము విశేషణముగను విశేష్యముగను ఉండు గుణముతో కూడినది.

"నీవు అదియే అయియున్నావు" అను వాక్యమున "నీవు" "అది" అను పదముల సంబంధము సామానాధికరణ్యము. ఈ పదముల అర్థముల సంబంధము విశేషణ విశేష్య భావము.

**లక్ష్యలక్షణసంయోగా ద్వాక్యమైక్యం చ బోధయేత్ ।**

వాక్యం = నీవు అదియే అయియున్నావను వాక్యము, లక్ష్య లక్షణ సంయోగాత్ = లక్షణార్థసంయోగమువలన, ఐక్యం = జీవాత్మ పరమాత్మలు ఒకటే అనుదానిని, బోధయేత్ = తెలియజేయును.

నీవు అదియే అయియున్నావను వాక్యము లక్షణార్థ సంయోగముచే జీవాత్మ పరమాత్మలు ఒకటే అనుదానిని తెలుపుచున్నది.

**గంగాయాం ఘోష ఇతివన్న జహల్లక్షణా భవేత్ ॥16॥**
**నాజహల్లక్షణాపి స్యాచ్ఛ్వేతో ధావతి వాక్యవత్ ।**

గంగాయాం = గంగలో, ఘోషః = పల్లి, ఇతివత్ = అను వాక్యార్థమువలె, జహల్లక్షణా = గంగలో అను పదము యొక్క వాచ్యార్థమును విడిచి అర్థమును చేయు లక్షణ, న భవేత్ = కాదు, గుఱ్ఱమును గూర్చి మాట్లాడునపుడు శ్వేతః = తెల్లనిది, ధావతి = పరుగెత్తుచున్నది, అను,

వాక్యవత్ = వాక్యమువలె, అజహల్లక్షణా అపి = తెల్లనిది అను పదముయొక్క వాచ్యార్థమును విడువక జేయు లక్షణయు, న స్యాత్ = కాదు.

గంగలో పల్లి అను వాక్యార్థమువలె గంగలో అను పదమునకు వాచ్యమైన గంగానదీ ప్రవాహములో అను అర్థమును విడిచి గంగాతీరములో అను అర్థమును చేయు లక్షణ కాదు. గుఱ్ఱమును గూర్చి మాట్లాడునపుడు తెల్లనిది పరుగెత్తుచున్నది అను వాక్యార్థమువలె తెల్లనిది అను పదమునకు వాచ్యమైన తెల్లని వన్నెగలది అను అర్థమును విడువక చేయు లక్షణ కూడా కాదు.

**తత్త్వమస్యాదివాక్యానాం లక్షణా భాగ లక్షణా ॥17॥**
**సోఽయం పురుష ఇత్యాది వాక్యానామివ కీర్తితా ।**

అయం పురుషః సః = ఈ మనుష్యుడు అతడే, ఇత్యాది వాక్యానాం ఇవ = ఇత్యాది వాక్యముల లక్షణార్థమువలె, తత్త్వమస్యాది వాక్యానాం = నీవు అదియే ఐయున్నావు. ఇత్యాది వాక్యముల అర్థములలో సమన్వయము కాని భాగమును విడిచి సమన్వయమగు భాగమును మాత్రము తీసికొని అర్థమును చెప్పు లక్షణ, అని కీర్తితా = చెప్పబడినది.

ఈ మనుష్యుడు అతడే ఇత్యాది వాక్యముల లక్షణార్థము వలె నీవు అతడే ఐయున్నావు. ఇత్యాది వాక్యముల లక్షణార్థము భాగలక్షణము.

**భిన్నవృత్తి నిమిత్తానాం శబ్దానామేక వస్తుని ॥18॥**
**ప్రవృత్తిస్తు సమానాధికరణత్వ మిహోచ్యతే ।**

ఇహ = ఇచ్చట, భిన్నవృత్తి నిమిత్తానాం = వేర్వేరు వస్తువులు కారణముగా గల, శబ్దానాం = పదములకు, ఏకవస్తుని = ఒకే వస్తువు



నందు, ప్రవృత్తిః = అర్థమగుట, సమానాధికరణత్వం = ఒకే ఆధారమును పొందియుండుట అని, ఉచ్యతే = చెప్పబడినది.

వేర్వేరు వస్తువులు కారణముగాగల పదములకు ఒకే వస్తువునందు అర్థమగుట సమానాధికరణత్వము.

**పరస్యాంశో వికారో వా జీవో వాక్యేన నోచ్యతే ॥19॥**

**జీవాత్మనా ప్రవిష్టత్వా త్స్వమాయా సృష్టమూర్తిషు ।**
**నిరంశో నిర్వికారోఽసౌ శ్రుత్యా యుక్త్యా చ గమ్యతే ॥20॥**

**ఘటాకాశో వికారో వా నాంశో వా వియతో యథా ।**

యథా = ఎట్లు, ఘటాకాశః = ఘటాకాశము, వియతః = మహాకాశముయొక్క, వికారః = రూపాంతరమో, వా = లేదా, అంశః = భాగమో, న = కాదో, అట్టి స్వమాయాసృష్ట మూర్తిషు = తన మాయచే నిర్మింపబడిన మూర్తులయందు, జీవాత్మనా = జీవాత్మగ, ప్రవిష్టత్వాత్ = ప్రవేశించి యున్నందున, జీవః = జీవాత్మ, పరస్య = పరమాత్మ యొక్క, అంశః = భాగమో, వా = లేదా, వికారః = రూపాంతరమో, న = కాదు, అని, వాక్యేన = తత్త్వమసి యను వాక్యముచే, ఉచ్యతే = చెప్పబడినది. అసౌ = ఈ పరమాత్మ, శ్రుత్యా = వేదవాక్యము చేతను, యుక్త్యా చ = యుక్తి చేతనుకూడ, నిరంశః = భాగములు లేనివాడనియు, నిర్వికారః చ= రూపాంతరము పొందని వాడనియు, గమ్యతే = తెలియుచున్నది.

ఎట్లు ఘటాకాశము మహాకాశముయొక్క రూపాంతరము లేదా భాగము కాదో అట్లె బ్రహ్మము తన మాయచే నిర్మింపబడిన మూర్తులయందు జీవాత్మగా ప్రవేశించినందువలన జీవుడు పరమాత్మయొక్క భాగము లేదా రూపాంతరము కాదని "తత్త్వమసి" అను మహావాక్యము చెప్పుచున్నది.

వేదవాక్యము మఱియు యుక్తిచేతను పరమాత్మ భాగము మఱియు రూపాంతరము లేనివాడని తెలియుచున్నది.

**త్వమింద్రోఽసీతి వద్వాక్యం న ఖలు స్తుతి తత్పరమ్ ॥21॥**

వాక్యం = ఈ వాక్యము, త్వం ఇంద్రః అసి = నీవు ఇంద్రుడవు, ఇతివత్ = అన్నట్లు, స్తుతి తత్పరం = స్తోత్రపరమైనది, న ఖలు = కానే కాదు.

ఇంద్రుడు కానివానిని గూర్చి "నీవు ఇంద్రుడవు" అని చెప్పినట్లు స్తోత్రపరమని చెప్పకూడదు.

**న సాదృశ్యపరం వాక్యమగ్నిర్మాణవకాదివత్ ।**
**న కార్య కారణత్వస్య సాధనం మృద్ఘటాదివత్ ॥22॥**

వాక్యం = ఈ వాక్యము, అగ్నిర్మాణవకాదివత్ = "పిల్లవాడు అగ్గి" మొదలగు వాక్యములవలె, సాదృశ్యపరం = పోలికను చెప్పునట్టిది, న కాదు. మృద్ఘటాదివత్ = "కుండ మట్టి" మున్నగు వాక్యములవలె, కార్యకారణత్వస్య = కార్యకారణ సంబంధమును, సాధనం = సాధింప దగినదియు, న = కాదు.

ఈ వాక్యము "పిల్లవాడు అగ్గి" ఇత్యాది వాక్యములవలె పోలికను చెప్పుటగాని, "కుండమట్టి" ఇత్యాది వాక్యముల వలె కార్యకారణ సంబంధమును సాధించునదిగాని కాదు.

**న జాతివ్యక్తి గమకం గౌః ఖంజ ఇతి వద్వచః ।**
**గుణగుణాత్మకం వాక్యం నైతన్నీలోత్పలాదివత్ ॥23॥**

ఏతత్ వాక్యం = ఈ వాక్యము, ఖంజః గౌః = "కుంటి ఎద్దు", ఇతివత్ = అన్నట్లు, జాతివ్యక్తి గమకం = జాతి వ్యక్తులను తెలుపు, వచః= వాక్యము, న = కాదు. నీలోత్పలాదివత్ = "నల్లని కలువ" ఇత్యాదులవలె, గుణగుణ్యాత్మకం = గుణము, గుణముగలది అను సంబంధమును చెప్పుటయు, న = కాదు.

ఈ వాక్యము "కుంటి ఎద్దు" అను వాక్యమువలె జాతి వ్యక్తుల సంబంధమును లేదా "నల్లని కలువ" ఇత్యాదుల వలె గుణగుణి సంబంధమును చెప్పుట కాదు.



**నోపాసనా పరంవాక్యం ప్రతిమాస్వీశ బుద్ధివత్ ।**
**న చౌపచారికం వాక్యం రాజవద్రాజ పూరుషే ॥24॥**

ప్రతిమాసు = విగ్రహముల యందు, ఈశబుద్ధివత్ = ఈశ్వరుడను భావనవలె, వాక్యం = ఈ వాక్యము, ఉపాసనాపరం = ఉపాసనను బోధించునది, న = కాదు, రాజపూరుషే = రాజుచే నియమింపబడిన అధికారి విషయమున, రాజవత్ = "రాజు" అను శబ్దమువలె, ఔపచారికం= ఉపచారముగ చెప్పబడిన, వాక్యం = వాక్యము, న = కాదు.

ఈ వాక్యము ప్రతిమలయందు ఈశ్వరుడను బుద్ధివలె ఉపాసనాపరము కాదు. రాజనియమితాధికారియందు రాజను శబ్దమువలె ఔపచారికమును కాదు.

**జీవాత్మనా ప్రవిష్టోఽసావీశ్వరః శ్రూయతే యతః ।**

యతః = ఎందువలనన, అసౌ ఈశ్వరః = ఈ ఈశ్వరుడే, జీవాత్మనా= జీవాత్మగా, తానే సృజించిన జగత్తును, ప్రవిష్టః = ప్రవేశించెను, అని, శ్రూయతే = శ్రుతివాక్కుచే తెలియుచున్నది.

ఈ ఈశ్వరుడే జీవాత్మగా తానే సృష్టించిన జగత్తులో ప్రవేశించెను అని శ్రుతి వాక్కు వలన

**దేహేంద్రియ మనోబుద్ధి ప్రాణాహంకార సంహతౌ ॥25॥**

**ఆత్మసంకల నాదజ్ఞైరాత్మత్వం ప్రతిపాద్యతే ।**
**వహ్నిధీః కాష్ఠలోహాదౌ వహ్ని సంకలనాద్యథా ॥26॥**

యథా = ఎట్లు, కాష్ఠలోహాదౌ = కట్టి, ఇనుము మున్నగుదాని యందు, వహ్ని సంకలనాత్ = అగ్ని చేరుటచే, వహ్నిధీః = అగ్ని అను బుద్ధికలుగునో, అట్లె, దేహేంద్రియ మనో బుద్ధి ప్రాణాహంకార సంహతౌ= దేహము ఇంద్రియము మనస్సు బుద్ధి ప్రాణము అహంకారము వీని సమూహమున, ఆత్మసంకలనాత్ = ఆత్మ చేరుటవలన, ఆత్మత్వం = ఆత్మయను భావనయే, అజ్ఞైః = తెలివిలేని వారిచే, ప్రతిపాద్యతే = ప్రతిపాదింపబడుచున్నది. (తెలియబడుచున్నది.)

కట్టె, ఇనుము మున్నగువానియందు అగ్ని సంబంధముచే అగ్నియే అను జ్ఞానము ఎట్లు కలుగునో అట్లె శరీరేంద్రియ మనోబుద్ధి ప్రాణాహంకార సమూహమున ఆత్మ సంబంధముచే ఈ సమూహమే ఆత్మయను జ్ఞానము అజ్ఞులకు కలుగును.

**దేహమన్నమయం కోశమావిశ్యాత్మా ప్రకాశతే ।**
**స్థూలో బాలః కృశః కృష్ణో వర్ణాశ్రమ వికల్పవాన్ ॥27॥**

ఆత్మా = ఆత్మ, అన్నమయం కోశం = అన్నమయ కోశమైన, దేహం = శరీరమును, ఆవిశ్య = ప్రవేశించి, స్థూలం = లావుగ నున్నవాడు, బాలః = బాలుడు, కృశః = సన్ననివాడు, కృష్ణః = నల్లనివాడు, వర్ణాశ్రమవికల్పవాన్ = వర్ణాశ్రమ భేదములుగలవాడు అని, ప్రకాశతే = కనబడుచున్నది.



ఆత్మ అన్నమయ కోశమగు శరీరమును ప్రవేశించి స్థూలుడు బాలుడు, కృశుడు, కృష్ణుడు, వర్ణాశ్రమ భేదములు గలవాడుగను కనబడును.

**ప్రాణకోశేఽపి జీవామి క్షుధితోఽస్మి పిపాసితః ।**
**సంశితో నిశ్చితో మన్యే ఇతి కోశే మనోమయే ॥28॥**

అపి = మఱియు, ప్రాణకోశే = ప్రాణమయకోశమున, జీవామి = జీవించుచున్నాను. క్షధితః అస్మి = ఆకలి గొని యున్నాను, పిపాసితః = దప్పికగొని యున్నాను అనియు; మనోమయే కోశే = మనోమయ కోశమున, సంశితః = సందేహపడుచున్నాను, నిశ్చితః = నిశ్చయించుచున్నాను, మన్యే= తలచుచున్నాను, అని యిట్లు కనబడును.

ఆత్మ ప్రాణమయ కోశమున ప్రవేశించి జీవించుచున్నాను. ఆకలిదప్పిక కలిగియున్నాననియు, మనోమయ కోశమున సందేహము, నిశ్చయము యోచనలను కలిగి యున్నట్లును కనబడును.

**విజ్ఞానమయకోశస్థో విజానామీతి తిష్ఠతి ।**
**ఆనందమయకోశాఖ్యే త్వహంకారే పురాకృతైః ॥29॥**

**పుణ్యైరుపాసనాభిశ్చ సుఖితోఽస్మీతి మన్యతే ।**

విజ్ఞానమయకోశస్థః = విజ్ఞానమయ కోశమందున్నవాడై, విజానామి = తెలిసికొనుచున్నాను, ఇతి = అని, తిష్ఠతి = ఉండును, ఆనందమయకోశాఖ్యే = ఆనందమయకోశమను, అహంకారే = అహంకారమున, ప్రవేశించి, పురాకృతైః = పూర్వము చేసిన, పుణ్యైః = పుణ్యములచేతను, చ = మఱియు, ఉపాసనాభిః = ఉపాసనలచేతను, సుఖితః అస్మి = సుఖించుచున్నాను, ఇతి = అని, మన్యతే = తలచును.

విజ్ఞానమయకోశమును చేరి ఆత్మను తెలిసికొనుచున్నా ననియు, ఆనందమయకోశమను అహంకారమున చేరి పూర్వపుణ్యముల మఱియు ఉపాసనలచే సుఖించుచున్నాననియు తలచును.

**ఏవం కంచుకితః కోశైః కంచుకైరివ పంచభిః ॥30॥**

**పరిచ్ఛిన్న ఇవాభాతి వ్యాప్తోఽపి పరమేశ్వరః ।**

ఏవం = ఇట్లు, పంచభిఃకోశైః = పంచకోశములచేత, కంచుకైః ఇవ = కవచములచేతనో అన్నట్లు, కంచుకితః = మూయబడిన, పరమేశ్వరః= పరమేశ్వరుడు, వ్యాప్తః అపి = సర్వవ్యాపియై యున్నను, ఈ కోశములచే, పరిచ్ఛిన్నః ఇవ = మితమైనవాడువలె, ఆభాతి = కనుపించుచున్నాడు.

ఇట్లు కవచముల చేతనో అన్నట్లు ఈ అయిదుకోశములచే మూయబడిన పరమాత్మ వాస్తవముగ సర్వవ్యాపి అయియుండియు వీనిచే మితమైనవాడువలె కన్పట్టుచున్నాడు.

**యథా సలిలమావిశ్య బహుధా భాతి భాస్కరః ॥31॥**

**తథా శరీరాణ్యావిశ్య బహుధా స్ఫురతీశ్వరః ।**

యథా = ఎట్లు, భాస్కరః = సూర్యుడు, సలిలం = నీటిని, ఆవిశ్య= ప్రవేశించి, బహుధా = అనేక రూపములుగా, భాతి = ప్రకాశించునో, తథా= అట్లు, ఈశ్వరః = పరమాత్మ, శరీరాణి = దేహములను, ఆవిశ్య = ప్రవేశించి, బహుధా = అనేక రూపములుగా, స్ఫురతి = వెలుగుచున్నాడు.

సూర్యుడు నీటిని చేరి బహురూపముగ భాసించునట్లు పరమాత్మ శరీరములనుచేరి బహురూపములుగా స్ఫురించుచున్నాడు.

**కారణత్వం చ కార్యత్వం తటస్థం లక్షణం తయోః ॥32॥**

**శాఖాయాం చంద్ర ఇతివన్నైవ ముఖ్యమిదం మతమ్ ।**



తయోః = ఆ పరమాత్మ జీవాత్మలకు, కారణత్వం = కారణముగ నుండుట, చ = మఱియు, కార్యత్వం = కార్యముగనుండుట, చంద్రః = చంద్రుడు, శాఖాయాం = కొమ్మపై నున్నాడు, ఇతివత్ = అన్నట్లు, తటస్థం = ప్రాసంగికమైన, లక్షణం = లక్షణము, ఇదం = దీనిని, ముఖ్యం = ముఖ్యమని, న ఏవ విదుః = తలచనే లేదు.

పరమాత్మ జీవాత్మల కారణత్వము, కార్యత్వము చంద్రుడు కొమ్మపై నున్నాడన్నట్లు ప్రాసంగిక లక్షణమే. దీనిని ముఖ్యలక్షణమని గణించనే లేదు.

**మహాప్రకాశ ఇత్యుక్తం స్వరూపం చంద్రలక్షణమ్ ॥33॥**

**సచ్చిదానంద రూపత్వం స్వరూపం లక్షణం తయోః ।**

స్వరూపం = నిజమైన, చంద్రలక్షణం = చంద్రుని లక్షణము, మహాప్రకాశః = గొప్పప్రకాశము, ఇతి = అని, ఉక్తం = చెప్పబడినది, అట్లె, సచ్చిదానందరూపత్వం = ఉండుట, జ్ఞానము, ఆనందము అయి యుండుటయే, తయోః = ఆ జీవాత్మ పరమాత్మల, స్వరూపం= నిజమైన, లక్షణం = లక్షణము.

చంద్రుని నిజమైన లక్షణము గొప్పప్రకాశము. అట్లె జీవాత్మ పరమాత్మల నిజమైన లక్షణము సచ్చిదానందములుగ నుండుటయే.

**ఏకలక్షణయోరైక్యం వాక్యేన ప్రతిపాద్యతే ॥34॥**

**తస్మాదేక ప్రకాశత్వం సర్వాత్మత్వ మితి స్థితమ్ ।**

ఏకలక్షణయోః = ఒకే లక్షణముగల ఇద్దరి యొక్క, ఐక్యం = అభేదము, వాక్యేన = "తత్త్వమసి" అను వాక్యముచే, ప్రతిపాద్యతే =

చెప్పబడుచున్నది, తస్మాత్ = అందువలన, ఏక ప్రకాశత్వం = ఒకటే అగు ప్రకాశముగ నుండుటయే, సర్వాత్మత్వం = ఎల్లర ఆత్మగా నుండుట, ఇతి= అని, స్థితం = సిద్ధమయ్యెను.

ఒకే లక్షణముగల జీవాత్మ పరమాత్మల అభేదమునే "తత్త్వమసి" మహావాక్యము చెప్పుచున్నది. కాన ఒకే ప్రకాశముగ నుండుటయే సర్వాత్మగా నుండుట అని సిద్ధించెను.

**దేవ తిర్యఙ్మనుష్యాణాం ప్రకాశాన్న పృథక్ స్థితిః ॥35॥**

**జీవః ప్రకాశాభిన్న త్వా త్సర్వాత్మేత్యభిధీయతే ।**

దేవతిర్యఙ్మనుష్యాణాం = దేవతలు తిర్యగ్జంతువులు మనుష్యులు వీరికి, ప్రకాశాత్ = ప్రకాశముకంటె, పృథక్ = వేరైన, స్థితిః = ఉనికి, న= లేదు; జీవః = జీవుడు, ప్రకాశాభిన్నత్వాత్ = ప్రకాశముకంటె వేరైనవాడు కానందున, సర్వాత్మా ఇతి = ఎల్లర ఆత్మ అని, అభిధీయతే = పిలువబడు చున్నాడు.

దేవతలు తిర్యగ్జంతువులు మనుష్యులు వీరి ఉనికి ప్రకాశముకంటె వేరుకాదు. జీవుడుకూడ ప్రకాశముకంటె వేరైనవాడు కానందున, అతడు సర్వాత్మ.

**ఏవం ప్రకాశరూపత్వ పరిజ్ఞానే దృఢీకృతే ॥36॥**

**పునరావృత్తిరహితం కైవల్యం పదమశ్నుతే ।**

ఏవం = ఇట్లు, ఆత్మ, ప్రకాశరూపత్వ పరిజ్ఞానే = ప్రకాశరూపముగ నున్నవాడను జ్ఞానము, దృఢీకృతే = స్థిరమైనపుడు, పునరావృత్తిరహితం = మరలి వచ్చుటలేని, కైవల్యం పదం = కైవల్యమనుస్థితిని, అశ్నుతే = పొందు చున్నాడు.



ఇట్లు ఆత్మ ప్రకాశరూపుడను జ్ఞానము స్థిరమైనపుడు పునరావృత్తిలేని కైవల్యమును పడయుచున్నాడు.

**సకృత్ప్రసక్తమాత్రోఽపి సర్వాత్మత్వే యదృచ్ఛయా ॥37॥**

**సర్వపాప వినిర్ముక్తః శివలోకే మహీయతే ।**

యదృచ్ఛయా = అప్రయత్నముగ (తన ప్రయత్నము లేకయే,) సర్వాత్మత్వే = తాను సర్వాత్మ నను జ్ఞానమున, సకృత్ = ఒకసారైన, ప్రసక్తమాత్రః అపి = ప్రసక్తిని పొందినవాడుకూడ, సర్వపాప వినిర్ముక్తః = సమస్త పాపములనుండి విడువబడినవాడై, శివలోకే = శివలోకమున, మహీయతే = పూజింపబడును.

అప్రయత్నముగ ఏకారణముచేతనైన తాను సర్వాత్మ నను జ్ఞానము ఒకసారి కలిగినను సర్వపాప వినిర్ముక్తుడై శివలోకమున పూజింపబడును.

**సర్వాత్మ భావనా యస్య పరిపక్వా మహాత్మనః ॥38॥**

**సంసారతారకః సాక్షాత్స ఏవ పరమేశ్వరః ।**

యస్య మహాత్మనః = ఏ మహాత్ముని, సర్వాత్మభావనా = ఎల్లర ఆత్మనను జ్ఞానము, పరిపక్వా = పండినదో-దృఢమై నిశ్చలమైనదో, సః = అతడు, సంసారతారకః = సంసారమునుండి దాటించు. సాక్షాత్ = ప్రత్యక్షమైన, పరమేశ్వర ఏవ = పరమేశ్వరుడే.

ఏ మహాత్మునకు తానే ఎల్లర ఆత్మ అను జ్ఞానము దృఢమైనదో ఆతడు సంసారమును దాటించు ప్రత్యక్ష పరమేశ్వరుడే.

**ఇతి శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకే ।**

**ప్రబంధే మానసోల్లాసే తృతీయోల్లాస సంగ్రహః ॥39॥**

ఇతి = ఇట్లు, శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకే = దక్షిణామూర్తి స్తోత్రార్థమును వివరించు, మానసోల్లాసే = మానసోల్లాసమను, ప్రబంధే = కృతియందు, తృతీయోల్లాససంగ్రహః = తృతీయోల్లాస సంగ్రహమగు మూడవ ఉల్లాసము.

ఇట్లు శ్రీ దక్షిణామూర్తి స్తోత్రార్థమును వివరించు మానసోల్లాసమను కృతియందు సంగ్రహమైన తృతీయోల్లాసము.

హరిః ఓం తత్సత్.



# చతుర్థోల్లాసము

**నానా ఛిద్రఘటోదర స్థిత మహాదీప ప్రభాభాస్వరం**
**జ్ఞానం యస్యతు చక్షురాదికరణ ద్వారా బహిఃస్పందతే ।**
**జానామీతి తమేవ భాంత మనుభాత్యేత త్సమస్తం జగత్**
**తస్మైశ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥4॥**

యస్య = ఎవని, జ్ఞానం = జ్ఞానము, నానాఛిద్ర ఘటోదర స్థిత మహాదీప ప్రభాభాస్వరం = పెక్కు రంధ్రములుగల కుండలోనున్న గొప్ప దీప ప్రకాశమువలె ప్రకాశించునదై, చక్షురాదికరణ ద్వారా = కన్ను మున్నగు ఇంద్రియముల ద్వారా, బహిః = బయటకు, స్పందతే = చిమ్ముచున్నదో, భాంతం = ప్రకాశించుచున్న, తం ఏవ = అతనినే, ఏతత్ = ఈ, సమస్తం జగత్ = ఎల్ల జగత్తు, జానామి = తెలిసికొనుచున్నాను, ఇతి = అని, అనుభాతి = అనుసరించి ప్రకాశించుచున్నది, తస్మై = ఆ, శ్రీగురు మూర్తయే= శ్రీగురుస్వరూపుడగు, శ్రీదక్షిణామూర్తయే = శ్రీ దక్షిణామూర్తికి, ఇదం = ఈ, నమః = నమస్కారము.

ఎవని జ్ఞానము పెక్కు రంధ్రములుగల కుండలోనున్న దీపకాంతివలె వెలుగుచు కన్ను మున్నగు ఇంద్రియముల ద్వారా బయటకు చిమ్ముచున్నదో ప్రకాశమానుడైన అతనినే అనుసరించి ఈ సమస్త జగత్తు "నేను తెలిసికొను చున్నాను" అని ప్రకాశించుచున్నది. అట్టి గురు స్వరూపుడైన శ్రీదక్షిణామూర్తికి నమస్కారము.

**నతః సంతః ప్రకాశంతే భావాఘటపటాదయః ।**
**నేశ్వరస్య సమావేశాదిత్యస్యోత్తర ముచ్యతే ॥1॥**

ఘటపటాదయః = కుండ, బట్ట మున్నగు, భావాః = వస్తువులు, స్వతః = తాముగానే, సంతః = ఉన్నవై, ప్రకాశంతే = కనుపించుచున్నవి, ఈశ్వరస్య = ఈశ్వరుని, సమావేశాత్ = ప్రవేశమువలన, న = కాదు, ఇతి= అని, అస్య = దీనికి, ఉత్తరం = ఉత్తరము (జవాబు), ఉచ్యతే = చెప్పబడుచున్నది.

కుండ, బట్ట మున్నగు వస్తువులు తమ శక్తి చేతనే ఉన్నవిగా కనిపించునేకాని, ఈశ్వరుని ప్రవేశముచే ఉన్నవిగా కనుపించుటలేదను ఆక్షేపణకు సమాధానము పై శ్లోకమున చెప్పబడినది.

**అహమిత్యనుసంధాతా జానామీతి న చేత్స్ఫురేత్ ।**
**కస్య కో వా ప్రకాశేత జగచ్చ స్యాత్సుషుప్తవత్ ॥2॥**

అహం ఇతి = నేను అని, అనుసంధాతా = జ్ఞాత-తెలివికి ఆధారముగ నున్న తత్త్వము, జానామి ఇతి = తెలిసి కొనుచున్నాను అని, నస్ఫురేత్ చేత్ = ప్రకాశముకానిచో, కస్య = ఎవనికి, కో వా = ఏది, ప్రకాశేత = కనుపించును? చ = మఱియు, జగత్ = ప్రపంచము, సుషుప్తవత్= నిద్రించుచున్నవానివలె, స్యాత్ = అయ్యెడిది.

నేను అను జ్ఞాతకు తెలిసికొనుచున్నాను అని ప్రకాశము కానిచో ఎవనికి ఏది కనిపించును? అపుడు ప్రపంచము నిద్రించుచున్న వానివలె అయ్యెడిది.

**ప్రాగూర్ధ్వం చాసతాం సత్త్వం వర్తమానేఽపి న స్వతః ।**
**తస్మాదీశే స్థితం సత్త్వం ప్రాగూర్ధ్వత్వ వివర్జితే ॥3॥**

ప్రాక్ = పూర్వము, చ = మరియు, ఊర్ధ్వం = తర్వాతను, అసతాం= లేనివాని, సత్వం = ఉనికియు, వర్తమానే అపి = ఉన్నకాలమందుకూడ,



స్వతః = స్వయముగ, న = కాదు, తస్మాత్ = అందువలన, సత్త్వం = ఉనికియు, ప్రాగూర్ధ్వత్వ వివర్జితే = పూర్వము, తర్వాత అనుట లేని, ఈశే= ఈశ్వరునియందే, స్థితం = స్థిరమై యున్నది.

ఉత్పత్తికి పూర్వము, నశించిన తర్వాతను లేని వస్తువుల ఉనికియు. అవి ఉన్న కాలమందు కూడ తమ శక్తి చేతనే కాజాలదు. కాబట్టి ఉనికియు పూర్వము తర్వాత అనుటలేని (ఉత్పత్తి నాశనములేని నిత్యుడగు) ఈశ్వరుని యందే అనుట స్థిరమయ్యెను.

**స్వయమేవ ప్రకాశేరన్ జడా యది వినేశ్వరమ్ ।**
**సర్వం సర్వస్య భాసేత న వా భాసేత కించన ॥4॥**

జడాః = అచేతన వస్తువులు, ఈశ్వరం వినా = ఈశ్వరుడు (ఈశ్వర సంబంధము) లేక, స్వయం ఏవ = తాముగనే, ప్రకాశేరన్ యది = ప్రకాశించునవి అగుచో, సర్వస్య = ప్రతియొకనికి, సర్వం = సమస్తము, భాసేత = కనుపించవలయు. వా = లేదా, కించన = ఏదియు, న భాసేత= కనుపించకుండవలె.

ఈశ్వరసంబంధము లేక అచేతనవస్తువులు స్వతః భాసించు శక్తి కల్గియున్న, ప్రతియొక్కరికి సర్వము భాసించ వలసివచ్చును. లేదా ఏదియు భాసించకుండవుండవలసివచ్చును.

**తస్మాత్సర్వజ్ఞమజ్ఞం వా జగత్స్యాదేక రూపకమ్ ।**

తస్మాత్ = కావున, జగత్ = ప్రపంచము, ఏకరూపకం = ఒకే విధముగ, సర్వజ్ఞం = అంతయు తెలిసినదిగ గాని, వా = లేదా, అజ్ఞం = ఏమియు తెలియనిదిగగాని, స్యాత్ = కావలసివచ్చును.

అట్లయిన జగత్తంతయు ఒకేరీతిగ అంతయు తెలిసినదిగగాని, ఏమియు తెలియనిదిగగాని కావలసివచ్చును.

**తుల్యే స్వయం ప్రకాశత్వే జడచేతనయోర్మిథః ॥5॥**

**తుల్యమేవ ప్రసజ్యేరన్ గ్రాహ్యగ్రాహకతాదయః ।**
**ఇంద్రియాణామనియమనా చ్చాక్షుషా స్యురసాదయః ॥6॥**

జడచేతనయోః = జడ చేతన వస్తువులకు, స్వయం ప్రకాశత్వే = స్వతః ప్రకాశించు శక్తి, తుల్యే = సమానమైనచో, గ్రాహ్య గ్రాహకతాదయః= తెలివికి విషయముగ నుండుట, మరియు తెలివిగలిగి యుండుట, మిథః = పరస్పరము రెంటికి, తుల్యమేవ = సమానముగనే, ప్రసజ్యేరన్ = చేరుకొని ఉండవలె, ఇంద్రియాణాం = ఇంద్రియముల, అనియమనాత్ = నియమము లేనందువలన (అదుపు లేనందువలన), రసాదయః = రుచి మున్నగునవి, చాక్షుషాః = కంటిచే తెలియదగినవి, స్యుః = అయ్యెడివి.

స్వతః ప్రకాశించుశక్తి జడచేతనములకు సమానముగ నున్నచో, జ్ఞేయత్వ, జ్ఞాతృత్వములు సమానముగ నుండవలె, అపుడు జ్ఞేయము, జ్ఞాత అనుభేదము లేనట్లగును. మరియు ఇంద్రియ వ్యాపారమున నియమము లేనందున రుచి మున్నగునవి తన పనికాని కంటిచే తెలియవలసి వచ్చును.

**మలినా మలినాదర్శ పశ్చాత్ప్రాగ్భాగతుల్యయోః ।**

**క్రియాశక్తి, జ్ఞానశక్త్యోరంతఃకరణభాగయోః ।**
**ప్రతిబింబే స్ఫురన్నీశః కర్తా జ్ఞాతేతి మన్యతే ॥7॥**

మలినామలినాదర్శ పశ్చాత్ప్రాగ్భాగతుల్యయోః = మైలగల మరియు మైలలేని అద్దము వెనుక ముందు సమానమైన, అంతఃకరణభాగయోః = అంతఃకరణవిభాగములైన, క్రియాశక్తి జ్ఞానశక్త్యోః = క్రియాశక్తి



జ్ఞానశక్తులలోని, ప్రతిబింబే = ప్రతిబింబమున, స్ఫురన్ = ప్రకాశించు, ఈశః = పరమాత్మ, కర్తా = పని చేయువాడు, జ్ఞాతా = విషయమును తెలియువాడు, ఇతి = అని, మన్యతే = తెలియబడుచున్నాడు.

మైలగల, మైలలేని అద్దము వెనుక ముందు భాగముల వలెనున్న అంతఃకరణభాగములకు క్రియాశక్తి జ్ఞానశక్తులలో ప్రతిబింబించి ప్రకాశించు పరమాత్మనే కర్త, జ్ఞాత అని తెలియుచున్నాము.

**బుద్ధిః సత్వగుణోత్కర్షాన్నిర్మలో దర్పణో యథా ।**

**గృహ్ణాతి విషయచ్ఛాయామాత్మచ్ఛాయానుభావతః ॥8॥**

సత్వగుణోత్కర్షాత్ = సత్త్వగుణము హెచ్చుగా నున్నందువలన, బుద్ధిః = బుద్ధి, నిర్మలః = స్వచ్ఛమైన, దర్పణః = అద్దము, యథా = ఎట్లో, అట్లు, ఆత్మచ్ఛాయానుభావతః = ఆత్మప్రతిబింబ ప్రభావమువలన, విషయచ్ఛాయాం - విషయముల ప్రతిబింబమును, గృహ్ణాతి = గ్రహించుచున్నది.

సత్వగుణము హెచ్చుగా నున్నందున బుద్ధి స్వచ్ఛమైన అద్దమువలె నుండి ఆత్మ ప్రతిబింబ ప్రభావముచే విషయముల ప్రతిబింబమును గ్రహించు చున్నది.

**అంతఃకరణ సంబంధా న్నిఖిలానీంద్రియాణ్యపి ।**
**రథాంగ నేమివలయే కీలితా ఇవ కీలకాః ॥9॥**

నిఖిలాని ఇంద్రియాణి అపి = అన్ని ఇంద్రియములు కూడ, అంతఃకరణసంబంధాత్ = అంతఃకరణ సంబంధము వలన (విషయగ్రాహక శక్తిని నిలయముగా కలిగి యున్నవి) రథాంగనేమివలయే = చక్రకుంభ ప్రదేశమున, కీలితాః = చేర్చిన, కీలకాః ఇవ = అరలవలె (ఉన్నవి)

సర్వేంద్రియములకును అంతఃకరణసంబంధముచే విషయగ్రాహక శక్తి నియతమైయున్నది. ఇవి చక్రకుంభభాగమున చేర్చిన అరలవలె ఉన్నవి.

**నాడ్యోఽంతఃకరణే స్యూతా జాలసంస్యూత సూత్రవత్ ॥10॥**

**తాభిస్తు గోళకాంతాభిః ప్రసరంతి స్ఫులింగవత్ ।**
**కరణాని సమస్తాని యథా స్వం విషయం ప్రతి ॥11॥**

జాలసంస్యూత సూత్రవత్ = వలలో చేరికొనియున్న దారములవలె అంతఃకరణే = అంతఃకరణమున, నాడ్యః = నాడులు, స్యూతాః = చేరికొనియున్నవి. గోళకాంతాభిః = ఇంద్రియములు ప్రవర్తించు) అంగములయందు కనబడు, తాభిః = ఆ నాడులద్వారా, సమస్తాని కరణాని= సరేంద్రియములు, స్వంవిషయం ప్రతి = తమ విషయమును గూర్చి యథా= ఎట్లో, అట్లు, స్ఫులింగవత్ = నిప్పు రవ్వలవలె, ప్రసరంతి = ప్రసరించుచున్నవి.

వలలో దారములు గూర్చబడినట్లు అంతఃకరణములో నాడులు గూర్చబడినవి. ఇంద్రియములు ప్రవర్తించు అంగములయందు కనుపించు ఆనాడులగుండా సర్వేంద్రియములు తమతమ విషయములవైపు అగ్నికణములవలె ప్రసరించుచున్నవి.

**దేహస్య మధ్యమం స్థానం మూలాధార ఇతీర్యతే ।**
**గుదాత్తు ద్వ్యంగుళాదూర్ధ్వం మేఢ్రాత్తు ద్వ్యంగుళాదధః ॥12॥**

గుదాత్ = గుదముకంటె, ద్వ్యంగుళాత్ ఊర్ధ్వం = రెండంగుళములు పైన, మేఢ్రాత్ = శిశ్నముకంటె, ద్వ్యంగుళాత్ అధః = రెండంగుళముల



క్రింద ఉన్న, దేహస్య మధ్యమం స్థానం = దేహమధ్యస్థానము, మూలాధారః ఇతి = మూలాధారము అని, ఈర్యతే = పిలువబడుచున్నది.

గుదముకంటె రెండు అంగుళములు పైన, శిశ్నముకంటె రెండు అంగుళముల క్రింద ఉన్న దేహమధ్యస్థానము మూలాధారము.

**త్రికోణోఽధోముఖాగ్రశ్చ కన్యకా యోనిసన్నిభః ।**

**యత్రకుండలినీ నామ పరాశక్తిః ప్రతిష్ఠితా ।**
**ప్రాణాగ్ని బిందునాదానాం సవిత్రీ సా సరస్వతీ ॥13॥**

కన్యకాయోనిసన్నిభః = కన్యకాయోనివలె,అధోముఖాగ్రః = క్రిందముఖమైన కొనగల, త్రికోణః = త్రికోణాకారముగా నున్నది, యత్ర= ఎచ్చట, కుండలినీనామ = కుండలిని అను పేరుగల, పరాశక్తిః = పరాశక్తి, ప్రతిష్ఠితా = స్థానమును పొందియున్నదో, సా = ఆకుండలినీ శక్తియే, ప్రాణాగ్ని బిందునాదానాం = ప్రాణము, అగ్ని బిందువు, నాదము వీని, సవిత్రీ = సృష్టికర్త్రియగు, సరస్వతీ = సరస్వతి.

కుండలిని అనుపేరుగల పరాశక్తి స్థానమైన ఆమూలాధారము కన్యకా యోనివలె క్రింది ముఖమైన కొనగల త్రికోణాకారముగ నున్నది. ఆ కుండలినీ శక్తియే ప్రాణాగ్ని బిందునాదముల జననియగు సరస్వతి.

**మూలాధారాగ్ర కోణస్థా సుషుమ్నా బ్రహ్మరంధ్రగా ।**
**మూలేఽర్ధచ్ఛిన్న వంశాభా షడాధార సమన్వితా ॥14॥**

సుషుమ్నా = సుషుమ్నా అనునాడి, మూలాధారాగ్ర కోణస్థా = మూలాధారము యొక్క కొనయగు మూలలోనుండి, బ్రహ్మరంధ్రగా = బ్రహ్మరంధ్రమును చేరుచున్నది. అది, మూలే = మూలమున, అర్ధచ్ఛిన్న

వంశాభా = సగమున చీలిన వెదురువలె, షడాధార సమన్వితా = ఆరు ఆధారములను పద్మములతో కూడియున్నది.

సుషుమ్న అనునాడి మూలాధారము యొక్క కొననుండి బ్రహ్మ రంధ్రమునకు పోవుచున్నది. అది అడుగున సగము చీలిన వెదురువలె నున్నది. మరియు ఆధారములను ఆరు పద్మములతో కూడియున్నది.

**తత్పార్శ్వకోణయోర్జాతే ద్వే ఇడాపింగళే స్థితే ।**
**నాడీచక్రమితి ప్రాహు స్తస్మాన్నాడ్యః సముద్గతాః ॥15॥**

తత్పార్శ్వకోణయోః = దాని ప్రక్కని కొనలలో, జాతే = ప్రారంభమైన, ఇడా పింగళే ఇతి = ఇడా పింగళి అను, ద్వే = రెండు నాడులు, స్థితే = ఉన్నవి. (ఈమూడు నాడులు చేరిన దానిని) నాడీచక్రం ఇతి = నాడీ చక్రమని, ప్రాహుః = చెప్పుచున్నారు. తస్మాత్ = దాని నుండి, నాడ్యః = నాడులు, సముద్గతాః = బయలుదేరినవి.

ఆ త్రికోణము ప్రక్కన కొనలలో ప్రారంభమైన ఇడ, పింగళ అను నాడులున్నవి. ఈ మూడింటికి నాడీ చక్రమని పేరు. దాని నుండి నాడులు బయలుదేరినవి.

**గాంధారీహస్తి జిహ్వాన నయనాంతం ప్రధానతః । 16**

**నాడీ చక్రేణ సంస్యూతే నాసికాంతముభేగతే ।**
**నాభిమండలమాశ్రిత్య కుక్కుటాండమివ స్థితమ్ ॥17॥**

**నాడీ చక్రమితి ప్రాహుస్తస్యాన్నాడ్యః సముద్గతాః ।**
**పూషాచాలంబుషా నాడీకర్ణ ద్వయముపాశ్రితే ॥18॥**



**నాడీశుక్లాహ్వయా తస్మాద్భ్రూమధ్యముపధావతి ।**
**సరస్వత్యాహ్వయా నాడీ జిహ్వాంతా వాక్ప్రసారిణీ ॥19॥**

**నాడీ విశ్వోదరీ నామ భుంక్తేఽన్నం సా చతుర్విధమ్ ।**
**పీత్వా పయస్వినీతోయం కంఠస్థా కురుతే క్షుతమ్ ॥20॥**

**నాడీచక్రసముద్భూతా నాడ్యస్తిస్రస్త్వధోముఖాః ।**
**రాకాశుక్రం సినీవాలీ మూత్రం ముంచేత్కుహూర్మలమ్॥21॥**

**భుక్తాన్న రసమాదాయ శంఖినీ ధమనీ పునః ।**
**కపాలకుహరం గత్వా మూర్ధ్ని సంచినుతే సుధామ్ ॥22॥**

గాంధారీ = గాంధారి, చ = మరియు, హస్తిజిహ్వా = హస్తిజిహ్వా, నయనాంతం = కన్నువరకు, ప్రధావతః = పోవుచున్నవి; నాడీచక్రేణ = నాడీచక్రముతో, సంస్యూతే = కూడియున్న, ఉభే = రెండు (నాడులు) నాసికాంతం ముక్కువరకు, గతే = పోయినవి, నాభిమండలం = నాభి ప్రదేశమును, ఆశ్రిత్య = ఆశ్రయించి, కుక్కుటాండం ఇవ = కోడిగ్రుడ్లువలె, స్థితం = ఉన్నదానిని, నాడీచక్రం ఇతి = నాడీచక్రమని, ప్రాహుః - చెప్పుచున్నారు, తస్మాత్ = దానినుండి, నాడ్యః = నాడులు, సముద్గతాః = బయలుదేరినవి, పూషా = పూష, చ = మరియు, అలంబుషా = అలంబుష అను, నాడీ = నాడి, కర్ణద్వయం = రెండు చెవులను, ఉపాశ్రితే = చేరినవి, తస్మాత్ = ఆ నాడీచక్రము నుండి, శుక్లాహ్వయా = శుక్ల అను పేరుగల, నాడీ = నాడి, భ్రూమధ్యం = కనుబొమల నడుమ, ఉపధావతి = పోవుచున్నది. జిహ్వాంతా = నాలుకలోని, సరస్వత్యాహ్వయా = సరస్వతియను, నాడీ=నాడి,

వా[క్ప్రసారిణీ = వాక్కును ప్రసరించును, విశ్వోదరీనామ = విశ్వోదరియను, సా నాడీ = ఆ నాడి, చతుర్విధం = నాల్గు విధములైన, అన్నం - ఆహారమును, భుంక్తే = తినుచున్నది. కంఠస్థా = కంఠమందలి, పయస్వినీ = పయస్విని, తోయం = నీటిని, పీత్వా = త్రాగి, క్షుతం = తుమ్ములను, కురుతే = చేయుచున్నది, నాడీచక్రసముద్భూతా = నాడీ చక్రమునుండి పుట్టిన, తిస్రః = మూడు, నాడ్యస్తు = నాడులైతే, అధోముఖాః = క్రింది ముఖములు గలవి, రాకా = రాకా, శుక్లం = రేతస్సును, సినీవాలీ = సినీవాలి, మూత్రం = మూత్రమును, కుహూః = కుహూ, మలం = మలమును, ముంచేత్ = విడుచును, పునః = మఱియు, శంఖినీ = శంఖినియను, ధమనీ = నాడి, భుక్తాన్నరసం = తిన్న ఆహారసారమును, ఆదాయ = తీసుకొని, కపాల కుహరం = నెత్తిలోని ఆకాశమును, గత్వా = పొంది, మూర్ధ్ని = తలయందు, సుధాం = అమృతమును, సంచినుతే = చేర్చుచున్నది.

గాంధారి, హస్తి, జిహ్వ అను నాడులు కన్నులకు, నాడీచక్రము నుండి బయల్దేరు వేరు రెండు నాడులు ముక్కుల వరకు పోవుచున్నవి. నాడీ భాగమందలి కోడిగ్రుడ్లు ఆకారముగల నాడీ సమూహమునకు నాడీచక్రమని పేరు. దాని నుండి నాడులు బయలుదేరుచున్నవి. పూష, అలంబుష చెవులవరకు, శుక్లనాడి భ్రూమధ్యమునకు పోవుచున్నవి. సరస్వతీయను నాడి నాలుకకుపోయి వాక్కును ప్రసరింపజేయున్నది. విశ్వోదరి యనునాడి చతుర్విధమైన అన్నమును తినును. పయస్విని నీరుత్రాగుట, తుమ్ముట చేయును. నాడీచక్రము నుండి మూడు నాడులు క్రిందకిపోయి యున్నవి. వీనిలో రాకా రేతస్సును, సినీవాలి మూత్రమును, కుహూ మలమును విడుచును. శంఖిని అనునాడి తిన్న ఆహారమును తీసికొని నెత్తిలోని ఆకాశమును చేరి అచట అమృతమును చేర్చుచున్నది.



**శతమేకం చ నాడ్యః స్యుస్తాసామేకా శిరోగతా ।**
**తయోర్ధ్వ మాయాన్ముక్తః స్యాదితి వేదాంతశాసనమ్॥23॥**

శతం = నూరు, చ = మరియు, ఏకం = ఒకటి, నాడ్యః = నాడులు, స్యుః = ఉన్నవి, తాసాం = వానిలో, ఏకా = ఒకటి, శిరోగతా= తలకుపోవును, తయా = దానిచే, ఊర్ధ్వం = పైకి. ఆయాన్ = పోయినవాడు, ముక్తః = ముక్తుడు, స్యాత్ = అగును, ఇతి = అని, వేదాంతశాసనం = వేదాంతబోధ.

నాడులు 101. వీనిలో 1 సుషుమ్న బ్రహ్మ రంధ్రమునకు పోవు చున్నది. దాని ద్వారా పైకి పోయినవాడు ముక్తుడగునని వేదాంత మతము.

**యదా బుద్ధిగతైః పుణ్యైః ప్రేరితేంద్రియమార్గతః ।**
**శబ్దాదీన్విషయాన్భుంక్తే తదా జాగరితం భవేత్ ॥24॥**

యదా = ఎపుడు, బుద్ధిగతైః = బుద్ధిని చేరిఉన్న, పుణ్యైః = పుణ్య పాపములచే, ప్రేరిత = ప్రేరేపింప బడిన, ఇంద్రియమార్గతః = ఇంద్రియముల ద్వారా, శబ్దాదీన్ = శబ్దము మున్నగు, విషయాన్ - విషయములను, భుంక్తే = అనుభవించునో, తదా = అపుడు, జాగరితం= మేల్కొనియుండు స్థితి, భవేత్ = అగును.

బుద్ధిలోని జన్మాంతర కర్మరూప పుణ్యపాపములచే ప్రేరేపింపబడిన ఇంద్రియముల ద్వారా శబ్దాది బాహ్య విషయముల ననుభవించునపుడు జాగ్రదవస్థ.

**సంహృతేష్వింద్రియేష్వేషు జాగ్రత్సంస్కారజాన్పుమాన్ ।**
**మానసాన్విషయాన్భుంక్తే స్వప్నావస్థా తదా భవేత్ ॥25॥**

ఏషు ఇంద్రియేషు = ఈ (బాహ్య) ఇంద్రియములు, సంహృతేషు= పనిచేయనపుడు, పుమాన్ = జీవుడు, జాగ్రత్సంస్కారజాన్= జాగ్రత్సంస్కారముచే కలిగిన, మానసాన్ = మనస్సులోనున్న! విషయాన్ = విషయములను, భుంక్తే = అనుభవించునో, తదా = అపుడు స్వప్నావస్థా = స్వప్నావస్థ, భవేత్ = అగును.

ఈ బాహ్యేంద్రియములు పనిచేయనపుడు జాగ్రత్సంస్కారముచే కల్గిన మానసిక విషయములను జీవుడనుభవించు స్థితి స్వప్నావస్థ.

**మనసోఽప్యుపసంహారః సుషుప్తిరితి కథ్యతే ।**

మనసః అపి = మనస్సు యొక్కయు, ఉపసంహారః = లోపలికి లాగికొను (పనిలేని) స్థితి, సుషుప్తిః ఇతి = సుషుప్తి అని, కథ్యతే = చెప్పబడుచున్నది. మనస్సుకూడ పని చేయకుండు స్థితి సుషుప్తి.

**తత్ర మాయా సమాచ్ఛన్నః సన్మాత్రో దృశ్యతే పుమాన్ ॥26॥**

**మూఢో జడోఽజ్ఞ ఇత్యేవం మాయావేశాత్ప్రకాశతే ।**

తత్ర = ఆ సుషుప్తిలో, మాయా సమాచ్ఛన్నః = మాయచే కప్పబడిన, పుమాన్ = జీవుడు, సన్మాత్రః = ఉనికి మాత్రుడై, దృశ్యతే= కనబడును, మూఢః = మోహాధీనుడు, జడః = అచేతనుడు, అజ్ఞః = తెలివి లేనివాడు, ఇతి ఏవం = ఈరీతిగ, మాయావేశాత్ = మాయావరణవలన, ప్రకాశతే = కనుపించును.



**సుఖమస్వాప్సమిత్యేవం ప్రబోధసమయే పుమాన్ ।**
**సచ్చిదానందరూపః సన్సమ్యగేవ ప్రకాశతే ॥27॥**

ప్రబోధసమయే = మేల్కొనినపుడు, పుమాన్ = జీవుడు, సుఖం= సుఖముగ, అస్వాప్సం = నిద్రించితిని, ఇతి = అని, ఏవం = ఈ రీతిగ, సచ్చిదానందరూపః సన్ = సత్తు చిత్తు ఆనందరూపుడై, సమ్యక్ ఏవ = బాగుగనే, ప్రకాశతే = కనుపించుచున్నాడు.

మెలకువ వచ్చినపుడు జీవుడు "సుఖముగ నిద్రించితి" అను తెలివిచే సచ్చిదానంద రూపుడయి స్పష్టముగనే ప్రకాశించుచున్నాడు.

**ఇత్థం జగత్సమావిశ్య భాసమానే మహేశ్వరే ।**
**సూర్యాదయోఽపి భాసంతే కిముతాన్యే ఘటాదయః ॥28॥**

ఇత్థం = ఇట్లు, జగత్ = జగత్తును, సమావిశ్య = ప్రవేశించి, మహేశ్వరే = పరమాత్మ, భాసమానే = ప్రకాశించుచుండ, సూర్యాదయః అపి = సూర్యుడు మొదలగువారుకూడ, భాసంతే = ప్రకాశించుచున్నారు, అన్యే = ఇతరమైన, ఘటాదయః = కుండ మున్నగునవి, కిం ఉత = ఏమి చెప్పదగినవి.

ఇట్లు పరమాత్మ జగత్తును ప్రవేశించి ప్రకాశించుచుండ సూర్యుడు మొదలగు (వెలుతురుకు కారణమని చెప్పికొను) వారుకూడ ప్రకాశించు చున్నారు. ఇక కుండ మున్నగు వాని సంగతి ఏమి చెప్పవలెను.

**తస్మాత్సత్తా స్ఫురత్తా చ భావానా మీశ్వరాశ్రయాత్ ।**
**సత్యం జ్ఞాన మనంతం చ శ్రుత్యా బ్రహ్మోపదిశ్యతే ॥29॥**

తస్మాత్ = అందువలన, భావానాం = వస్తువుల, సత్తా = ఉనికి, చ = మఱియు, స్ఫురత్తా = ప్రకాశము, ఈశ్వరాశ్రయాత్ = ఈశ్వరుని ఆశ్రయించి ఉన్నవి. బ్రహ్మ = బ్రహ్మము, శ్రుత్యా = వేదముచే! సత్యం = సత్యమైనది, జ్ఞానం = తెలివి, చ = మఱియు, అనంతం = అనంతము, అని ఉపదిశ్యతే = ఉపదేశింపబడినది.

కావున వస్తువుల ఉనికి, ప్రకాశము ఈశ్వరునే ఆశ్రయించి యున్నవి. వేదము, బ్రహ్మము సత్యము, జ్ఞానము, అనంతము అని బోధించుచున్నది.

**జాగ్రత్స్వప్నోద్భవం సర్వమసత్యం జడమంధవత్ ।**
**ఈశ్వరశ్చాహ మిత్యేవం భాసతే సర్వ జంతుషు ॥30॥**

జాగ్రత్స్వప్నోద్భవం = జాగ్రత్తు, స్వప్నముల యందు కలుగు (కనుపించు)నది, సర్వం = అంతయు, అసత్యం = సత్యము కాదు, చ= మఱియు, అంధవత్ = గ్రుడ్డివానివలె, జడం = జ్ఞానము లేనిది, ఈశ్వరః - ఈశ్వరుడు, సర్వజంతుషు - ఎల్ల ప్రాణుల యందును, అహం - నేను, ఇతి ఏవం - అను రూపమున, భాసతే - వెలుగుచున్నాడు.

జాగ్రత్స్వప్నావస్థలయందు కన్పించు జగత్తంతయు అసత్యము, గ్రుడ్డివానివలె జ్ఞానరహితమైనది. ఈశ్వరుడు ఎల్ల జంతువుల యందును నేను అను రూపమున, ప్రకాశించుచున్నాడు.

**నిర్వికల్పశ్చ శుద్ధశ్చ మలినశ్చేత్యహం త్రిధా ॥31॥**

**నిర్వికల్పం పరం బ్రహ్మ నిర్ధూతాఖిల కల్పనమ్ ।**
**ధూల్యంధకార ధూమాభ్రనిర్ముక్త గగనోపమమ్ ॥32॥**



అహం = అహంకారము, నిర్వికల్పః = నిర్వికల్పమైనది, శుద్ధః = శుద్ధమైనది, చ = మరియు మలినః = మలినమైనది, ఇతి = ఇట్లు, త్రిధా = మూడు విధములైనది. (వీనియందు) నిర్వికల్పం = నిర్వికల్ప అహంకారము, ధూల్యంధకార ధూమాభ్ర నిర్ముక్తగగనోపమం= దుమ్ము చీకటి పొగమబ్బు (మున్నగు స్వరూపమును మూయు విశేషణము)లచే విడువబడిన ఆకాశమువలె, నిర్ధూతాఖిల కల్పనం = ఎల్లకల్పనలచే విడువబడిన, పరం = శ్రేష్ఠమైన, బ్రహ్మ = బ్రహ్మము.

నిర్వికల్పము, శుద్ధము, మలినము అని అహంకారము మూడు విధములు. నిర్వికల్పమగు అహంకారము ధూళి, చీకటి, పొగ, మేఘములు లేని ఆకాశమువలె ఏవిధమైన కల్పన (భేదము) లేని పరబ్రహ్మమే అయియున్నది.

**వివేకసమయే శుద్ధం దేహాదీనాం వ్యపోహనాత్ ।**
**యథాంతరిక్షం సంక్షిప్తం నక్షత్రైః కించి దీక్ష్యతే ॥33॥**

శుద్ధం = శుద్ధమగు అహంకారము, నక్షత్రైః = నక్షత్రములచే, సంక్షిప్తం = సంకుచితమైన, అంతరిక్షం = ఆకాశము, యథా = ఎట్లో అట్లు, వివేక సమయే = వివేచన చేయునపుడు, దేహాదీనాం = శరీరము మొదలగు ఉపాధుల, వ్యపోహనాత్ = తొలగింపువలన, కించిత్ = కొంచెము, ఈక్ష్యతే = కనుపించును.

శుద్ధాహంకారము నక్షత్రములచే ఆకాశము సంకుచితమైనట్లు, వివేచన చేయునపుడు దేహము మున్నగు ఉపాధులు తొలగుటచే కొంచెము కనుపించును.

**దేహేంద్రియాది సంసర్గా న్మలినం కలుషీకృతమ్ ।**
**యథాకాశం తమో రూఢం స్ఫురత్యనవకాశవత్ ॥34॥**

మలినం = మలినాహంకారము, దేహేంద్రియాది సంసర్గాత్= శరీరము, ఇంద్రియములు మున్నగు వాని సంబంధము వలన, కలుషీకృతం = మలినము చేయబడినదై, తమోరూఢం = చీకటి క్రమ్మిన, ఆకాశం = ఆకాశము, అనవకాశవత్ = అవకాశ (స్థల)ము లేనిదివలె యథా = ఎట్లో, అట్లు, స్ఫురతి = తోచును.

మలినాహంకారము దేహేంద్రియాద్యుపాధి సంబంధముచే చీకటి క్రమ్మిన ఆకాశము అవకాశము లేనిదివలె కనిపించునట్లు కలుషితముగ కనుపించును.

**అహమిత్యైశ్వరం భావం యదా జీవః ప్రబుధ్యతే ।**
**సర్వజ్ఞః సర్వకర్తా చ తదా జీవో భవిష్యతి ॥35॥**

యదా = ఎప్పుడు, జీవః = జీవుడు, అహం = నేను, ఇతి = అను, ఐశ్వరం = ఈశ్వర సంబంధియగు, భావం = భావమును, ప్రబుధ్యతే = తెలిసికొను చున్నాడో, తదా = అప్పుడు, జీవః = జీవుడు, సర్వజ్ఞః = సర్వము తెలిసిన వాడు, సర్వకర్తా చ = సర్వము చేయువాడను, భవిష్యతి = కాగలడు.

జీవునకు నేనే ఈశ్వరుడనను జ్ఞానము కలిగినపుడు సర్వజ్ఞుడు సర్వకర్తయు అగును.



**మాయయాధిక సమ్మూఢో విద్యయేశః ప్రకాశతే ।**
**నిర్వికల్పానుసంధానే సమ్యగాత్మా ప్రకాశతే ॥36॥**

మాయయా = మాయచే, అధిక సంమూఢః = మిక్కిలి మోహమును చెందిన, ఈశః = ఈశ్వరుడు, విద్యయా = విద్యచే, ప్రకాశతే = ప్రకాశించును, నిర్వికల్పానుసంధానే = నిర్వికల్పాహంకార ధ్యానముచే, ఆత్మా = ఆత్మ, సమ్యక్ = లెస్సగా, ప్రకాశతే = ప్రకాశించును.

మాయచే మిక్కిలి మోహితుడైన ఈశ్వరుడు విద్యచే ప్రకాశమును పొందుచున్నాడు. నిర్వికల్పాహంకార ధ్యానముచే ఆత్మ తత్త్వము బాగుగ ప్రకాశించును.

**అవిద్యాఖ్యతిరోధానవ్యపాయే పరమేశ్వరః ।**
**దక్షిణామూర్తి రూపోఽసౌ స్వయమేవ ప్రకాశతే ॥37॥**

అవిద్యాఖ్యతిరోధానవ్యపాయే = అవిద్యయను తెరతొలగగ, దక్షిణామూర్తి రూపః = దక్షిణామూర్తి రూపుడగు, అసౌ పరమేశ్వరః = ఈ పరమేశ్వరుడు, స్వయం ఏవ = తానే, ప్రకాశతే = ప్రకాశించు చున్నాడు.

అవిద్యయను తెర నశించునపుడు దక్షిణామూర్తి రూపుడగు పరమేశ్వరుడు తానే ప్రకాశించును.

**ఇతి శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థప్రతిపాదకే ।**
**ప్రబంధే మానసోల్లాసే చతుర్థోల్లాససంగ్రహః ॥38॥**

ఇతి = ఇట్లు, శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకే = శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థమును వివరించు, మానసోల్లాసే = మానసోల్లాసమను, ప్రబంధే = కృతియందు, చతుర్థోల్లాస సంగ్రహః = చతుర్థోల్లాస సంగ్రహమగు నాల్గవ ఉల్లాసము.

ఇట్లు శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థమును వివరించు మానసోల్లాసమను కృతియందు సంగ్రహమైన చతుర్థోల్లాసము.

హరిః ఓ తత్సత్ ఓం



## పంచమోల్లాసం

**దేహం ప్రాణమపీంద్రియాణ్యపి చలాంబుద్ధిం చ శూన్యం విదుః**
**స్త్రీ బాలాంధజడోపమాస్త్వహమితి భ్రాంతాభృశం వాదినః ।**
**మాయాశక్తి విలాసకల్పిత మహా వ్యామోహ సంహారిణే**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥ 5॥**

స్త్రీబాలాంధజడోపమాః = స్త్రీలు, పిల్లలు,గ్రుడ్డివారు, తెలివిలేనివారు వీరితో పోల్చదగిన, భృశం = మిక్కిలి, భ్రాంతాః = భ్రాంతు (అజ్ఞానాధీను) లై యున్న, వాదినః = వాదులు (కొందఱు), అహం = అహంకారము (ఆత్మ) దేహం = శరీరమనియు, అపి = మఱియు, ప్రాణః = ప్రాణమనియు, అపి = మఱియు,ఇంద్రియాణి = ఇంద్రియములనియు, చలాం = ఎల్లప్పుడు చలించుచున్న, బుద్ధిం = బుద్ధియనియు, శూన్యం = శూన్యమనియు, విదుః = తెలియుచున్నారు. మాయాశక్తి విలాసకల్పిత మనో వ్యామోహ సంహారిణే = మాయాశక్తి లీలచే కల్గియున్న గొప్ప భ్రాంతిని నాశమొనర్చు. తస్మై = ఆ, శ్రీగురుమూర్తయే = శ్రీగురు స్వరూపుడగు, శ్రీదక్షిణామూర్తయే = శ్రీదక్షిణామూర్తికి, ఇదం = ఈ, నమః = నమస్కారము.

స్త్రీలు, పిల్లలు, గ్రుడ్డివారు, తెలివిలేనివారు, వీరితో పోల్చదగిన మిక్కిలి అజ్ఞానాధీనులై యున్న కొందఱు వాదులు ఆత్మను దేహమనియు, ప్రాణమనియు, ఇంద్రియములనియు, సదా చలించు బుద్ధియనియు, శూన్యమనియు తలంచుచున్నారు. మాయా శక్తి లీలచే కల్గిన ఈ దొడ్డ

భ్రాంతిని నశింపజేయు శ్రీగురుస్వరూపుడగు శ్రీదక్షిణామూర్తికి వందనము.

**ప్రమాణమేకం ప్రత్యక్షం తత్త్వం భూతచతుష్టయమ్ ।**
**మోక్షశ్చ మరణాన్నాన్యః కామార్థౌ పురుషార్థకౌ ॥1॥**

ప్రత్యక్షం = ఇంద్రియగోచర మగునది, ఏకం = ఒకటే, ప్రమాణం = ప్రమాణము, తత్త్వం = తత్త్వము, భూతచతుష్టయం = భూమి, జలము, తేజస్సు, వాయువు యీ నాల్గు, చ = మఱియు, మరణాత్ = చావుకంటే, అన్యః = వేరు, మోక్షః న = మోక్షము లేదు, కామార్థౌ = కామము, అర్థము రెండే, పురుషార్థకౌ = జీవనమున సంపాదింప దగిన ముఖ్య విషయములు.

ఇంద్రియ గోచరమగునది ఒకటే ప్రమాణము. భూమి, జలము, తేజస్సు, వాయువు యీ నాలుగు మాత్రమే సత్యములు. చావుకంటే వేరు మోక్షము లేదు. జీవనమున గడింపదగినవి కామము, అర్థము రెండే.

**న హి ఖల్వీశ్వరః కర్తా పరలోక కథా వృథా ।**

కర్తా = అన్నిటిని చేయువాడు, ఈశ్వరః = ప్రభువు, న హి ఖలు = లేనే లేడు, పరలోక కథా = ఇతరలోకము మాట, వృథా = వట్టిది- అర్థము లేనిది.

అన్నిటిని చేయు ఈశ్వరుడు లేనే లేడు. పరలోకము మాట అర్థము లేనిది.



**దేహం వినాస్తి చేదాత్మా కుంభవద్దృశ్యతాం పురః ॥2॥**

**హ్రస్వో దీర్ఘో యువా బాల ఇతి దేహోఽభిదృశ్యతే ।**

ఆత్మా = ఆత్మ, దేహం వినా = దేహము తప్ప వేరుగా, అస్తి చేత్ = ఉన్నచో, కుంభవత్ = కుండవలె, పురః = ఎదుట, దృశ్యతాం= కనబడుగాక; (కానీ) హ్రస్వః = పొట్టివాడు, దీర్ఘః = పొడుగువాడు యువా = యౌవనస్థుడు, బాలః = పిల్లవాడు, ఇతి = అని యిట్లు, దేహః = శరీరమే, అభిదృశ్యతే = కనబడుచున్నది.

ఆత్మ దేహముకంటె వేరుగ నున్నచో కుండవలె ఎదుట కనపడవలె. శరీరమే పొట్టి, పొడగు, యౌవనము గలవాడు, బాలుడు అను రూపాంతరముల కనబడుచున్నది.

**అస్తి జాతః పరిణతో వృద్ధః క్షీణో జరన్మృతః ॥3॥**
**ఇత్యేవముక్తాః షడ్భావవికారా దేహసంశ్రయాః ।**

అస్తి = ఉన్నది, జాతః = పుట్టినది, పరిణతః = పెరిగినది, వృద్ధః = ముదిసినది, జరన్ = సమసినది, క్షీణః = సన్నగిల్లినది, మృతః = చచ్చినది, ఇతి ఏవం = ఇట్లను, షట్ = ఆరు, భావవికారాః= జీవన స్థిత్యంతరములు, దేహ సంశ్రయాః = దేహమును ఆశ్రయించి యున్నవి.

ఉండుట, పుట్టుట, పెరుగుట, ముదియుట, సమయుట, సన్నగిల్లిచచ్చుట అను ఆరు భావ వికారములు దేహమునే ఆశ్రయించి యున్నవి.

**వర్ణాశ్రమ విభాగశ్చ దేహేష్వేవ ప్రతిష్ఠితః ॥4॥**

**జాతకర్మాది సంస్కారో దేహస్యైవ విధీయతే ।**

చ = మఱియు, వర్ణాశ్రమ విభాగః = వర్ణాశ్రమ విభాగము, దేహేషు ఏవ = దేహముల యందే, ప్రతిష్ఠితః = స్థాపితము, జాత కర్మాది సంస్కారః = జాతకర్మ మొదలగు సంస్కారము, దేహస్య ఏవ = దేహమునకే, విధీయతే = విధింపబడుచున్నది.

వర్ణాశ్రమ విభాగము దేహములయందే స్థాపితము. జాతకర్మాది సంస్కారములు విధించినది దేహమునకే.

**శతం జీవేతి దేహస్య ప్రయుంజంత్యాశిషం శుభామ్ ॥5॥**

**ఇతి ప్రపంచం చార్వాకో వంచయత్యల్పచేతనః ।**

శతం = నూరు (ఏండ్లు), జీవ = జీవించు, ఇతి = అను, శుభాం ఆశిషం = శుభాశీస్సును, దేహస్య = దేహమునకే, ప్రయుంజంతి= ప్రయోగించుచున్నారు, ఇతి = అని, అల్పచేతనః = స్వల్పజ్ఞానము గల, చార్వాకః = చార్వాకుడు, ప్రపంచం = ప్రపంచమును, వంచయతి = మోసగించు చున్నాడు.

"నూరేండ్లు జీవించు" అను శుభాశీస్సును దేహమునకే ప్రయోగించుచున్నారు అని స్వల్ప జ్ఞానముగల చార్వాకుడు ప్రపంచమును వంచించుచున్నాడు.

**కేచిచ్ఛ్వసామి జీవామి క్షుధితోఽస్మి పిపాసితః ॥6॥**

**ఇత్యాది ప్రత్యయ బలాత్ ప్రాణమాత్మేతి మన్వతే ।**



కేచిత్ = కొందఱు, శ్వసామి = ఊపిరి పీల్చు చున్నాను, జీవామి= జీవించియున్నాను, క్షుధితః = ఆకలిగొన్నవాడను, పిపాసితః= దప్పిక కల వాడను, అస్మి = అయియున్నాను, ఇత్యాది ప్రత్యయ బలాత్= మొదలగు జ్ఞానాధారమువలన, ప్రాణం = ప్రాణమును, ఆత్మా ఇతి = ఆత్మ యని, మన్వతే = తలంచుచున్నారు.

కొందఱు ఊపిరి పీల్చుచున్నాను, బ్రతికి యున్నాను, ఆకలి – దప్పిక కల్గియున్నాను, ఇత్యాది జ్ఞానాధారములచే ప్రాణమే ఆత్మ యని తలచుచున్నారు.

**కేచిచ్ఛృణోమి పశ్యామి జిఘ్రామ్యాస్వాదయామ్యహమ్ ॥7॥**

**ఇతీంద్రియాణామాత్మత్వం ప్రతియంతి తతోఽధికమ్ ।**

కేచిత్ = కొందఱు, అహం = నేను, శృణోమి = వినుచున్నాను, పశ్యామి = చూచుచున్నాను, ఆస్వాదయామి = రుచి చూచుచున్నాను, ఇతి = అని, తతః అధికం = అంతకంటె హెచ్చుగ, ఇంద్రియాణాం ఆత్మత్వం = ఇంద్రియములకు ఆత్మత్వమును, ప్రతియంతి = తెలియుచున్నారు.

కొందఱు వినుచున్నాను, చూచుచున్నాను, ఆఘ్రాణించు చున్నాను, రుచి చూచుచున్నాను అను జ్ఞానము నాశ్రయించి ఇంద్రియములే ఆత్మ యని ప్రాణాత్మవాదులకంటెను హెచ్చుగా తలచు చున్నారు.

**జానామి ప్రత్యయబలాత్ బుద్ధిరిత్యపరే జగుః ॥8॥**

అపరే = మఱికొందఱు, జానామి ప్రత్యయబలాత్ = ఎఱుగుచున్నానను జ్ఞానాధారము వలన, బుద్ధిః (ఆత్మ) ఇతి = బుద్ధి ఆత్మ అని, జగుః = చెప్పిరి.

మఱికొందఱు "ఎఱుగుచున్నాను" అను జ్ఞాన బలముచే ఆత్మ బుద్ధి యని చెప్పిరి.

**మాయావ్యామూఢ చిత్తానాం తేషాం దూషణ ముచ్యతే ।**

మాయావ్యామూఢచిత్తానాం = మాయచే మోహము నొందిన బుద్ధిగల, తేషాం = వారి (మతముల) దూషణం = ఖండన, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

మాయామోహితులైన వారి మతముల ఖండన చెప్పబడు చున్నది.

**దేహాదీనాం జడార్థానాం పాషాణవదనాత్మనామ్ ॥9॥**

**కథం భవేదహంభావః సమావేశం వినేశితుః ।**

అనాత్మనాం = ఆత్మకంటె వ్యతిరిక్తమైయున్న, పాషాణవత్ = రాతివలె, జడార్థానాం = అచేతన పదార్థములైన, దేహాదీనాం = దేహము మున్నగువానికి, ఈశితుః = ఈశ్వరుని, సమావేశం వినా = సంబంధములేక, అహంభావః = "నేను" అన్న జ్ఞానము, కథం = ఎట్లు, భవేత్ = అగును?

ఆత్మకంటె వ్యతిరిక్తమైయున్న రాతివలె అచేతన వస్తువులైన దేహాదులకు ఈశ్వర సంబంధము లేకయే "నేను" అను జ్ఞాన మెట్లు కలుగును? (కలుగదని భావము.)



**దేహస్తావదయం నాత్మా దృశ్యత్వాచ్చ జడత్వతః ॥19॥**

**రూపాదిమత్త్వాత్సాంశత్వాద్భౌతికత్వాచ్చ కుంభవత్ ।**

దేహఃతావత్ = దేహమైతే, కుంభవత్ = కుండవలె, దృశ్యత్వాత్= కంటికి కనుపించుటవలన, చ = మఱియు, జడత్వతః = అచేతన వస్తువగుట వలన, రూపాదిమత్త్వాత్ = రూపము మొదలగు గుణములను పొందియుండుట వలన, సాంశత్వాత్ = భాగములతో కూడియుండుట వలన, చ = మఱియు, భౌతికత్వాత్ = పంచ భూత నిర్మితమగుట వలనను, ఆత్మా = ఆత్మ, న = కాదు.

దేహము కుండవలె ఇంద్రియ గోచరమగుట చేతను, అచేతన వస్తువు, రూపాది గుణములు కలది, భాగములతో కూడినది, పంచభూత నిర్మితము నగుటచే ఆత్మ కాదు.

**మూర్ఛాసుషుప్తి మరణేష్వపి దేహః ప్రతీయతే ॥11॥**

**దేహాది వ్యతిరిక్తత్వాత్తదాత్మా న ప్రకాశతే ।**

మూర్ఛా సుషుప్తి మరణేషు అపి = మూర్ఛ నిద్ర చావులయందు కూడ, దేహః = దేహము, ప్రతీయతే = కనుపించును, తదా = అపుడు, దేహాదివ్యతిరిక్తత్వాత్ = దేహాదులకంటె వేరై యున్నందున, ఆత్మా = ఆత్మ, న ప్రకాశతే- ప్రకాశించుట లేదు.

మూర్ఛ, నిద్ర, చావులయందు కూడ దేహము కనుపించు చున్నది, ఆ అవస్థలయందు దేహము కంటె వేరుగా నున్నందున ఆత్మ ప్రకాశించుటలేదు.

**యథా జగత్ప్రవృత్తీనామాది కారణ మంశుమాన్ ॥12॥**

**పుమాం స్తథైవ దేహాది ప్రవృత్తౌ కారణం పరమ్ ।**

యథా = ఎట్లు, జగత్ప్రవృత్తీనాం = ప్రపంచములోని పనులకు, అంశుమాన్ = సూర్యుడు, ఆదికారణం = మొదటి కారణమో, తథా ఏవ = అట్లే, దేహాది ప్రవృత్తౌ = దేహాదుల పనియందు, పరం = ముఖ్యమైన, కారణం = కారణము, పుమాన్ = ఆత్మ.

సూర్యుడు ప్రపంచ కార్యములకు ఆదికారణమైనట్లు దేహాదుల ప్రవృత్తికి ఆత్మయే ముఖ్య కారణము.

**మమ దేహోఽయ మిత్యేవం స్త్రీ బాలాంధాశ్చ మన్వతే ॥13॥**

**దేహోఽహమితి నావైతి కదాచిదపి కశ్చన ।**

స్త్రీబాలాంధాః చ = స్త్రీలు, పిల్లలు, గ్రుడ్డివారు కూడ, అయం= ఇది, మమ = నాయొక్క, దేహః = దేహము, ఇతి = అని, మన్వతే = తెలియుచున్నారు, అపి = ఐతే, కశ్చన = ఎవడును, కదాచన = ఎన్నడును అహం = నేను, దేహః = దేహము, ఇతి = అని, న అవైతి= తెలియుట లేదు.

ఇది నా శరీరమని స్త్రీలు బాలురు అంధులును ఎఱుగుచున్నారు. నేనే యీ దేహమను జ్ఞానము ఎవనికిని ఎన్నటికిని కలుగుట లేదు.

**ఇంద్రియాణ్యపి నాత్మానః కరణత్వాత్ప్రదీపవత్ ॥14॥**

ప్రదీపవత్ = దీపమువలె, కరణత్వాత్ = సాధనములై యుండుట వలన, ఇంద్రియాణి అపి = ఇంద్రియములు కూడ, ఆత్మానః న = ఆత్మలు కావు.



దీపమువలె జ్ఞానసాధనములగుటవలన ఇంద్రియములు కూడ ఆత్మ కాదు

**వీణాదివాద్యవచ్ఛ్రోత్రం శబ్దగ్రహణసాధనమ్ ।**

**చక్షు స్తేజస్త్రితయవద్రూపగ్రహణసాధనమ్ ॥15॥**

శ్రోత్రం = చెవి, వీణాదివాద్యవత్ = వీణాది వాద్యములవలె, శబ్దగ్రహణ సాధనం = శబ్దమును గ్రహించు సాధనము, చక్షుః = కన్ను, తేజస్త్రితయవత్ = సూర్య చంద్రాగ్నులను మూడు వెలుగులవలె, రూపగ్రహణసాధనం = రూపమును గ్రహించు సాధనము.

చెవి వీణాది వాద్యములవలె శబ్ద గ్రహణ సాధనము. కన్ను సూర్యచంద్రాగ్నుల తేజస్సు వలె రూపగ్రహణ సాధనము.

**గంధస్య గ్రాహకం ఘ్రాణం పుష్ప సంపుటకాదివత్ ।**

**రసస్య గ్రాహికా జిహ్వా దధిక్షౌద్ర ఘృతాదివత్ ॥16॥**

ఘ్రాణం = ముక్కు, పుష్పసంపుటకాదివత్ = పుష్పసంపుటాదుల వలె, గంధస్య గ్రాహకం = గంధమును గ్రహించు సాధనము, జిహ్వా = నాలుక, దధిక్షౌద్ర ఘృతాదివత్ = పెరుగు తేనె నెయ్యి మున్నగు వానివలె, రసస్య గ్రాహికా = రసమును గ్రహించు సాధనము.

ముక్కు పుష్పసంపుటాదులవలె గంధ గ్రాహక సాధనము. నాలుక పెరుగు తేనె ఘృతాదులవలె రసగ్రాహక సాధనము.

**ఇంద్రియాణి న మే సంతి మూకోఽంధో బధిరోఽస్మ్యహమ్ ।**

**ఇత్యాహురింద్రియైర్హీనా జనాః కిం తే నిరాత్మకాః ॥17॥**

ఇంద్రియైః హీనాః = ఇంద్రియములు లేని, జనాః = మనుష్యులు, మే = నాకు, ఇంద్రియాణి = ఇంద్రియములు, న సంతి= లేవు, అహం = నేను, మూకః = మూగవాడిని, అంధః = గ్రుడ్డివాడిని, బధిరః = చెవిటివాడిని, అస్మి = అయియున్నాను, ఇతి = అని, ఆహుః= చెప్పుచున్నారు. తే = వారు, నిరాత్మకాః = ఆత్మ లేనివారా ఏమి?

ఇంద్రియములు లేని జనులు "నాకు ఇంద్రియములు లేవు. నేను మూగ, గ్రుడ్డి, చెవిటి" అని చెప్పుచున్నారు. అట్టివారు ఆత్మ లేనివారా?

**ప్రాణోఽప్యాత్మా న భవతి జ్ఞానాభావాత్సుషుప్తిషు ।**
**జాగ్రత్స్వప్నోపభోగోత్థ శ్రమవిచ్ఛిత్తిహేతవే ॥18॥**

**సుషుప్తిం పురుషే ప్రాప్తే శరీరమభిరక్షితుమ్ ।**
**శేషకర్మోపభోగార్థం ప్రాణశ్చరతి కేవలమ్ ॥19॥**

సుషుప్తిషు = నిద్రల్లో, జ్ఞానాభావాత్ = తెలివి లేనందున, ప్రాణః అపి = ప్రాణముకూడ, ఆత్మా న భవతి = ఆత్మకాదు, పురుషః= మనుష్యుడు, జాగ్రత్స్వప్నోపభోగోత్థశ్రమవిచ్ఛిత్తి హేతవే = 'జాగ్రత్ స్వప్నానుభవములచే కలిగిన శ్రమచే విశ్రాంతిని పొందుటకై, సుషుప్తిం= నిద్రను, ప్రాప్తే = పొందగా, శేషకర్మోపభోగార్థం = మిగిలిన కర్మఫలానుభవము కొఱకు, శరీరం = దేహమును, కేవలం అభిరక్షితుం= కాపాడుటకు మాత్రము, ప్రాణః = ప్రాణము, చరతి = సంచరించుచున్నది.



నిద్రలో తెలివిలేనందున ప్రాణము కూడ ఆత్మకాదు. జాగ్రత్ స్వప్నానుభవములచే కలిగిన శ్రమచే విశ్రాంతిని పొందుటకై మానవుడు నిద్రించియుండ శేషకర్మ ఫలానుభవమునకై శరీరమును రక్షించుటకు మాత్రము ప్రాణము సంచరించుచున్నది.

**ప్రాణస్య తత్రా చైతన్యం కరణోపరమే యది ।**
**ప్రాణే వ్యాప్రియమాణే తు కరణోపరతిః కథమ్ ॥20॥**

**సామ్రాజి హి రణోద్యుక్తే విరమంతి న సైనికాః ।**
**తస్మాన్నకరణస్వామీ ప్రాణో భవితుమర్హతి ॥21॥**

తత్ర = అచట (నిద్రలో) ప్రాణస్య = ప్రాణము యొక్క అచైతన్యం = తెలివి లేకుండుట, కరణోపరమే యది = ఇంద్రియ వ్యాపారము లేకపోవుటచే అయిన - అనిన, ప్రాణే = ప్రాణము, వ్యాప్రియమాణే = పనిచేయుచున్నపుడు, ఇంద్రియోపరతిః = ఇంద్రియములు పని చేయకుండుట, కథం = ఎట్లు? సామ్రాజి = రాజు, రణోద్యుక్తే = యుద్ధము చేయుచుండ, సైనికాః = సైనికులు, న విరమంతి హి = ఊరక ఉండరుకదా, తస్మాత్ = అందువలన, ప్రాణః = ప్రాణము, కరణస్వామీ = ఇంద్రియాధిపతి, భవితుం = అగుటకు, న అర్హతి = యోగ్యము కాదు.

సుషుప్తిలో ప్రాణముయొక్క తెలివి లేకుండుటకు కారణము ఇంద్రియముల వ్యాపారము లేకుండుట అని చెప్పినచో ప్రాణము పనిచేయుచుండ ఇంద్రియములు పనినెట్లు నిలువగలవు? రాజు యుద్ధము చేయుచుండ సైనికులు యుద్ధమును విడిచి ఊరక

ఉండరుకదా! కాబట్టి ప్రాణము ఇంద్రియముల ప్రభువు అని తలచుట యోగ్యము కాదు.

**మనసః ప్రేరకే వుంసి విరతే విరమంత్యతః ।**
**కరణాని సమస్తాని తేషాం స్వామీ తతః పుమాన్ ॥22॥**

మనసః = మనస్సు యొక్క, ప్రేరకే = ప్రేరకుడైన, పుంసి = ఆత్మ, విరతే = పనిని నిలుపగ, అతః = అపుడు, సమస్తాని కరణాని = ఎల్ల ఇంద్రియములు, విరమంతి = పనిని నిలుపును. తతః = అందువలన, తేషాం స్వామీ = ఆ ఇంద్రియముల ప్రభువు, పుమాన్ = ఆత్మ.

మనస్సును ప్రేరేపించు ఆత్మ పనిని నిలిపినపుడు ఇంద్రియములన్నియు తమ పనిని నిలుపుచున్నవి. కావున ఆత్మయే ఇంద్రియాధిపతి.

**బుద్ధిస్తు క్షణికా వేద్యా గమనాగమనాన్వితా ।**
**ఆత్మనః ప్రతిబింబేన భాసితా భాసయేజ్జగత్ ॥23॥**

బుద్ధిః తు = బుద్ధి ఐతే, గమనాగమనాన్వితా = రాకపోకలు గలది, క్షణికా = క్షణకాలముండునని, వేద్యా = తెలియదగినది, ఆత్మనః ప్రతిబింబేన = ఆత్మయొక్క ప్రతిబింబముచే, భాసితా = ప్రకాశమును పొంది, జగత్ = ప్రపంచమును, భాసయేత్ = ప్రకాశింపజేయును.

బుద్ధియో రాకపోకలు గలది. క్షణకాలముండునది. అది ఆత్మ ప్రతిఫలముచే భాసించి జగత్తును భాసింప జేయును.



**ఆత్మన్యుత్పద్యతే బుద్ధిరాత్మన్యేవ ప్రలీయతే ।**
**ప్రాగూర్ధ్వం చాసతీ బుద్ధిః స్వయమేవ న సిద్ధ్యతి ॥24॥**

బుద్ధిః = బుద్ధి, ఆత్మని = ఆత్మయందు, ఉత్పద్యతే = పుట్టుచున్నది, ఆత్మని ఏవ = ఆత్మయందే, ప్రలీయతే = లయమును పొందుచున్నది, ప్రాక్ = (పుట్టుటకు) ముందు, చ = మఱియు, ఊర్ధ్వం = (లయమైన) తర్వాతను, అసతీ = లేకుండు, బుద్ధిః = బుద్ధి, స్వయం ఏవ = తానుగనే (ఉన్నదని),న సిద్ధ్యతి = సిద్ధింపజాలదు.

బుద్ధి ఆత్మయందు పుట్టి ఆత్మయందే లయమగుచున్నది. పుట్టుటకు ముందు లయమైన తర్వాత లేనిబుద్ధి స్వయముగానే ఉన్నదని సిద్ధింపజాలదు.

**జ్ఞానాచ్చేత్పూర్వ పూర్వస్మాదుత్తరోత్తర సంభవః ।**
**యుగవద్బహుబుద్ధిత్వం ప్రసజ్యేత క్షణే క్షణే ॥25॥**

పూర్వపూర్వస్మాత్ = మొదటి మొదటి, జ్ఞానాత్ = జ్ఞానముకంటె, ఉత్తరోత్తర సంభవః = తర్వాతి తర్వాతి జ్ఞానము పుట్టుట, చేత్ = ఐనచో, క్షణే క్షణే = ప్రతిక్షణము, యుగపత్ = ఏక కాలమున, బహు బుద్ధిత్వం = అనేక బుద్ధులను కల్గియుండుట, ప్రసజ్యేత = కలుగును.

పూర్వపూర్వ జ్ఞానమునకంటె ఉత్తరోత్తర జ్ఞానము పరంపరగ పుట్టినచో ప్రతిక్షణము ఏక కాలమున అనేక బుద్ధులను కల్గియుండుట సంభవించును.

**బుద్ధ్యంతరం న జనయేన్నాశోత్తర మసత్త్వతః ।**

(మొదటి జ్ఞానము) నాశోత్తరం = నశించిన తరువాత, అసత్త్వతః= లేకుండ ఉండుటవలన, బుద్ధ్యంతరం = (ఆ తర్వాతి) వేరు జ్ఞానమును, న జనయేత్ = కలిగింప జాలదు.

పూర్వజ్ఞానము నశించిన పిదప తానే లేకుండ పోవుటవలన ఆ తర్వాతి జ్ఞానాంతరమును కలిగింప జాలదు.

**ఏషాం సంఘాత ఆత్మా చేదేకదేశే పృథక్కృతే ॥26॥**

**న చైతన్యం ప్రసజ్యేత సంఘాతా భావత స్తదా ।**

ఏషాం = ఈ, దేహేంద్రియ ప్రాణ మనస్సుల, సంఘాతః = సమూహము, ఆత్మాచేత్ = ఆత్మ ఐనచో, ఏకదేశే =ఏదేని ఒక భాగము, పృథక్కృతే = వేరుచేయబడగ, తదా = అపుడు, సంఘాతాభావః = సమూహము లేకుండుటవలన, చైతన్యం = తెలివిని పొందియుండుట, న ప్రసజ్యేత = లేనట్లు కావలెను.

దేహేంద్రియ ప్రాణమనస్సుల సమూహము ఆత్మ యని చెప్పినచో దీనియందు ఏదేని ఒకటి వేరైనపుడు సమూహము లేనందున తెలివిని పొందియుండుట లేనట్లు కావలెను.

**భిన్నదృగ్గత్యభిప్రాయే బహుచేతనపుంజితమ్ ॥27॥**

**సద్యో భిన్నం భవేదేతన్నిష్క్రియం నా భవిష్యతి ।**

బహుచేతనపుంజితం = అనేక చేతనములతో కూడి (ఆత్మయని చెప్పిన) భిన్నదృగ్గత్యభిప్రాయే = (ఈవేర్వేరు చేతనముల) దృష్టి గమనము వేర్వేరుచోట్ల ఉండుటవలన, ఏతత్ = ఇది (ఇట్టిఆత్మ) సద్యః = ఇప్పుడే, భిన్నం = పగిలిపోయినది, భవేత్ = అగును, వా = లేదా, నిష్క్రియం= ఏ పనియు లేకుండ, భవిష్యతి = కాగలదు.



ఆత్మ అనేక చేతనములతో కూడినది అని చెప్పిన, ఆ వేర్వేరు చైతన్యముల దృష్టి గమనము వేర్వేరుచోట్ల ఉండుటచే అట్టి ఆత్మ తక్షణమే పగిలిపోవునది అథవా ఏ పనియు లేనిది యగును.

**దేహస్యాంతర్గతోఽప్యాత్మా వ్యాప్త ఏవేతి బుధ్యతే ॥28॥**

**అణుప్రమాణశ్చేదేష వ్యాప్నుయన్నాఖిలం వపుః ।**

ఆత్మా = ఆత్మ, దేహస్య అంతర్గతః అపి = దేహము లోపలనున్న వాడైనను, వ్యాప్తః ఏవ = సర్వవ్యాపియే, ఇతి = అని, బుధ్యతే = తెలియబడును, ఏషః = ఇతడు, అణుప్రమాణః చేత్ = అణుప్రమాణము గలవాడయిన, అఖిలం దేహం = సంపూర్ణ దేహమును, న వ్యాప్నుయాత్ = వ్యాపించిలేడు.

ఆత్మ దేహములోపల నున్నను సర్వవ్యాపి యనియే తెలియవలెను. ఇతడు అణువు కొలత గలవాడయిన శరీరమంతటిని వ్యాపింపజాలడు.

**దేహప్రమాణశ్చేన్న స్యాద్బాలస్య స్థవిరాదితా ॥29॥**

**దేహవత్పరిణామీ చేత్తద్వదేవ వినంక్ష్యతి ।**

దేహప్రమాణఃచేత్ = దేహము కొలతగల వాడయినచో, బాలస్య= బాలుడుగ నున్న వానికి, స్థవిరాదితా = వృద్ధుడగుట మున్నగునది, న స్యాత్ = కాజాలదు, దేహవత్ = దేహమువలె, పరిణామీ చేత్ = పెరుగుట మున్నగు రూపాంతరములను పొందువాడయినచో, తద్వత్ ఏవ = దానివలెనే, వినంక్ష్యతి = నాశము నొందగలడు.

ఆత్మ దేహము కొలతగలవాడు అనిన బాలుడుగ నున్నవాడే పెరిగి వృద్ధుడగుట కాజాలదు, దేహమువలె ఆత్మకును పెరుగుట మున్నగు రూపాంతరములు ఉన్నవనిన దానివలె వానికిని నాశము కలుగును.

**కర్మణాం పరిణామేన క్రిమిహస్త్యాది మూర్తిషు ॥30॥**

**వ్యాప్తత్వాత్ప్రవిశత్యాత్మా ఘటాదిష్వంతరిక్షవత్ ।**

కర్మణాం పరిణామేన = కర్మల పరిపాకముచే, ఆత్మా = ఆత్మ, క్రిమిహస్త్యాదిమూర్తిషు = పురుగు ఏనుగు మున్నగు దేహములయందు, వ్యాప్తత్వాత్ = సర్వవ్యాపియై యుండియే, ఘటాదిషు = కుండ మున్నగువానియందు, అంతరిక్షవత్ = ఆకాశమువలె, ప్రవిశతి = ప్రవేశించుచున్నాడు.

కర్మపరిపాకముచే ఆత్మ పురుగు, ఏనుగు మున్నగు దేహములయందు కుండ మున్నగు వానియందు సర్వవ్యాపియై యుండియే ప్రవేశించుచున్నాడు.

**పరమాణు ప్రమాణేఽపి మనసి ప్రతిభాసతే ॥31॥**

**స్వప్నే చరాచరం విశ్వమాత్మన్యేవ ప్రతిష్ఠితమ్ ।**

పరమాణు ప్రమాణే = పరమాణు ప్రమాణము గల, మనసి అపి = మనస్సులోను, ప్రతిభాసతే = ప్రకాశించుచున్నాడు, స్వప్నే = కలలో, చరాచరం విశ్వం = చరాచర ప్రపంచము, ఆత్మని ఏవ = ఆత్మయందే, ప్రతిష్ఠితం = ఉండును.



పరమాణు ప్రమాణమైన మనస్సులోను ఆత్మ ప్రకాశించుచున్నాడు. కలలో చరాచరప్రపంచ మంతయు ఆత్మయందే ఉండును.

**దేహాదిష్వ హమిత్యేవం భ్రమః సంసార హేతుకః ॥32॥**

**అంతఃప్రవిష్టః శాస్తేతి మోక్షాయోపాదిశచ్ఛ్రుతిః ।**

దేహాదిషు = శరీరాదుల యందు, అహం = నేను, ఇతి ఏవం = అనెడి, భ్రమః = భ్రాంతి, సంసారహేతుకః = సంసారమునకు కారణము. శాస్తా = ఈశ్వరుడు, అంతః = లోపల, ప్రవిష్టః ఇతి = ప్రవేశించి యున్నాడని, మోక్షాయ = మోక్షము కొఱకు, శ్రుతిః = వేదము, ఉపాదిశత్ = ఉపదేశించినది.

శరీరాది విషయములందు 'నేను' అను జ్ఞానము సంసార హేతువు. ఈశ్వరుడు లోపల ప్రవేశించియున్నాడనెడి జ్ఞానము మోక్షహేతువు అని వేదము ఉపదేశించినది.

**ఏవమేషా మహామాయా వాదినామపి మోహినీ ॥33॥**

**యస్మాత్సాక్షాత్కృతే సద్యో లీయతే చ సదాశివే ।**

ఏవం = ఇట్లు, ఏషా మహామాయా = ఈ మహామాయ, వాదినాం అపి = వాదము చేయువారికి కూడ, మోహినీ = మోహమును కలిగించును, యస్మాత్ = ఎందువలనన, సదాశివే = సదాశివ (పరబ్రహ్మ) తత్త్వము, సాక్షాత్కృతే = ప్రత్యక్షము చేసికొనగ, సద్యః = వెంటనే, లీయతే = లయమగుచున్నది.

సదాశివ పరబ్రహ్మ తత్త్వమును ప్రత్యక్షము చేసికొన్నంత మాత్రముననే అపుడే లయమగునట్టి ఈ మహామాయ వాదము చేయు వారికి కూడ భ్రాంతిని కలుగజేయును.

**దేహేంద్రియాసుహీనాయ మానదూర స్వరూపిణే ॥34॥**
**జ్ఞానానందస్వరూపాయ దక్షిణామూర్తయే నమః ।**

దేహేంద్రియాసుహీనాయ = శరీరేంద్రియ ప్రాణములు లేని, మానదూరస్వరూపిణే = కొలతకు చిక్కని స్వరూపము గల, జ్ఞానానంద స్వరూపాయ = జ్ఞానానంద స్వరూపుడగు, దక్షిణామూర్తయే = దక్షిణామూర్తికి, నమః = నమస్కారము.

దేహేంద్రియ ప్రాణములు లేని, ప్రమాణములకు అందని స్వరూపము గల జ్ఞానానంద స్వరూపుడగు శ్రీదక్షిణామూర్తికి వందనము.

**ఇతి శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకే ।**
**ప్రబంధే మానసోల్లాసే పంచమోల్లాస సంగ్రహః ॥35॥**

ఇతి = ఇట్లు, శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకే = శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థమును వివరించు, మానసోల్లాసే = మానసోల్లాసమను, ప్రబంధే = కృతి యందు, పంచమోల్లాస సంగ్రహః= సంక్షేపమగు ఐదవ ఉల్లాసము.

ఇట్లు శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థమును వివరించు మానసోల్లాసమను కృతి యందు సంక్షిప్తమగు పంచమోల్లాసము.

హరిః ఓం తత్సత్

## షష్ఠోల్లాసః

**రాహుగ్రస్త దివాకరేందు సదృశో మాయా సమాచ్ఛాదనాత్**
**సన్మాత్రః కరణోపసంహరణతో యోఽభూత్సుషుప్తః పుమాన్।**
**ప్రాగస్వాప్సమితి ప్రబోధసమయే యః ప్రత్యభిజ్ఞాయతే**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥**

యః = ఏ, పుమాన్ = ఆత్మ, కరణోపసంహరణతః = ఇంద్రియముల ఉపసంహారము చేయుటచే, సుషుప్తః = నిద్రయందున్నవాడై, మాయయా సమాచ్ఛాదనాత్ = మాయచే మూయబడుటవలన, రాహుగ్రస్త దివాకరేందుసదృశః = రాహువుచే మ్రింగబడిన సూర్య చంద్రులవలె, సన్మాత్రః = ఉనికి మాత్రమే, అభూత్= అయియుండెనో, యః = ఎవడు, ప్రబోధ సమయే = మేలుకొన్నపుడు, ప్రాక్ = పూర్వము, అస్వాప్సం = నిద్రించియుంటిని, ఇతి = అని, ప్రత్యభిజ్ఞాయతే = గుర్తింపబడుచున్నాడో, తస్మై = అట్టి, శ్రీగురుమూర్తయే – శ్రీగురుస్వరూపుడగు, శ్రీదక్షిణామూర్తికి, ఇదం = ఈ, నమః = నమస్కారము.

ఏ ఆత్మ ఇంద్రియోపసంహారముచే సుషుప్తి యందు మాయచే కప్పబడుటవలన గ్రహణము పట్టిన సూర్యచంద్రులవలె ఉనికి మాత్రము కలిగి, మేల్కొన్నప్పుడు నేను పూర్వం నిద్రించియుంటిని. (పూర్వం నిద్రించినవాడు నేను) అని (తన్ను తానే) గుర్తించునో ఆ శ్రీ గురుస్వరూపుడైన శ్రీదక్షిణామూర్తికి వందనము.

**స్వప్నే విశ్వం యథాంతస్థం జాగ్రత్యపి తథేతి చేత్ ।**
**సుషుప్తౌ కస్య కిం భాతి కస్థాయీ తత్ర చేతనః ॥1॥**

యథా = ఎట్లు, స్వప్నే = కలయందు (కనిన) విశ్వం = జగత్తు, అంతస్థం = ఆత్మ లోపల నుండునో, జాగ్రతి అపి = మేల్కొనినపుడును, తథా = అట్లె, ఇతిచేత్ = అనిన, సుషుప్తౌ = నిద్రయందు, కస్య = ఎవనికి, కిం = ఏది, భాతి = ప్రకాశించుచున్నది, తత్ర = ఆ అవస్థయందు, స్థాయీ = స్థిరమైన, చేతనః = జ్ఞానాధారుడు, కః = ఎవడు?

కలలో కనిన జగత్తు ఎట్లు ఆత్మయందే ఉండునో, మేలుకొనినపుడును అట్లే అనినచో నిద్రయందు ఎవనికి ఏది ప్రకాశించును? ఆ అవస్థయందును శాశ్వతముగా నుండు జీవుడు ఎవడు?

**సర్వం చ క్షణికం శూన్యం సర్వమేవ స్వలక్షణమ్ ।**
**సంఘాతః పరమాణూనాం మహ్యంబ్వగ్నిసమీరణాః ॥2॥**

చ = మఱియు, సర్వం = అంతయు, క్షణికం = క్షణమాత్ర ముండునది, శూన్యం = శూన్యమైనది, సర్వం ఏవ = అంతయును, స్వలక్షణం = తనచే తానే తెలిసికొనబడునది, మహ్యం బ్వగ్నిసమీరణాః= పృథివ్యప్తేజోవాయువులు, పరమాణూనాం = పరమాణువుల, సంఘాతః = సమూహము.

సర్వము క్షణికము. ఆ క్షణమునకు ముందు, తరువాతను శూన్యమైనది. అంతయు తనచే తానే తెలియదగినది. విషయము వేరు.



వానిని గుర్తించు తెలివి వేరు అనునది లేదు. భూమి, జలము, అగ్ని, వాయువు పరమాణువుల కలయికయే.

**మనుష్యాది శరీరాణి స్కంధపంచక సంహతిః ।**
**స్కంధాశ్చ రూపవిజ్ఞాన సంజ్ఞా సంస్కారవేదనాః ॥3॥**

మనుష్యాది శరీరాణి = మానవాది దేహములు, స్కంధ పంచక సంహతిః = ఐదు సచేతనావస్థల సమూహము. స్కంధాః చ =స్కంధములు, రూపవిజ్ఞాన సంజ్ఞా సంస్కారవేదనాః = రూపవిజ్ఞాన సంజ్ఞా సంస్కార వేదనలు.

మనుష్యాది శరీరములు పంచస్కంధముల గుంపు. రూపస్కంధము, విజ్ఞానస్కంధము, సంజ్ఞాస్కంధము, సంస్కారస్కంధము, వేదనాస్కంధము అని ఐదు స్కంధములు.

**రూప్యంత ఇతి రూపాణి విషయాశ్చేంద్రియాణ్యపి ।**
**విషయేంద్రియయోర్జ్ఞానం విజ్ఞానం స్కంధ ఉచ్యతే ॥4॥**

విషయాః = విషయములు, చ = మఱియు, ఇంద్రియాణి అపి= ఇంద్రియములును, రూప్యంతే = గోచరమగుచున్నవి, ఇతి = అనునది, రూపాణి = రూపస్కంధము, విషయేంద్రియయోః = విషయముల, ఇంద్రియముల, జ్ఞానం = జ్ఞానము, విజ్ఞానస్కంధః = విజ్ఞానస్కంధము అని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

మనస్సున గోచరించు విషయములయొక్కయు, వానిని గ్రహించు ఇంద్రియములయొక్కయు సమూహము రూపస్కంధము. ఈ విషయేంద్రియముల జ్ఞానము విజ్ఞానస్కంధము.

**సంజ్ఞాగుణక్రియాజాతి విశిష్ట ప్రత్యయాత్మికా ।**
**పంచధా కల్పితా ప్రోక్తా సంజ్ఞాస్కంధశ్చ సౌగతైః ॥5॥**

**గవాం గౌరితి సంజ్ఞోక్తా జాతిర్గోత్వం తు గోగతమ్ ।**
**గుణాః శుక్లాదయస్తస్య గచ్ఛత్యాద్యాస్తథా క్రియాః ॥6॥**

**శృంగీ చతుష్పాల్లాంగూలీ విశిష్ట ప్రత్యయో హ్యసౌ ।**
**ఏవం పంచవిధః క్లుప్తః సంజ్ఞా స్కంధ ఇతీర్యతే ॥7॥**

సౌగతైః = బౌద్ధులచే, సంజ్ఞాస్కంధః = సంజ్ఞాస్కంధము, సంజ్ఞాగుణ క్రియాజాతి విశిష్ట ప్రత్యయాత్మికా = పేరు, గుణము, కర్మ, జాతి లేదా సామాన్యము, విశేషణము వీనితో కూడియున్న జ్ఞానమను, పంచధా = ఐదు విధములుగా, కల్పితా = చేయబడినది, అని, ప్రోక్తా= చెప్పబడినది, గవాం = గోవులకు, గౌః = గోవు, ఇతి = అని, సంజ్ఞా= పేరు, ఉక్తా = చెప్పబడినది. గోగతం = గోవులలోని, గోత్వం = గోవుగా నుండుట యనునది, జాతిః = జాతి, తస్య = దానియొక్క శు క్లాదయః = తెలుపు మున్నగునవి, గుణాః = గుణములు, తథా = అట్లె, గచ్ఛత్యాద్యాః = పోవుచున్నది మున్నగునవి, క్రియాః = కర్మలు, శృంగీ = కొమ్ముగలది, చతుష్పాత్ = నాల్గు కాళ్లుగలది, లాంగూలీ = తోకగలది, అసౌ = అది, అను (ఒక్కొక్క) విశిష్ట ప్రత్యయ = విశేషణముతో కూడియుండునను జ్ఞానము, ఏవం = ఇట్లు, సంజ్ఞాస్కంధః = సంజ్ఞాస్కంధము, పంచవిధః = ఐదువిధములుగ, క్లుప్తః = ఐనది, ఇతి= అని, ఈర్యతే = చెప్పడుచున్నది.



బౌద్ధుల మతమున సంజ్ఞాస్కంధము - పేరు, గుణము, జాతి, కర్మ, విశేషణముతో కూడియున్న జ్ఞానమని ఐదు విధములు. గోవులకు గోవు అను పేరు. అన్ని గోవులకు సామాన్యమైన గోవుగా నుండుట అనునది జాతి. తెలుపు మున్నగునవి గుణములు. పోవుచున్నది మున్నగునవి కర్మలు. కొమ్ము కలది, నాల్గు కాళ్లు గలది, తోక కలది మొదలగు ఒక్కొక్క విశేషణముతో కూడియున్న దాని జ్ఞానము. ఇట్లు సంజ్ఞాస్కంధము అయిదు విధములని చెప్పుచున్నారు.

**రాగాద్యాః పుణ్యపాపే చ సంస్కారస్కంధ ఉచ్యతే ।**
**సుఖం దుఃఖం చ మోక్షశ్చ స్కంధః స్యాద్వేదనాహ్వయః ॥8॥**

రాగాద్యాః = రాగము మున్నగునవి, చ = మఱియు, పుణ్యపాపే= పుణ్యపాపములు, సంస్కారస్కన్ధః = సంస్కారస్కంధము అని,ఉచ్యతే = చెప్పబడుచున్నది. సుఖం = సుఖము, చ = మఱియు, మోక్షః = మోక్షము, వేదనాహ్వయః = వేదన (జ్ఞానము) అను, స్కంధః= స్కంధము, స్యాత్ = అగును.

రాగాదులు పుణ్యపాపములు సంస్కారస్కంధము. సుఖదుఃఖ మోక్షములు వేదనాస్కంధము.

**పంచభ్య ఏవ స్కంధేభ్యో నాన్య ఆత్మాస్తి కశ్చన ।**
**న కశ్చిదీశ్వరః కర్తా స్వగతాతిశయం జగత్ ॥9॥**

పంచభ్యః స్కంధేభ్యః = ఈ ఐదుస్కంధముల కంటె, అన్యః = ఇతరమైన, ఆత్మా = ఆత్మ, కశ్చన =ఎవడును, న అస్తి ఏవ = లేనేలేదు. ఈశ్వరః = ప్రభువైన, కర్తా = సృష్ట్యాదులను చేయువాడు, కశ్చిత్ =

ఎవడును, న = లేదు. జగత్ = ప్రపంచము, స్వగతాతిశయం = ఉత్కృష్టతను తనలోనే కలిగియున్నది. అనగా జగత్తుకంటె భిన్నమై దానికంటె ఉత్కృష్టమైన దాని సృష్టిని నియమనమును చేయు వేరే ఏతత్త్వమును లేదు. జగత్తు తననుండి తానే సృష్టియగుచున్నది.

ఈ ఐదు స్కంధములకంటె వేరైన ఆత్మ అనునది ఏదియు లేనేలేదు. సృష్ట్యాదుల నొనర్చు ప్రభువును లేదు. జగత్తు తననుండి తానే అయినది.

**స్కంధేభ్యః పరమాణుభ్యః క్షణికేభ్యోఽభిజాయతే ।**
**పూర్వపూర్వక్షణాదేవ క్షణః స్యాదుత్తరోత్తరః ॥10॥**

(జగత్తు) క్షణికేభ్యః = క్షణమాత్రముండు, స్కంధేభ్యః = స్కంధముల నుండియు, పరమాణుభ్యః = పరమాణువుల నుండియు, అభిజాయతే = కలుగుచున్నది. పూర్వపూర్వక్షణాత్ ఏవ = మొదటి మొదటిక్షణ(ములో కనుపించు ప్రపంచము)ము నుండియే, ఉత్తరోత్తరః= తరువాతి తరువాతి, క్షణః = క్షణ(ములో కనుపించు ప్రపంచ)ము, స్యాత్ = అగును.

ఈ జగత్తు క్షణకాలమాత్రముండు పంచస్కంధముల నుండియు, పరమాణువులనుండియు అగుచున్నది. పూర్వపూర్వక్షణమున కనుపించు ప్రపంచమునుండియే ఉత్తరోత్తరక్షణమున కనుపించు ప్రపంచమగుచున్నది. అనగా పూర్వక్షణమున ఉండి నశించిన పంచస్కంధభూతచతుష్టయ పరమాణువుల నుండి కలిగిన ప్రపంచమే ఉత్తరక్షణమున కనుపించు ప్రపంచమునకు కారణము.



**పూర్వస్మాదేవ హి జ్ఞానాజ్జాయతే జ్ఞానముత్తరమ్ ।**
**స ఏవాయమితి జ్ఞానం సేయం జ్వాలేవ విభ్రమః ॥11॥**

పూర్వస్మాత్ జ్ఞానాత్ ఏవ హి = మొదటి జ్ఞానము నుండియే, ఉత్తరం జ్ఞానం = తరువాతి జ్ఞానము, జాయతే = కల్గుచున్నది. అయం= ఇతడు, సః ఏవ = అతడే, ఇతి = అను, జ్ఞానం = జ్ఞానము, ఇయం= ఈ, జ్వాలా = మంట, సా = అదియే, ఇవ = అన్నట్టి జ్ఞానమువలె, విభ్రమః = భ్రాంతి.

పూర్వజ్ఞానము నుండి ఉత్తర జ్ఞానము కలుగుచున్నది. ఇతడు అతడే అను జ్ఞానము ఈమంట అదియే అను జ్ఞానమువలె భ్రాంతి.

**అస్తి భాతీతి ధీభ్రాంతైరాత్మానాత్మసు కల్ప్యతే ।**
**హానోపాదానరాహిత్యాదాకాశః కిం ప్రకాశతే ॥12॥**

అస్తి = ఉన్నది, భాతి = ప్రకాశించుచున్నది, ఇతి = అను, ధీభ్రాంతైః = బుద్ధి భ్రమ గలవారిచే, అనాత్మసు = ఆత్మకాని వస్తువుల యందు, ఆత్మా = ఆత్మ ఉండుట, కల్ప్యతే = కల్పితమైనది, హానోపాదానరాహిత్యాత్ = విడుచుట తీసికొనుట లేనందువలన, ఆకాశః= ఆకాశము, ప్రకాశతే కిం = ప్రకాశించునా?

ఉన్నది, ప్రకాశించుచున్నది అను బుద్ధినుండి మోహమును పొందినవారిచే ఆత్మ కాని వస్తువుల యందు ఆత్మయొక్క ఉనికి కల్పితము. విడుచుట గ్రహించుట అను ఏ ప్రయోజనమూ లేనందున ఆకాశము ప్రకాశించునా? గోచరించునా?

**ఇత్యేవం బౌద్ధసిద్ధాంతీ భాషమాణో నిషిద్ధ్యతే ।**
**శూన్యం చేజ్జగతో హేతుః జగదేవ న సిద్ధ్యతి ॥13॥**

ఇతి = అని, ఏవం = ఈ విధముగ, భాషమాణః = పలుకుచున్న, బౌద్ధసిద్ధాంతీ = బౌద్ధ సిద్ధాంతి, నిషిద్ధ్యతే = నిషేధింపబడుచున్నాడు. జగతః = ప్రపంచముయొక్క, హేతుః = కారణము, శూన్యం చేత్ = శూన్యమైనచో, జగత్ ఏవ = జగత్తే, న సిద్ధ్యతి = సిద్ధించదు.

అని ఇట్లు చెప్పుచున్న బౌద్ధసిద్ధాంతము నిరాకరింపబడుచున్నది – జగత్తుయొక్క కారణము శూన్యమైనచో జగత్తే సిద్ధించదు. జగత్తు యొక్క ఉనికినే సాధింప వీలుకాదు.

**ఘటః శూన్యః పటః శూన్య ఇతి కైః ప్రతిపాద్యతే ।**
**నైవ భాసేత శూన్యం చేజ్జగన్నరవిషాణవత్ ॥14॥**

ఘటః = ఘటము, శూన్యః = శూన్యము, పటః = పటము (వస్త్రము), శూన్యః = శూన్యము, ఇతి = అని, కైః = ఎవరిచే, ప్రతిపాద్యతే= చెప్పబడుచున్నది? జగత్ = ప్రపంచము, శూన్యం చేత్ = శూన్యమై యున్నచో, నరవిషాణవత్ =మనుష్యుని కొమ్మువలె, న భాసేత ఏవ = కనుపించకనే యుండవలె.

ఘటము శూన్యము, పటము శూన్యము అని ఎవరు చెప్పుచున్నారు? జగత్తు శూన్యమై యున్నచో మనుష్యుని కొమ్మువలె సదా కనబడకుండానే యుండవలసి వచ్చును.

**వస్త్వర్థీ కిముపాదద్యా ద్భారార్తః కిం పరిత్యజేత్ ।**
**కో విదధ్యాన్నిషిద్ధ్యేద్వా శూన్యత్వాత్స్వస్య చాత్మనః ॥15॥**



వస్త్వర్థీ = వస్తువును కోరువాడు, కిం = దేనిని, ఉపాదద్యాత్ = తీసికొనును? భారార్తః = బరువుచే బాధపడువాడు. కిం = దేనిని, పరిత్యజేత్ = వదలిపెట్టును? స్వస్య = తన, ఆత్మనః = ఆత్మయొక్క, శూన్యత్వాత్ = శూన్యత (లేకుండుట) నుండి, కః = ఎవడు, విదధ్యాత్= విధించును, వా = లేదా, నిషిద్ధ్యేత్ = నిషేధించును?

వస్తువును కోరువాడు దేనిని తీసికొనవలెను? భారపీడితుడు దేనిని విడువవలెను? తన ఆత్మయే లేదనినపుడు విధించువాడు, నిషేధించువాడు ఎవడు?

**అవసీదేన్నిరాకూతం తస్మాత్సర్వమిదం జగత్ ।**

తస్మాత్ = అందువలన, నిరాకూతం = కారణరహితమైన, ఇదం సర్వం జగత్ = ఈ ప్రపంచ మంతయు, అవసీదేత్ = నశించును.

కాన (జగత్తు) ఉండవలసిన కారణము లేనందున ఈ జగమంతయు నశించవలె.

**స్కంధానాం పరమాణూనాం న సంఘాతయితాస్తి చేత్ ॥16॥**

స్కంధానాం = స్కంధములయొక్కయు, పరమాణూనాం = పరమాణువుల యొక్కయు, సంఘాతయితా = కూర్చువాడు, న అస్తి చేత్ = లేడు అనినచో – స్కంధములను, పరమాణువులను కూర్చువాడు లేనేలేడనిన–

**సంఘాతో న వినా హేతుం జడా ఘటపటాదయః ।**

హేతుం వినా = కారణము లేక, సంఘాతః = కూర్చుట, న =

కాజాలదు, ఘటపటాదయః = ఘటపటాదులు, జడాః = చైతన్యము లేనివి కదా?

కారణము లేకయే కూర్చుట కాజాలదు. ఘటపటాదులు చైతన్యము లేనివి కదా?

**మహానుభావో భూయాసమితి భ్రాంతశ్చ మన్యతే. 17**

మహానుభావః = మహానుభావుడు, బుద్ధుడు, భూయాసం = అగుదును, ఇతి = అని, భ్రాంతః = భ్రాంతిగలవాడు, మన్యతే = తలచును.

నేనును బుద్ధునివలె మహానుభావుడ నగుదునను తెలివియు భ్రాంతియే.

**ఆత్మాపలాపకో బౌద్ధః కిమర్థం చరతి వ్రతమ్ ।**

ఆత్మాపలాపకః = ఆత్మయే లేదని చెప్పునట్టి, బౌద్ధః = బౌద్ధుడు, కిమర్థం = ఏ ప్రయోజనము నిమిత్తము, వ్రతం = వ్రతమును, చరతి= సలుపుచున్నాడు.

ఆత్మయే లేదని చెప్పునట్టి బౌద్ధుడు ఏ ప్రయోజనము కొఱకు వ్రతమును చేయుచున్నాడు?

**ప్రత్యభిజ్ఞా యది భ్రాంతిః భోజనాది కథం భవేత్ ॥18॥**

ప్రత్యభిజ్ఞా = గుర్తుపట్టుట, భ్రాంతిః యది = భ్రాంతియైనచో, భోజనాది = భోజనము మున్నగునవి, కథం = ఎట్లు, భవేత్ = అగును?



గుర్తుపట్టుట భ్రాంతియైనచో భోజనాది కార్యములయందు ప్రవృత్తి కల్గుట ఎట్లు?

**ఇష్టసాధనమేవైతదన్నం గతదినాన్నవత్ ।**
**ఇతి నిశ్చిత్య బాలోఽపి భోజనాదౌ ప్రవర్తతే ॥19॥**

గతదినాన్నవత్ = నిన్నటి అన్నమువలె, ఏతత్ అన్నం = ఈ అన్నము, ఇష్టసాధనం = ఆకలిని పోగొట్టునను ఇష్టమును సాధింపదగినది, ఇతి = అని, నిశ్చిత్య = నిశ్చయించియే, బాలః అపి= పిల్లవాడు కూడ, భోజనాదౌ = భోజనాది కార్యములయందు, ప్రవర్తతే= ప్రవర్తించు చున్నాడు.

నిన్నటి ఆహారమువలె నేటి ఆహారము కూడా ఆకలిని తొలగించునను ఇష్టమును సాధించగలదని నిశ్చయించుకొనియే బాలుడు కూడ భోజనాదులయందు ప్రవర్తించుచున్నాడు. ఆహారము ఇష్టసాధనమను గుర్తుపట్టుట (ప్రత్యభిజ్ఞ) ఉండుటచేతనే భోజనాది కార్యములయందు ప్రవృత్తి కల్గును. కాన ప్రత్యభిజ్ఞ భ్రాంతి యనుటకు వీలు లేదు.

**అవకాశప్రదాతృత్వమాకాశార్థక్రియా యథా ।**
**తథైవార్థక్రియా పుంసః కర్తృత్వ జ్ఞాతృతాదికా ॥20॥**

యథా = ఎట్లు, అవకాశప్రదాతృత్వం = అవకాశము నిచ్చుట, ఆకాశార్థక్రియా = ఆకాశమునకు సాధకమైన పనియో, అనగా ఆకాశ మున్నదని దాని చేతనే కావలసిన పనిచే సాధించ వలసిన అవకాశము నిచ్చుటవంటి సాధకమైన పని ఎట్లు అగుచున్నదో, తథా ఏవ = అట్లే,

కర్తృత్వజ్ఞాతృతాదికా = చేయుట, తెలియుట మున్నగునది, పుంసః = ఆత్మయొక్క, అర్థ క్రియా = సాధకమైన పని.

అవకాశము నిచ్చుట ఆకాశమున కెట్లు సాధ్యమైన కార్యమో అట్లే చేయుట, తెలియుట ఇత్యాదులు ఆత్మసాధక కార్యములు.

**సుషుప్తి సమయేఽప్యాత్మా సత్యజ్ఞానసుఖాత్మకః ।**
**సుఖమస్వాప్సమిత్యేవం ప్రత్యభిజ్ఞాయతే యతః ॥21॥**

యతః = ఎందువలన, సత్యజ్ఞాన సుఖాత్మకః = సచ్చిదానంద స్వరూపుడగు, ఆత్మా = ఆత్మ, సుషుప్తి సమయే అపి = నిద్రాకాలమందును, సుఖం = సుఖముగ, అస్వాప్సం = నిద్రించితిని, ఇతి ఏవం = అని యిట్లు, ప్రత్యభిజ్ఞాయతే = గుర్తింపబడుచున్నాడు.

ఎందువల్లనన సచ్చిదానంద స్వరూపుడగు ఆత్మ నిద్రయందున్న వాడును సుఖముగా నిద్రించితి ననునట్లు గుర్తింపబడుచున్నాడు.

**ప్రత్యభిజ్ఞాయత ఇతి ప్రయోగః కర్మకర్తరి ।**
**ఆత్మా స్వయంప్రకాశత్వాజ్జానాత్యాత్మానమాత్మనా ॥22॥**

ప్రత్యభిజ్ఞాయతే = గుర్తింపబడుచున్నాడు, ఇతి = అను, ప్రయోగః = ప్రయోగము, కర్మ కర్తరి = కర్మకర్తృకము అనగా కర్మయే కర్తగా గలది, స్వయంప్రకాశత్వాత్ = స్వయంప్రకాశమై యున్నందున, ఆత్మా = ఆత్మ, ఆత్మనా = తనచేత, ఆత్మానం = తనను, జానాతి = తెలిసికొనుచున్నాడు.

**సుషుప్తౌ మాయయా మూఢో జడోఽంధ ఇతి లక్ష్యతే ।**
**అప్రకాశతయా భాతి స్వప్రకాశతయాపి చ ॥23॥**



సుషుప్తౌ = నిద్రయందు, మాయయా = మాయచే, మూఢః = మోహితుడై, జడః = నిశ్చేతనుడు, అంధః = దృష్టిహీనుడు, ఇతి = అని, లక్ష్యతే = కనబడుచున్నాడు, అప్రకాశతయా = ప్రకాశము లేనివాడుగను, అవ్యక్తుడుగను, అపి చ = మఱియు, స్వప్రకాశతయా= స్వయంప్రకాశుడుగను, భాతి = ప్రకాశించుచున్నాడు.

నిద్రయందు మాయామోహితుడై అచేతనుడుగను, అంధుడుగను కనబడుచున్నాడు. అవ్యక్తుడుగా నున్నపుడు ప్రకాశము లేనివాడుగను, స్వయంప్రకాశుడుగను ప్రకాశించుచున్నాడు.

**జడాత్మని చ దేహాదౌ సాక్షాదీశో వివిచ్యతే ।**

జడాత్మని = జడరూపమైన, దేహాదౌ = శరీరము మున్నగు ఉపాధులయందు, సాక్షాత్ = ప్రత్యక్షముగ, ఈశః = ప్రభువగు ఆత్మ, వివిచ్యతే = వేరుగ తెలియబడుచున్నాడు.

జడమైన దేహము మున్నగువానియందు ప్రత్యక్షముగ ప్రభువైన ఆత్మ వేరుగ వివేకముచే తెలియబడుచున్నాడు.

**ఏషైవ మోహినీ నామ మాయాశక్తిర్మహేశితుః ॥24॥**

మహేశితుః = పరమేశ్వరుని, మోహినీ నామ = మోహమును కలిగించు, మాయాశక్తిః = మాయాశక్తి, ఏషా ఏవ = ఇదియే.

మోహమును కలిగించు పరమేశ్వర మాయాశక్తి ఇదియే. సచ్చిదానంద స్వరూపుడు, నిర్విశేషుడు అగు పరమాత్మ సోపాధికుడు, విశిష్టుడు అయి కనుపించుటయే అతని మోహము కలిగించు మాయాశక్తి.

**మోహాపోహః ప్రమాతౄణాం మోక్ష ఇత్యభిధీయతే ।**

ప్రమాతౄణాం = జ్ఞాతల, మోహాపోహః = మోహము తొలగుటయే, మోక్షః = మోక్షము, ఇతి = అని, అభిధీయతే = చెప్పబడుచున్నది.

జ్ఞాతల ఈ మోహము తొలగుటయే మోక్షమని చెప్పబడుచున్నది.

**అవస్థాత్రయ నిర్ముక్తో దోషాదిభిరనావిలః ॥25॥**

**ఇషీక ఇవ సన్మాత్రః న్యగ్రోధకణికోపమః ।**
**బాహ్యాబాహ్యదళోన్ముక్త కదళీ కందసన్నిభః ॥26॥**

**నిరంశో నిర్వికారశ్చ నిరాభాసో నిరంజనః ।**
**పురుషః కేవలః పూర్ణః ప్రోచ్యతే పరమేశ్వరః ॥27॥**

అవస్థాత్రయనిర్ముక్తః = జాగ్రత్స్వప్న సుషుప్తులను అవస్థాత్రయరహితుడు, దోషాదిభిః = రాగద్వేషాది దోషములచే, అనావిలః = నిర్మలుడు, ఇషీకః ఇవ = ఈనెవలె, సన్మాత్రః = ఉనికి మాత్రమే అయియున్నవాడు, న్యగ్రోధ కణికోపమః = మఱ్ఱి విత్తనమునకు పోల్చదగినవాడు, బాహ్యాబాహ్యదళోన్ముక్తకదళీకంద సన్నిభః = బయటి లోపలి పట్టలను తీసివేసిన అరటికందమువలె నున్నవాడు, నిరంశః = అంశము, భాగము, అవయవము లేనివాడు, చ = మఱియు, నిర్వికారః = రూపాంతరము లేనివాడు, నిరాభాసః = అవ్యక్తుడు, నిరంజనః = నిష్కళంకుడు, పూర్ణః = పరిపూర్ణుడు, కేవలః= అద్వితీయుడు అగు, పురుషః = ఆత్మయే, పరమేశ్వరః = పరమేశ్వరుడని, ప్రోచ్యతే = చెప్పబడుచున్నాడు.



అవస్థాత్రయరహితుడు, నిర్దోషుడు, ఈనెవలె ఉనికిమాత్రమై యున్నవాడు, మఱ్ఱిగింజకు పోల్చదగినవాడు, బయటి పట్టలను తొలగించిన కదళీకందము వంటివాడు, నిరవయవుడు, రూపాంతర రహితుడు, అవ్యక్తుడు, నిరంజనుడు, పూర్ణుడు, అద్వితీయుడు అగు ఆత్మయే పరమేశ్వరుడని చెప్పబడుచున్నాడు.

**వాచో యత్ర నివర్తంతే మనో యత్ర విలీయతే ।**
**ఏకీభవంతి యత్రైవ భూతాని భువనాని చ ॥28॥**

**సమస్తాని చ తత్త్వాని సముద్రే సింధవో యథా ।**
**కః శోక స్తత్ర కో మోహః ఏకత్వమనుపశ్యతః ॥29॥**

యత్ర = ఏ చోట, వాచః = మాటలు, నివర్తంతే = మరలుచున్నవో, యత్ర = ఎచ్చట, మనః = మనస్సు, విలీయతే = లయమును పొందుచున్నదో, యత్ర ఏవ = ఏ చోటనే, సముద్రే = సముద్రమునందు, సింధవః = నదులు, యథా = ఎట్లో, అట్లు, సమస్తాని భూతాని = ఎల్ల ప్రాణులు, చ = మఱియు, భువనాని = లోకములు, చ = మఱియు, తత్త్వాని = తత్త్వములు, ఏకీభవంతి = ఒకటి యగు చున్నవో, తత్ర = అచ్చట, ఏకత్వం = ఒకటియే అయియుండుటను, అనుపశ్యతః = చూచుచుండువానికి, శోకః = దుఃఖము, కః = ఏది? మోహః = భ్రాంతి, కః = ఏది?

ఎచ్చోట నుండి మాటలు మరలునో, దేనియందు మనస్సు లీనమగునో, ఎచ్చట సముద్రమునందు నదులవలె ఎల్ల ప్రాణులు,

లోకములు, తత్త్వములు ఏకమగుచున్నవో అచట ఏకత్వమునే చూచుచున్నవానికి దుఃఖమేది? భ్రాంతి యేది?

**వాచ్యవాచకరూపత్వాత్ సవికల్పోఽపి సన్నయమ్ ।**
**దేహాదీనాం వ్యపోహేన సంభవేన్నిర్వికల్పకమ్ ॥30॥**

వాచ్యవాచకరూపత్వాత్ = అర్థము శబ్దము అను రూపమును పొందియున్నందున, సవికల్పః సన్నపి = భేదములుగలవాడై యున్నను, అయం = ఈ ఆత్మ, దేహాదీనాం = దేహము మున్నగు ఉపాధుల, వ్యపోహేన = తీసివేయుటచే, నిర్వికల్పకం = భేదరహితుడుగా, సంభవేత్= అగును.

శబ్దము అర్థము అను రూపములను కలిగి యున్నందున భేదముగలవాడువలె కన్పట్టు చున్నను ఈ ఆత్మ దేహాద్యుపాధి నిరాకరణచే భేదరహితుడే యగును. భేదరహిత నిజస్థితి యందు ప్రకాశించును.

**అసన్నేవ భవేద్విద్వానసద్బ్రహ్మేతి వేదచేత్ ।**
**అస్తి బ్రహ్మేతి చేద్వేద సంతమేనం తతో విదుః ॥31॥**

విద్వాన్ = పండితుడు, బ్రహ్మ = బ్రహ్మము, అసత్ = లేనిది, ఇతి = అని, వేదచేత్ = తెలిసికొనిన, అసన్నేవ = లేనివాడుగనే, భవేత్= అగును, బ్రహ్మ = బ్రహ్మము, అస్తి = ఉన్నది, ఇతి = అని, వేదచేత్ = తెలిసికొనిన, తతః = అపుడు, ఏనం = ఇతనిని, సంతం = ఉన్నవానినిగ, విదుః = తెలియుచున్నారు.

పండితుడు బ్రహ్మము లేదని తలచిన లేనివాడే యగుచున్నాడు.



బ్రహ్మ మున్నదని తెలిసికొనిన అపుడు ఇతనిని ఉన్నవానినిగ తెలియు చున్నారు.

**ఇతి శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థప్రతిపాదకే ।**
**ప్రబంధే మానసోల్లాసే షష్ఠోల్లాసస్య సంగ్రహః ॥32॥**

ఇతి = ఇట్లు, శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకే = శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థమును వివరించు, మానసోల్లాసే = మానసోల్లాసమను, ప్రబంధే = కృతియందు, షష్ఠోల్లాసస్య = ఆరవ ఉల్లాసము యొక్క, సంగ్రహః = సంగ్రహము.

ఇట్లు శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థమును వివరించు మానసోల్లాసమను కృతియందు సంగ్రహమైన ఆరవ ఉల్లాసము.

హరిః ఓం తత్సత్.



## సప్తమోల్లాసం

**బాల్యాదిష్వపి జాగ్రదాదిషు తథా సర్వాస్వవస్థాస్వపి**
**వ్యావృత్తాస్వనువర్తమానమహమిత్యంతః స్ఫురంతం సదా ।**
**స్వాత్మానం ప్రకటీకరోతి భజతాం యో భద్రయా ముద్రయా**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥7॥**

బాల్యాదిషు అపి = బాల్యము మున్నగు వానియందును, తథా= అట్లె, జాగ్రదాదిషు = జాగ్రత్తు మున్నగు వానియందు, వ్యావృత్తాసు = భేదమును పొందు, సర్వాసు = ఎల్ల, అవస్థాసు అపి = అవస్థలయందును, అహం ఇతి = నేనని, అంతః = లోపల, స్ఫురంతం= ప్రకాశించుచు, సదా = ఎల్లప్పుడు, అనువర్తమానం = (నిర్వికారుడుగ) ఉండియే యున్న, స్వాత్మానం = తన యాత్మనే, యః = ఎవడు, భజతాం = భక్తులకు, భద్రయా = శ్రేయస్కరమైన, ముద్రయా = చిన్ముద్రచే, ప్రకటీకరోతి = ప్రకటించుచున్నాడో, తస్మై = ఆ, శ్రీగురుమూర్తయే = శ్రీగురుస్వరూపుడగు, శ్రీదక్షిణామూర్తయే = శ్రీదక్షిణామూర్తికి, ఇదం = ఈ, నమః = నమస్కారము.

బాల్యము జాగ్రత్తు మున్నగు భేదమును పొందుచున్న సర్వావస్థల యందును "నేను" అని లోపల ప్రకాశించుచు సదా నిర్వికారుడుగ నుండియేయున్న తన యాత్మనే యెవడు భక్తులకు కల్యాణకరమైన చిన్ముద్రచే ప్రకటించుచున్నాడో ఆ శ్రీ గురుస్వరూపుడగు శ్రీదక్షిణామూర్తికి ప్రణామము.



**ప్రత్యభిజ్ఞాబలా దాత్మా స్థాయీ నిర్ధార్యతే యది ।**
**కా నామ ప్రత్యభిజ్ఞేషా కిం వా తస్యాః ప్రయోజనమ్ ॥1॥**

ప్రత్యభిజ్ఞాబలాత్ = గుర్తుపట్టుదాని బలము వలన, ఆత్మా = ఆత్మ, స్థాయీ = నిత్యమని, నిర్ధార్యతే యది = నిశ్చయించినచో, ఏషా= ఈ, ప్రత్యభిజ్ఞా నామ =గుర్తుపట్టుట అనునది, కా = ఏది? వా = మఱియు, తస్యాః = దానియొక్క ప్రయోజనం కిం = ప్రయోజనమేమి?

ఆత్మ నిత్య మనుదానిని "గుర్తుపట్టుట" అను దాని బలము చేతనే నిశ్చయించినచో ఈ గుర్తుపట్టుట అనునదేది? దాని ప్రయోజనమేమి?

**ప్రత్యక్షాది ప్రమాణేషు ప్రత్యభిజ్ఞా న పఠ్యతే ।**
**కథం తస్యాః ప్రమాణత్వ మితి పృచ్ఛన్ప్రబోధ్యతే ॥2॥**

ప్రత్యక్షాది ప్రమాణేషు = ప్రత్యక్షాది ప్రమాణముల యందు, ప్రత్యభిజ్ఞా = గుర్తుపట్టుట, న పఠ్యతే = చెప్పబడలేదు, తస్యాః ప్రమాణత్వం = దాని ప్రమాణత్వము, కథం ఇతి = ఎట్లని, పృచ్ఛన్ అడుగువాడు, ప్రబోధ్యతే = బోధింపబడుచున్నాడు.

ప్రత్యక్షాది ప్రమాణములలో ప్రత్యభిజ్ఞను చేర్చలేదు - అది యెట్లు ప్రమాణమగునని ప్రశ్నించువానికి సమాధానమును చెప్పుచున్నారు.

**భాతస్య కస్యచిత్పూర్వం భాసమానస్య సాంప్రతమ్,**
**సోఽయ మిత్యనుసంధానం ప్రత్యభిజ్ఞాన ముచ్యతే. 3**

పూర్వం = వెనుక, భాతస్య = గోచరించిన మఱియు,

సాంప్రతం= ఇప్పుడు, భాసమానస్య = గోచరించుచున్న, కస్యచిత్ = ఒకానొక విషయములో, సః = అదియే, అయం = ఇది, ఇతి = అను, అనుసంధానం = జ్ఞానము, ప్రత్యభిజ్ఞానం = గుర్తుపట్టుట అని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

వెనుక గోచరించిన మతియు నిపుడు గోచరించుచున్న యొకానొక విషయమున నదియే యిది యనుజ్ఞానము "ప్రత్యభిజ్ఞ" అని చెప్పబడుచున్నది.

**తద్దేశకాలాకారాదీ నవధూయానుషంగికాన్ ।**
**యథైకం వస్త్వనుస్యూతం సోఽయమిత్యభిధీయతే ॥4॥**

**మాయానుషంగ సంజాత కించిజ్జత్వాద్యపోహనాత్ ।**
**సర్వజ్ఞత్వాదివిజ్ఞానం ప్రత్యభిజ్ఞానమాత్మనః ॥5॥**

అనుషంగికాన్ = ప్రాసంగికములైన, తద్దేశ కాలాకారాదీన్ = ఆ దేశము కాలము ఆకారము మున్నగువానిని, అవధూయ = తీసివేసి, అనుస్యూతం = అవిచ్ఛిన్నము, ఏకం = ఏకమునగు, వస్తు = వస్తువు, యథా = ఎట్లు, సః = అదియే, అయం = ఇది, ఇతి = అని, అభిధీయతే= చెప్పబడుచున్నదో, అట్లె, మాయానుషంగ సంజాతకించిజ్జత్వాద్య పోహనాత్ = మాయా సంపర్కముచే పుట్టిన స్వల్పజ్ఞానము కలిగియుండుట మున్నగువాని నిరాకరణవలన, ఆత్మనః = తన, సర్వజ్ఞత్వాది విజ్ఞానం = సర్వము తెలిసియుండుట మున్నగువాని తెలివియే. ప్రత్యభిజ్ఞానం = గుర్తుపట్టుట.



ప్రాసంగికములగు ఆ దేశకాలాకారాదులను తీసివేసి యవిచ్ఛిన్నము, నేకమునగు వస్తువదియే యిది యని చెప్పబడినట్లే మాయా సంబంధముచే కలిగిన స్వల్పజ్ఞానమును పొందియుండుట మున్నగు వానిని దొలగించుటచే నాత్మయొక్క సర్వజ్ఞత్వాది విజ్ఞానమే "ప్రత్యభిజ్ఞ".

**పూర్వజన్మానుభూతార్థ స్మరణా న్మృగశాబకః ।**
**జననీ స్తన్యపానాయ స్వయమేవ ప్రవర్తతే ॥6॥**

మృగశాబకః = ప్రాణియొక్క పిల్ల, పూర్వజన్మానుభూతార్థ స్మరణాత్ = పూర్వజన్మమున ననుభవించిన విషయ స్మరణవలన, జననీ స్తన్యపానాయ = తల్లి చన్నుపాలు త్రాగుటకు, స్వయమేవ = తానుగనే, ప్రవర్తతే = ప్రవర్తిల్లుచున్నది.

గత జన్మానుభూత విషయస్మరణచే ప్రాణియొక్క పిల్ల తల్లిచనుబాలు త్రాగుటకు స్వయముగనే ప్రారంభించుచున్నది.

**తస్మాన్నిశ్చీయతే స్థాయీ త్వాత్మా దేహాంతరేష్వపి ।**
**స్మృతిం వినా న ఘటతే స్తన్యపానం శిశోర్యతః ॥7॥**

యతః = ఎందువలన, శిశోః = బిడ్డకు, స్తన్యపానం = చనుబాలుత్రాగుట. స్మృతిం వినా = జ్ఞాపకము లేకుండ, న ఘటతే = కాజాలదో, తస్మాత్ = అందువలన, దేహాంతరేషు అపి = ఇతర దేహములయందు కూడ, ఆత్మా = ఆత్మ, స్థాయీ = నిత్యుడు, ఇతి = అని, నిశ్చీయతే = నిశ్చయింపబడుచున్నది.

దేహాంతరానుభవము జ్ఞాపకము లేనిచో నపుడు సరియైన కారణము చెప్పుట కుదరదు. కాబట్టి జన్మాంతరములలో లభించు వేర్వేరు దేహములయందు కూడ స్థాయిగా నుండునది నిర్ణయమగు చున్నది. స్మృతి లేనిచో శిశువుకు స్తన్యపానం సంభవించదు.

**పూర్వత్రానుభవే కాలే స్మృతికాలే పరత్రసన్ ।**
**ఆత్మా సంస్కారరూపేణ స్మరత్యర్థం స్వనిష్ఠితమ్ ॥8॥**

అనుభవే కాలే = అనుభవ కాలమున, పూర్వత్ర = పూర్వమున, స్మృతికాలే = స్మరణ కాలమున, పరత్ర = తరువాత, సన్ = ఉండు నట్టి, ఆత్మా = ఆత్మ, సంస్కారరూపేణ = సంస్కార రూపముతో, స్వనిష్ఠితం = తనలోనే యున్న, అర్థం = విషయమును. స్మరతి = స్మరించుచున్నాడు.

అనుభవకాలమను పూర్వసమయమునను, స్మరణకాలమను తరువాతి సమయమునను నుండియే యున్న యాత్మ సంస్కార రూపమున తనలోనే యున్న విషయమును జ్ఞాపకము చేసికొనుచున్నాడు.

**ప్రత్యభిజ్ఞేతి భావానాం స్మృతిశ్చే దభిధీయతే ।**
**ఆత్మస్థైర్యే ప్రమాణత్వం స్మృతిశ్చ ప్రాప్నుయాత్కథమ్ ॥9॥**

భావానాం స్మృతిః = వస్తువుల స్మరణ, ప్రత్యభిజ్ఞా ఇతి = గుర్తుపట్టుట అని, అభిధీయతే చేత్ = చెప్పబడినచో, స్మృతిః = స్మరణ, ఆత్మస్థైర్యే = ఆత్మస్థిరుడని సాధించుటయందు, ప్రమాణత్వం = ప్రామాణ్యమును, కథం = ఎట్లు, ప్రాప్నుయాత్ = పొందును?



వస్తువుల జ్ఞాపకమే ప్రత్యభిజ్ఞ యని చెప్పినచో యాత్మస్థిరుడని సాధించుటయందు జ్ఞాపకమునకు ప్రామాణ్య మెట్లు కలుగును?

**స్మృతౌ ప్రకాశో నార్థస్య న చా ప్యర్థస్య నిశ్చయః ।**
**న చా ప్యర్థానుభవయో రంగుల్యో రివ సంభవేత్ ॥10॥**

**నానుభూతి విశిష్టస్య పదార్థస్య చ దండివత్ ।**
**సర్వత్రాప్యేవ మిత్యేవం ప్రసంగాదితిచే చ్ఛృణు ॥11॥**

స్మృతౌ = స్మరణలో, అర్థస్య ప్రకాశః = (ప్రత్యక్షమగు) విషయభానము, న = లేదు, చ = మఱియు, అర్థస్య నిశ్చయః అపి = (స్మృతి సమకాలికమైన) విషయానుభవము కూడ, న = ఉండుట లేదు. అంగుల్యోరివ = రెండువ్రేళ్ళ (ఏకకాలమందగు భావము) వలె, అర్థానుభవయోః = విషయము, అనుభవము యీ రెండింటి (ఏకకాలిక భావము), న సంభవేత్ = సంభవింపజాలదు, దండివత్ = దండము గల వాడు అన్నట్లు, అనుభూతి విశిష్టస్య = అనుభవమును విశేషముగ కలిగిన, పదార్థస్య = వస్తువు యొక్క (భాగము), న = లేదు, ఇతి = అను, ఏవం = ఈవిధమైన (స్మృతి కాలమున విషయ మింద్రియసన్నికృష్టముగా లేనందున విషయభానము కాజాలదు. పూర్వకాలికానుభవము తదుత్తరక్షణముననే నశించుటవలననుభావము కాజాలదు. అందుచేతనే విషయము, తదనుభవము నీ రెండింటి వేర్వేరు లేదా విశేషణ విశేష్యభావము గల దాని భావము స్మృతియందు కాజాలదు. స్మృతికి ప్రామాణ్యము ఒప్పికొన్నచో నామశ్రవణ మాత్రముచే కలుగు స్మరణకు కూడ ప్రత్యక్ష జనిత జ్ఞానమువలెనే ప్రామాణ్యము నొప్పికొనవలసి వచ్చును), ప్రసంగాత్ = ప్రసంగము వలన, సర్వత్ర

అపి = అన్ని స్మరణల విషయమునను, ఏవం = ఇట్లే, ఇతి చేత్ = అని (ఆక్షేపించి)న, శృణు = విను.

స్మరణలో విషయేంద్రియములు సన్నికృష్టముగా నున్నందున ప్రత్యక్ష విషయభావము లేదు. విషయేంద్రియ సన్నికర్షచే పూర్వకాలికానుభవము తదుత్తర క్షణముననే నశించియున్నందున స్మృతిసమకాలికానుభవ భావము లేదు. అందుచేతనే విషయము ననుభవము నీ రెండు రెండు వ్రేళ్ళవలె వేర్వేరు లేదా 'దండము కలవాడు' అను ప్రతీతియందున్నట్లు విశేషణ విశేష్య భావముతో కూడిన భావము కాజాలదు. కావున స్మృతిప్రామాణ్యము నంగీకరించిన యన్నిస్మరణల విషయమునకు నామశ్రవణ మాత్రముచే కలుగు స్మరణను గూడ ప్రత్యక్ష జనిత స్థానమువలెనే ప్రామాణ్యము నంగీకరింపవలసి వచ్చునను నాక్షేపణకు నుత్తరము విను.

**ప్రాక్తనానుభవే నష్టే తదవష్టంభసంభవాత్ ।**
**సంస్కార సంజ్ఞాత్సామగ్ర్యాత్పౌరుషాజ్జాయతే స్మృతిః ॥12॥**

ప్రాక్తనానుభవే = మొదటి అనుభవము, నష్టే = నశించగా, తదవష్టంభసంభవాత్ = దాని ఆధారముచే పుట్టిన, సంస్కార సంజ్ఞాత్= సంస్కారమను పేరుగల, పౌరుషాత్ = ఆత్మనిష్ఠమైన, సామగ్ర్యాత్ = శక్తి విశేషము నుండి, స్మృతిః = స్మరణ, జాయతే = కలుగుచున్నది.

పూర్వానుభమము నశింప దాని యాధారముచే పుట్టిన సంస్కారమను నాత్మనిష్ఠశక్తి విశేషము వలన స్మరణ కలుగుచున్నది.



**ఆవేద్యానుభవే నష్టే తదీయం విషయం ప్రతి ।**
**అనుభావిక మాత్మానం బోధయత్యనపాయినమ్ ॥13॥**

(ఈ స్మరణ) ఆవేద్యానుభవే = పత్యక్షాది జనితజ్ఞానకాలికమగు ననుభవము, నష్టే = నాశముకాగా, తదీయం విషయం ప్రతి - ఆయనుభవ విషయమును గుఱించి, అనుభావకం = అనుభవమును బడసిన, ఆత్మానం = ఆత్మను, అనపాయినం = నాశరహితుడని, బోధయతి = బోధించుచున్నది.

స్మరణ ప్రత్యక్షాది జన్యజ్ఞానకాలికానుభవము నశించినను ఆ యనుభవమును పొందిన యాత్మ నాశరహితుడని బోధించుచున్నది.

**విషయే చ ప్రముషితే నష్టే వానుభవే సతి ।**
**స్వవిశ్రాంతం స్మరత్యర్థం దేవోఽప్రముషిత స్సదా ॥14॥**

విషయే ప్రముషితే = విషయము కనబడనపుడు, వా = మఱియు, అనుభవే నష్టే = అనుభవము నశించినపుడు, సదా = ఎల్లప్పుడు, అప్రముషితః = కనబడనివాడు కాని (సదా కన్పట్టుచున్న), దేవః = పరమాత్మ, స్వవిశ్రాంతం = తనయందే (సంస్కార రూపుడుగ) దాగి యున్న, అర్థం = విషయమును, స్మరతి = జ్ఞాపకము చేసికొనుచున్నాడు.

విషయ మగోచరమైనపుడు, దాని యనుభవము కూడ నశించినపుడు సదా కనబడుచున్న పరమాత్మ సంస్కారరూపుడుగ తనయందే దాగియున్న విషయమును స్మరించుచున్నాడు.

**ప్రమోషణం ప్రమాతౄణాం మాయయా తమసా కృతమ్ ।**
**మాయావిద్యే ప్రభోః శక్తీ భానోశ్ఛాయా ప్రభోపమే ॥15॥**

ప్రమాతౄణాం = జిజ్ఞాసువుల, ప్రమోషణం = అజ్ఞానము, మాయయా = మాయయను, తమసా = చీకటిచే, కృతం = ఐనది, మాయా విద్యే = మాయ, విద్య, భానోః = సూర్యుని, ఛాయాప్రభోపమే= నీడ, వెలుగులవలె, ప్రభోః =ఈశ్వరుని, శక్తీ = రెండు శక్తులు.

జిజ్ఞాసువుల యజ్ఞానము మాయ యను చీకటిచే యయినది. మాయా విద్యలు సూర్యుని నీడ వెలుగులవలె యీశ్వరుని రెండు శక్తులు.

**అర్థానాచ్ఛాదయేన్మాయా విద్యా వ్యాక్షిప్యదర్శయేత్ ।**
**ప్రత్యభిజ్ఞైవ సర్వేషాం ప్రమాణానాం చ కారణమ్ ॥16॥**

మాయా = మాయ, అర్థాన్ = వస్తువులను, ఆచ్ఛాదయేత్ = ఆవరించును, విద్యా = విద్య, వ్యాక్షిప్య = (ఆవరణమును) తొలగించి, దర్శయేత్ = (వస్తువుల స్వరూపమును) చూపించును, చ = మఱియు, సర్వేషాం ప్రమాణానాం = ఎల్లప్రమాణములకు, కారణం = కారణమైనది, ప్రత్యభిజ్ఞా ఏవ = ప్రత్యభిజ్ఞయే.

మాయ వస్తువులను మూయును. జ్ఞాన మా మూతను తీసివేసి వస్తువుల స్వరూపమును చూపించును. సర్వప్రమాణములకును కారణమైనది ప్రత్యభిజ్ఞయే.

**ఈశ్వరోఽన్యోహమప్యన్య ఇతి విచ్ఛేదకారిణీమ్ ।**
**వ్యాక్షిప్య విద్యయా మాయామీశ్వరోఽహమితి స్మృతిః ॥17॥**

ఈశ్వరః = ఈశ్వరుడు, అన్యః = వేరు, అహం అపి = నేనుకూడ, అన్యః = వేరు, ఇతి = అను, విచ్ఛేదకారిణీం = భేదమును కలిగించు, మాయాం = మాయను, విద్యయా = జ్ఞానముచే, వ్యాక్షిప్య = తొలగించి,



అహం = నేను, ఈశ్వరః = ఈశ్వరుడను, ఇతి = అను, స్మృతిః = స్మరణ (ప్రత్యభిజ్ఞ).

ఈశ్వరుడు వేరు, నేను వేరను భేదమును కలిగించు మాయను జ్ఞానముచే తొలగించి నేనే యీశ్వరుడ నను స్మరణయే ప్రత్యభిజ్ఞ.

**ఈషత్ప్రకాశోఽభూదీశో మాయాయవనికావృతః ।**
**సమ్యగావరణాపాయే సహస్రాంశురివ స్ఫురేత్ ॥18॥**

మాయాయవనికావృతః = మాయయను తెరచే కప్పబడిన, ఈశః = పరమేశ్వరుడు, ఈషత్ప్రకాశః = స్వల్పప్రకాశము గలవాడు, అభూత్ = ఆయెను, సమ్యక్ = లెస్సగా, ఆవరణాపాయే = తెరతీయగ, సహస్రాంశుః ఇవ = సూర్యునివలె, స్ఫురేత్ = ప్రకాశించును.

మాయచే మూయబడిన పరమాత్మ స్వల్ప ప్రకాశుడువలె గోచరించినను బాగుగ తెరను తీసివేయ సూర్యునివలె పరిపూర్ణ తేజస్సుతో వెలుగును.

**న కారణానాం వ్యాపారః ప్రమాణానాం న వా పునః ।**
**ప్రత్యభిజ్ఞాపనం నామ మోహాపసరణం పరమ్ ॥19॥**

ప్రత్యభిజ్ఞాపనం నామ = ప్రత్యభిజ్ఞను కలిగించుటయన, కారణానాం = కారణముల, వ్యాపారః = పని, న = కాదు, వా పునః= అథవా, ప్రమాణానాం = ప్రత్యక్షాది ప్రమాణముల (పని), న = కాదు, ఐతే,మోహాపసరణం పరం = అజ్ఞాననివృత్తి మాత్రము.

ప్రత్యభిజ్ఞ కారణముల లేదా ప్రమాణముల పనులచే కలుగదు. అయిన నజ్ఞాననివారణచేత మాత్రము కలుగును.

**యావంతి సంతి మానాని వ్యవహార ప్రవృత్తయే ।**
**తేషాం మోహాపసరణా ద్వ్యాపారోఽన్యో న విద్యతే ॥20॥**

వ్యవహార ప్రవృత్తయే = వ్యవహారము నడుచుట కొఱకు, యావంతి = ఎన్ని, మానాని = ప్రమాణములు, సంతి = ఉన్నవో, తేషాం = వానికి, మోహాపసరణాత్ = అజ్ఞాన నివారణకంటె, అన్యః = వేరు, వ్యాపారః = పని, న విద్యతే = లేదు.

వ్యవహార ప్రవృత్తికై యున్న ప్రమాణములన్నిటికిని అజ్ఞాన నివారణ కంటె వేరు పని లేదు.

**జడానృతపరిచ్ఛిన్న దేహధర్మాశ్చిదాత్మని ।**
**సత్యజ్ఞానసుఖాత్మత్వం మోహాద్దేహేఽపి కల్ప్యతే ॥21॥**

**శుక్తౌ రజత మిత్యేవం యథా వ్యాముహ్యతేఽన్యథా ।**
**సదేవ రూప్యం చే ద్భాతి విలయ స్తే న సిధ్యతి ॥22॥**

యథా = ఎట్లు, శుక్తౌ = ముత్తెపు చిప్పలో, రజతం = వెండి, ఇతిఏవం = అను, రీతిగా, అన్యథా = వేరైన-అచ్చట లేని వస్తువు యొక్క (జ్ఞానముచే), వ్యాముహ్యతే = మోహమును బొందుచున్నాడో, అట్లే, జడానృత పరిచ్ఛిన్న దేహధర్మాః = అచేతనము, అసత్యము, మితము ఐన దేహ ధర్మములు, చిదాత్మని = చిదాత్మయందు, అపి = మఱియు, సత్యజ్ఞానసుఖాత్మత్వం = సచ్చిదానంద స్వరూపము, దేహే= దేహమునందును, మోహాత్ = అజ్ఞానము వలన, కల్ప్యతే = ఆరోపింపబడు చున్నది, తే = నీకు, సత్ ఏవ = వాస్తవముగా నున్న, రూప్యం = వెండి, భాతిచేత్ = (ముత్తెపు చిప్పలో ) కనుపించినచో,



విలయః = (ఇది వెండియను (భ్రాంతిజ్ఞాన) నాశము, న సిధ్యతి = కానేకాదు.

ముత్తెపుచిప్పలో వెండి యను, అచట లేని వస్తు జ్ఞానముచే భ్రాంతి కలుగునట్లు అచేతనము, అసత్యము, పరిమితమునైన దేహ ధర్మములు ఆత్మయందు, సచ్చిదానంద స్వరూపము దేహము నందును అజ్ఞానముచే నారోపింపబడుచున్నవి. ముత్తెపుచిప్పలో గనబడు వెండి వాస్తవముగానే యుండి యచ్చట కనుపించినచో "ఇది ముత్తెపు చిప్ప" యను యథార్థ జ్ఞానము కలిగి నపుడును "ఇది వెండి" యను భ్రాంతి జ్ఞాననాశము కానేకాదు.

**నాత్యంతాసత్ప్రకాశేత నరశృంగాదివత్క్వచిత్ ।**
**కాంతాకరాదౌ రజతమితి స్యాత్స్మరణం భ్రమే ॥23॥**

భ్రమే = భ్రాంతిజ్ఞాన విషయమైన (వెండి), అత్యంతాసత్ = పూర్తిగ లేనిదైనచో, నరశృంగాదివత్ = మనుష్యుని కొమ్ము మున్నగు వానివలె, క్వచిత్ = ఎల్లప్పుడు, న ప్రకాశేత = కనుపించక ఉండవలె, స్మరణం = (ఇది వెండి అను భ్రాంతిజ్ఞాన కారణము) స్మరణ ఐనచో కాంతాకరాదౌ = ఆడువారి చెయ్యి మున్నగు చోట (చూచిన) రజతం= వెండి, ఇతి = అని, విశిష్ట జ్ఞానము, స్యాత్ = అయ్యెడిది.

భ్రాంతి జ్ఞాన విషయమైన వెండి పూర్తిగా లేనిదైన, మనుష్యుని కొమ్ము మున్నగు వానివలె యెప్పుడును గనుపించక యుండవలె. "ఇది వెండి" అను భ్రాంతిజ్ఞాన కారణము స్మరణయైన, "ఆడవారి చేయి మున్నగు చోట్ల చూచిన వెండి" అను విశిష్టజ్ఞాన మయ్యెడిది.

**తేనేదం తుల్యమిత్యేవం స్యాత్సాదృశ్యాద్యదిభ్రమః ।**
**పీతః శంఖో గుడస్తిక్త ఇత్యాదౌ నాస్తి తుల్యతా ॥24॥**

తేన = దానితో, ఇదం = ఇది, తుల్యం = సమానము, ఏవం= ఇట్లు, సాదృశ్యాత్ = పోలిక వలన, భ్రమః = భ్రాంతి, ఇతి యది = అనినచో, శంఖః = శంఖము, పీతః = పచ్చనిది, గుడః = బెల్లము, తిక్తః = చేదైనది, ఇత్యాదౌ = ఇత్యాది భ్రాంతి జ్ఞానములయందు, తుల్యతా= పోలిక, న అస్తి = ఉండదు.

"ఇది దానితో సమానము" అను పోలికచే భ్రాంతి కలుగునని చెప్పినచో "శంఖము పచ్చనిది" "బెల్లము చేదు" ఇత్యాది (ఇంద్రియ దోషముచే కలిగిన) భ్రాంతియం దేపోలిక కనుపించుట లేదు.

**తాదాత్మ్యేన స్ఫురతి చే ద్రజతత్వేన శుక్తికా ।**
**విభ్రమో నిరధిష్ఠానో బాధో నిరవధి ర్భవేత్ ॥25॥**

శుక్తికా = ముత్తెపు చిప్ప, తాదాత్మ్యేన = అదియే అయియున్న, రజతత్వేన = వెండి రూపముతో, స్ఫురతిచేత్ = కనుపించుచున్న దనిన, విభ్రమః = భ్రాంతి, నిరధిష్ఠానః = ఆధారము లేనిది, బాధః = బాధ, నిరవధిః = అవశిష్ట వస్తువు లేనిది, భవేత్ = అగును.

ముత్తెపుచిప్ప వెండియే యైయున్న వెండిరూపముతో కనుపించుచున్నదని చెప్పినచో వాస్తవముగా నచ్చట వెండి లేనందున భ్రాంతి కాధారమే లేనట్లగును. మఱియు యథార్థ జ్ఞానముచే భ్రాంతికి బాధయైనపుడు యథార్థజ్ఞాన విషయమైన యవశిష్ట వస్తువు కూడ లేనట్లగును.



**బుద్ధిస్థితం చే ద్రజతం బాహ్యత్వేన ప్రతీయతే ।**
**గుంజాదౌ జ్వలనారోప దేహదాహః ప్రసజ్యతే ॥26॥**

బుద్ధిస్థితం = బుద్ధియందున్న, రజతం = వెండి, బాహ్యత్వేన= బయటనున్నట్లు, ప్రతీయతేచేత్ = తెలియబడిన, గుంజాదౌ = గురిగింజ మున్నగు దానిలో, జ్వలనారోపే = అగ్గి అను భ్రాంతి కలిగినపుడు, దేహదాహః = శరీరము కాలుట, ప్రసజ్యేత = అయ్యెడిది.

భ్రాంతియందు బుద్ధియందున్న వెండియే బయట నున్నట్లు కనుపించుచున్న దనిన గురిగింజయం దగ్ని యను భ్రాంతి కలిగినపుడు దేహము కాలునను ప్రసంగము వచ్చును.

**యుక్తిహీనప్రకాశత్వాద్భ్రాంతేర్న హ్యస్తి లక్షణమ్ ।**
**యది స్యాల్లక్షణం కించి ద్భ్రాంతి రేవ న సిద్ధ్యతి ॥27॥**

యుక్తిహీన ప్రకాశత్వాత్ = యుక్తికి చిక్కక కనుపించుట వలన, భ్రాంతేః = భ్రాంతికి, లక్షణం = నిష్కర్షక ధర్మము, న అస్తి ఏవ = లేనేలేదు, కించిత్ = ఏదేని, లక్షణం = లక్షణము అస్తిచేత్ = ఉన్నచో, భ్రాంతిః ఏవ = భ్రమ అనునదే, న సిద్ధ్యతి = సిద్ధించదు.

యుక్తికి చిక్కక కనుపించుట వలన భ్రాంతికి నిష్కర్షక ధర్మమే లేదు. ఏదేని యొక లక్షణ మున్నదనిన అది అయథార్థ జ్ఞానమనుటయే (భ్రమ అనుట) సిద్ధింపజాలదు.

**జలచంద్రవ దేకస్మి న్నిర్భయే రజ్జుసర్పవత్ ।**
**ప్రతీయతే యథా స్వర్ణే కారణే కటకాదివత్ ॥28॥**

**ఉపాత్తే రూప్యవచ్ఛుక్తౌ వ్యాప్తే యక్షపురీవ ఖే ।**
**రశ్మ్యంబువత్స్ఫురద్రూపే స్థాణౌ చోరవదక్రియే ॥29॥**

**అసత్కల్ప మిదం విశ్వ మాత్మ న్యారోప్యతే భ్రమాత్ ।**

యథా = ఎట్లు, ఏకస్మిన్ = ఒక్కడే ఐయుండు వానియందు, జలచంద్రవత్ = నీటిలో (అనేకముగ కనిపించు) చంద్రుని వలె, నిర్భయే= భయకారణము కాని వానియందు, రజ్జుసర్పవత్ = త్రాటిలో (భయోత్పాదకమై కనిపించు) పామువలె, కారణే = కారణమైన, స్వర్ణే= బంగారులో, కటకాదివత్ = (కార్యమైన) కడియము మున్నగు వానివలె, ఉపాత్తే = ఉన్న, శుక్తౌ = ముత్తెపు చిప్పలో, రూప్యవత్ = (లేని) వెండివలె, వ్యాప్తే = సర్వ వ్యాపియగు, ఖే = ఆకాశమున, యక్షపురీ ఇవ = (ఏక దేశ వ్యాపియగు) యక్ష నగరమువలె, స్ఫురద్రూపే = మహా ప్రకాశ స్వరూపుడగు సూర్యుని ప్రకాశమున, రశ్మ్యంబువత్ = (అభాస్వచ్ఛక్ల రూపమగు) మరీచికవలె, అక్రియే = నిష్క్రియమైన, స్థాణౌ = మోటు మానులో, చోరవత్ = (క్రియావిశిష్టుడగు) దొంగవలె, ప్రతీయతే = జ్ఞానము కలుగుచున్నదో అట్లే, ఆత్మని = ఆత్మయందు, అసత్కల్పం = సత్తారహితమైనట్లు ఉన్న, ఇదం = ఈ, విశ్వం = జగత్తు, భ్రమాత్ = భ్రాంతి వలన, ఆరోప్యతే = ఆరోపింపబడుచున్నది.

భ్రాంతిచే నొక్కడే యైయున్న చంద్రుడు నీటిలో ననేకముగ, భయకారణము కాని త్రాడు భయోత్పాదక సర్పముగ, కారణమైన బంగారు కార్యమైన కడియము మున్నగువానిగ, ఉన్న ముత్తెపుచిప్ప లేని వెండిగ, సర్వవ్యాపి యగు నాకాశము ఏక దేశవర్తి యక్షనగరముగ,



మహాప్రకాశమగు సూర్యుని వెలుగు ప్రకాశములేని ఎండమావులుగ, నిష్క్రియమైన మోటుమాను క్రియావిశిష్టుడగు దొంగగ కనుపించునట్లు సత్స్వరూపుడగు నాత్మయందు సత్తారహితమైనట్లున్న యీ జగత్తు ఆరోపితమై కనబడుచున్నది.

**స్వయం ప్రకాశం సద్రూపం భ్రాంతి బాధా వివర్జితమ్ ॥30॥**

**ప్రత్యభిజ్ఞాయతే వస్తు ప్రాగ్వన్మోహే వ్యపోహితే ।**
**దేహాద్యుపాధౌ నిర్ధూతే స్యాదాత్మైవ మహేశ్వరః ॥31॥**

మోహే = అజ్ఞానము, వ్యపోహితే = నాశముకాగా, ప్రాగ్వత్ = మునుపటివలె, స్వయంప్రకాశం = తానే ప్రకాశించుచున్న, సద్రూపం= ఉనికియే ఐన, భ్రాంతి బాధావివర్జితం = భ్రమ, నివారణ రెండులేని, వస్తు = పరబ్రహ్మ తత్త్వము, ప్రత్యభిజ్ఞాయతే = గుర్తుపట్టబడుచున్నది, దేహద్యుపాధౌ = శరీరము మున్నగు ఉపాధి, నిర్ధూతే = తీసివేయ బడగా, ఆత్మా ఏవ = ఆత్మయే, మహేశ్వరః = పరమేశ్వరుడు, స్యాత్= అగును.

అజ్ఞానము నశింప పూర్వము వలె స్వయం ప్రకాశమైన యునికియే యగు భ్రమ, నివారణ రెండూ లేని పరబ్రహ్మ తత్త్వము నేనే యది యని గుర్తింపబడును. దేహాద్యుపాధులను తొలగింప నాత్మయే పరమేశ్వరుడగును.

**స్మృతిః ప్రత్యక్ష మైతిహ్యమిత్యాదీ న్యపరాణ్యపి ।**
**ప్రమాణాన్యాప్తవాగాహ ప్రత్యభిజ్ఞా ప్రసిద్ధయే ॥32॥**

ఆప్తవాక్ = వేదవాక్కు, ప్రత్యభిజ్ఞా ప్రసిద్ధయే = ప్రత్యభిజ్ఞను చక్కగ సాధించుటకై, స్మృతిః = స్మృతి, ప్రత్యక్షం = సాక్షాత్కారము, ఐతిహ్యం = పరంపరగా లభించిన యాచార్యోపదేశము, ఇత్యాదీని = ఇవి మొదలగు, అపరాణి ప్రమాణాని అపి = ఇతర ప్రమాణములను కూడ, ఆహ = చెప్పెను.

వేదవాక్య మీ ప్రత్యభిజ్ఞను బాగుగా సాధించుటకై స్మృతి సాక్షాత్కార పరంపరాగతోపదేశాది ఇతర ప్రమాణములను కూడ చెప్పెను.

**ఇతి శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకే ।**
**ప్రబంధే మానసోల్లాసే సప్తమోల్లాస సంగ్రహః ॥33॥**

ఇట్లు శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థమును వివరించు మానసోల్లాసమను కృతియందు సంక్షిప్తమగు సప్తమోల్లాసము.



## అష్టమోల్లాసః

**విశ్వం పశ్యతి కార్యకారణతయా స్వస్వామి సంబంధతః**
**శిష్యాచార్యతయా తథైవ పితృపుత్రాద్యాత్మనా భేదతః ।**
**స్వప్నే జాగ్రతి వా య ఏష పురుషో మాయాపరిభ్రామితః**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥8॥**

యః = ఏ, ఏషః = ఈ, పురుషః = ఆత్మ, స్వప్నే = కలలో, వా = మఱియు, జాగ్రతి = మెలకువలో, మాయాపరిభ్రామితః = మాయా భ్రాంతికి చిక్కి, విశ్వం = జగత్తును, కార్యకారణతయా = కార్యకారణములుగ, స్వస్వామి సంబంధతః = తాను, ప్రభువు అను సంబంధము గలదిగ, శిష్యాచార్యతయా = శిష్యుడు, గురువు అను రూపముగ, తథా ఏవ = అట్లే, పితృ పుత్రాద్యాత్మనా = తండ్రి, కొడుకు మున్నగు రూపముగ, భేదతః = (తనకంటె) వేరుగ, పశ్యతి = చూచుచున్నాడో, తస్మై = ఆ, శ్రీగురుమూర్తయే = శ్రీగురుస్వరూపుడగు, శ్రీ శ్రీదక్షిణామూర్తయే = శ్రీదక్షిణామూర్తికి, ఇదం = ఈ, నమః = నమస్కారము.

ఏ ఈ పరమాత్మయే జాగ్రత్స్వప్నావస్థల యందు మాయాభ్రాంతిచే జగత్తును కార్య కారణ, స్వామిభృత్య, గురుశిష్య, పితృపుత్రాది రూపములతో తనకంటె వేరుగా నున్నదని తెలియుచున్నాడో ఆ శ్రీగురుస్వరూపుడగు శ్రీదక్షిణామూర్తికి నమస్కారము.

మానసోల్లాసః

**ప్రకాశవ్యతిరేకేణ పదార్థః కోఽపి నాస్తి చేత్ ।**
**పరమార్థోపదేశాంతో వ్యవహారః కథం భవేత్ ॥1॥**

ప్రకాశవ్యతిరేకేణ = ప్రకాశమును విడిచి, కః అపి పదార్థః = ఏ వస్తువు కూడా, న అస్తి చేత్ = లేనియెడల, పరమార్థోపదేశాంతః = బ్రహ్మతత్త్వోపదేశము వఱకు గల , వ్యవహారః = వ్యవహారము, కథం = ఎట్లు భవేత్ = అగును?

ప్రకాశము తప్ప వేరే ఏ పదార్థము లేనిచో తత్త్వోపదేశ పర్యంతముగల వ్యవహారమంతయు ఎట్లు నడచును?

**కస్య బంధశ్చ మోక్షశ్చ బధ్యతే కేన హేతునా ।**
**మాయాయా లక్షణం కిం స్యాదిత్యేవం పరిపృచ్ఛతః ॥2॥**

**ప్రశ్నఃస్యాదుత్తరం వక్తుం ప్రతిపత్తుం సుఖేన చ ।**
**ఉక్తోఽర్థః సప్తభిః శ్లోకైః పునః సంగృహ్య కథ్యతే ॥3॥**

బంధః = బంధము, చ = మఱియు, మోక్షః = విడుపు, కస్య= ఎవనికి, చ = మఱియు, కేన హేతునా = ఏ కారణముచే, బధ్యతే = కట్టబడుచున్నాడు, మాయాయాః = మాయయొక్క, లక్షణం = నిష్కర్షకమైన ధర్మము, కిం = ఏమి, స్యాత్ = అయియుండును, ఇతి ఏవం = ఇట్లని, పరిపృచ్ఛతః = అడుగుచున్నవాని, ప్రశ్నః = ప్రశ్న, స్యాత్ = అయినచో దానికి, ఉత్తరం = ఉత్తరమును, వక్తుం = చెప్పుటకు, చ = మఱియు, సుఖేన = సులభముగా, ప్రతిపత్తుం = తెలిసికొనుటకు, సప్తభిఃశ్లోకైః = ఏడు శ్లోకములచే, ఉక్తః అర్థః = చెప్పబడిన విషయము,



పునః = తిరుగ, సంగృహ్య = సంగ్రహించి, కథ్యతే = చెప్పబడుచున్నది.

బంధము, మోక్షము ఎవనికి? ఏ కారణముచే బంధము కలుగును? మాయాలక్షణ మేమి? అను ప్రశ్నలకు ఉత్తరము చెప్పుటకు, విషయమును సులభముగా తెలిసికొన్నుటకును వెనుకటి ఏడు శ్లోకములలో చెప్పిన విషయమే సంక్షేపముగా పునః చెప్పబడుచున్నది.

**పౌనరుక్త్యం న దోషోఽత్ర శబ్దేనార్థేన వా భవేత్ ।**
**అభ్యాసేన గరీయస్త్వ మర్థస్య ప్రతిపాద్యతే ॥4॥**

అత్ర = ఇచ్చట, శబ్దేన = శబ్దముచే, వా = అథవా, అర్థేన = అర్థముచే, పౌనరుక్త్యం = చెప్పినదే చెప్పుట, దోషః = దోషము, న భవేత్ = కాదు, అభ్యాసేన = పునః పునః చెప్పుటచే, అర్థస్య = విషయము యొక్క, గరీయస్త్వం = గొప్పతనము, ప్రతిపాద్యతే = చూపబడుచున్నది.

ఈ విషయమున శబ్దము లేదా అర్థముచే చెప్పినదే చెప్పుట దోషము కాజాలదు. పునః పునః చెప్పుట విషయ గౌరవమును సూచించును.

**స్వయంప్రకాశే సద్రూపేఽప్యేకస్మిన్పరమేశ్వరే ।**
**కార్యకారణ సంబంధాద్యనేకవిధకల్పనా ॥5॥**

**రాహోః శిరఃసుషిః ఖస్య మమాత్మా ప్రతిమావపుః ।**
**ఇత్యాది కల్పనాతుల్యా న పృథగ్వస్తు గోచరా ॥6॥**

స్వయంప్రకాశే = తానుగనే ప్రకాశించు, సద్రూపే = ఉనికియే అగు, అపి = మఱియు, ఏకస్మిన్ = ఒక్కడే అగు, పరమేశ్వరే =

పరమాత్మ యందు, కార్యకారణసంబంధాద్యనేకవిధకల్పనా = కార్యకారణ సంబంధాది బహు విధ కల్పన, రాహోః శిరః = రాహువుయొక్క తల, ఖస్య సుషిః = ఆకాశమునకు రంధ్రము, మమ ఆత్మా = నా ఆత్మ, ప్రతిమావపుః = ప్రతిమ శరీరము, ఇత్యాది కల్పనాతుల్యా = మొదలగు కల్పనలవలె, పృథగ్వస్తు గోచరా = (వాస్తవముగ) వేర్వేరు వస్తువులు కన్పించుట, న = కాదు.

స్వయముగనే ప్రకాశించు, ఉనికియే అయిన మఱియు ఒక్కడే అయిన పరమాత్మయందు కార్యకారణ సంబంధాది నానావిధ కల్పన వాస్తవముగా వేర్వేరు వస్తువులు కనబడని రాహువుయొక్క శిరస్సు, ఆకాశ రంధ్రము, నా యాత్మ, ప్రతిమాశరీరము ఇత్యాది కల్పనల వంటిది.

**ఉపాస్యోపాసకత్వేన గురుశిష్య క్రమేణ చ ।**
**స్వామిభృత్యాదిరూపేణ క్రీడతి స్వేచ్ఛయేశ్వరః ॥7॥**

ఈశ్వరః = పరమాత్మ, స్వేచ్ఛయా = తన ఇచ్ఛచేతనే, ఉపాస్యోపాసకత్వేన = ఉపాసనకు విషయమైనది, ఉపాసన చేయువాడు అను భావముచే, చ = మఱియు, గురుశిష్యక్రమేణ = గురువు, శిష్యుడు అనురీతిగ, స్వామిభృత్యాది రూపేణ = ప్రభువు, సేవకుడు ఇత్యాది రూపముగ, క్రీడతి = విహరించుచున్నాడు.

పరమేశ్వరుడు ఉపాస్యోపాసక భావముతో, గురుశిష్య, స్వామి భృత్యాది రూపముతో తన ఇచ్ఛ చేతనే క్రీడించుచున్నాడు.



**పితరం ప్రతి పుత్రో యః పుత్రం ప్రతి పితైవ సః ।**
**ఏక ఏవ హి నానేవ కల్ప్యతే శబ్దమాత్రతః ॥8॥**

యః = ఎవడు, పితరంప్రతి = తండ్రికి, పుత్రః = కొడుకో, సః ఏవ = వాడే, పుత్రం ప్రతి = కొడుకుకు, పితా = తండ్రి, ఏకః ఏవ = ఒక్కడే, శబ్దమాత్రతః = నామమాత్రమువలన, నానా ఇవ = అనేకులవలె, కల్ప్యతే = కల్పింప బడుచున్నాడు.

తండ్రికి కొడుకైనవాడే తన కొడుకుకు తండ్రి. ఒక్కడే నామమాత్ర భేదముచే అనేకులవలె కల్పనకు గోచరమగుచున్నాడు.

**తస్మాత్ప్రకాశ ఏవాస్తి పరమార్థనిరూపణే ।**
**భేదప్రతీతిర్మిథ్యైవ మాయయాత్మని కల్పితా ॥9॥**

తస్మాత్ = అందువలన, పరమార్థనిరూపణే = యథార్థ విచారణ చేయునపుడు, ప్రకాశః ఏవ = ప్రకాశమొకటే, అస్తి = ఉన్నది, భేదప్రతీతిః= భేదజ్ఞానము, మిథ్యా ఏవ = అసత్యమే, (అది) ఆత్మని = పరమాత్మ విషయమున, మాయయా = మాయచే, కల్పితా = కల్పితమైనది.

కావున పరమార్థ విచారణ సల్పునపుడు ప్రకాశమొక్కటే ఉండునది. భేదజ్ఞానము మిథ్య. పరమాత్మయందు మాయచే భేదప్రతీతి కల్పింపబడినది.

**మిథ్యాత్వం నామ బాధ్యత్వం సమ్యక్ జ్ఞానోదయే సతి ।**
**శిష్యాచార్యోపదేశాది స్వప్నవత్ప్రతిభాసతే ॥10॥**

మిథ్యాత్వం నామ = అసత్యముగ నుండుట అనునది, బాధ్యత్వం= జ్ఞానానంతరము నివారింపబడునది, సమ్యక్ జ్ఞానోదయే సతి = చక్కగ జ్ఞానము కలిగిన తరువాత, శిష్యాచార్యోపదేశాది = శిష్యుడు, గురువు, ఉపదేశము మున్నగు వ్యవహారమంతయు, స్వప్నవత్= కలవలె. ప్రతిభాసతే = కన్పట్టును.

జ్ఞానానంతర నివారణకు లోనగునది అసత్యము. సమ్యక్ జ్ఞానము కల్గిన పిదప గురుశిష్యోపదేశాది వ్యవహార మంతయు కలవలె కన్పించును.

**మిథ్యాభూతోఽపి వేదాంతః సత్యమర్థం ప్రబోధయేత్ ।**
**దేవతా ప్రతిమావచ్చ చిత్రవత్ ప్రతి బింబవత్ ॥11॥**

వేదాంతః = వేదాంతము, మిథ్యాభూతః అపి = మిథ్యయైనను, దేవతా ప్రతిమావత్ = దేవతా విగ్రహమువలె, చిత్రవత్ = చిత్రమువలె, ప్రతిబింబవత్ = ప్రతిబింబమువలె, సత్యం = సత్యమైన, అర్థం = విషయమును, ప్రబోధయేత్ = తెలుపును.

వేదాంతము మిథ్యయైనను దేవతా విగ్రహమువలె, చిత్రమువలె, ప్రతిబింబమువలె సత్య విషయమునే ప్రబోధించును.

**సర్వోఽపి వ్యవహారోఽయం మాయాయాః పరిజృంభణమ్ ।**
**సుషుప్తిసదృశీ మాయా స్వప్రబోధేన బాధ్యతే ॥12॥**

అయం వ్యవహారః = ఈ వ్యవహారము, సర్వః అపి = అంతయును, మాయాయాః = మాయయొక్క, పరిజృంభణం = విజృంభణము, సుషుప్తి సదృశీ = నిద్రవలెనుండు, మాయా = మాయ,



స్వప్రబోధేన = ఆత్మజ్ఞానముచే బాధ్యతే = నివారింపబడుచున్నది.

ఈ వ్యవహారమంతయు కూడ మాయా విజృంభణము, నిద్రవలె నుండు మాయ ఆత్మజ్ఞానముచే నివారింపబడును.

**యుక్తిహీనప్రకాశస్య సంజ్ఞా మాయేతి కథ్యతే ।**
**నాసతీ దృశ్యమానా సా బాధ్యమానా న వా సతీ ॥13॥**

యుక్తిహీనప్రకాశస్య = విచారణకు చిక్కని ప్రకాశమునకు, సంజ్ఞా = పేరు, మాయా ఇతి = మాయ అని, కథ్యతే = చెప్పబడుచున్నది, సా = అది, దృశ్యమానా = కనబడుచున్నది కాన, అసతీ = లేనిది, న = కాదు, వా = మఱియు, బాధ్యమానా = నివారింపబడుచున్నది. కాన, సతీ = ఉన్నది, న = కాదు.

మాయ అనగ విచారణకు చిక్కని ప్రకాశము కనుపించుటచే అది లేనిది కాదు, నివారింపబడుటచే ఉన్నదియును కాదు.

**న ప్రకాశాదియంభిన్నా ఛాయేవార్కస్య తామసీ ।**
**అభిన్నా చ జడత్వేన విరోధాన్నోభయాత్మికా ॥14॥**

ఇయం = ఇది, అర్కస్య = సూర్యుని, తామసీ = నల్లని, ఛాయాఇవ = నీడవలె, ప్రకాశాత్ = ప్రకాశముకంటె, న భిన్నా = వేరుకాదు, జడత్వేన = అచేతనమగుటచే, అభిన్నా = వేరుకానిది, న = కాదు, విరోధాత్ = పరస్పర విరోధమగుటవలన, ఉభయాత్మికా = (భేదాభేదముల) రెంటితో కూడినది, న = కాదు.

ఈ మాయ నల్లని నీడ వెలుగుకంటె వేరైనట్లు వేరైనదియు

కాదు. జడమగుటచే వేరు కానిదియు కాదు. ఈరెండూ పరస్పర విరుద్ధము లగుటచే రెంటితో కూడినదియును కాదు.

**స్వహేత్వవయవాభావాన్నేయం సావయవోచ్యతే ।**
**న చావయవహీనా సా కార్యేష్వవయవాన్వితా ॥15॥**

ఇయం = ఇది, స్వహేత్వవయవాభావాత్ = తనకు కారణమైన అవయవములు లేనందువలన, సావయవా = అవయవములు గలదని, న ఉచ్యతే = చెప్పబడుట లేదు, కార్యేషు = (తన) కార్యములయందు, అవయవాన్వితా = అవయవములతో కూడియున్నందువలన, అవయవహీనా = అవయవములు లేనిదనియు, న = (చెప్పబడుట) లేదు.

తనకు కారణమైన అవయవములు లేనందున ఈ మాయ సావయవయనిగాని, తన కార్యములయందు అవయవములున్నందున నిరవయవయని గాని చెప్పుటకు వీలులేదు.

**అవిచారిత సిద్ధేయం మాయావేశ్యావిలాసినీ ।**
**పురుషం వంచయత్యేవ మిథ్యాభూతైః స్వవిభ్రమైః ॥16॥**

అవిచారితసిద్ధా = అజ్ఞానావస్థ యందు మాత్రము కనుపించు, ఇయం = ఈ, మాయా వేశ్యావిలాసినీ = మాయయను విలాసముతో కూడిన వేశ్య, మిథ్యాభూతైః = అసత్యములగు, స్వవిభ్రమైః = తన లీలలచే, పురుషం = ఆత్మను వంచయతి = మోసగించుచున్నది.

అజ్ఞాన దశలో మాత్రము కన్పించు ఈ మాయావేశ్యా స్త్రీ తన అసత్య లీలలచే ఆత్మను, మోహింప జేయుచున్నది.



**న తస్యా మూలవిచ్ఛేదమభివాంఛంతి కేచన ।**
**తేషాం పక్షే కథం మోక్షో మనసః సంభవిష్యతి ॥17॥**

కేచన = కొందఱు, తస్యాః = ఆ మాయ యొక్క, మూలవిచ్ఛేదం= వేరు నరకుటను, న అభివాంఛంతి = ఇష్టపడుటలేదు, తేషాం పక్షే = వారి మతమున, మనసః మోక్షః = మనస్సునుండి విడుదల, కథం = ఎట్లు, సంభవిష్యతి = కలుగగలదు?

కొందఱు ఆ మాయయొక్క మూలచ్ఛేదమును ఇష్టపడుట లేదు. వారి మతములో మనస్సు నుండి విడుదల ఎట్లు కాగలదు?

**తిస్రోఽప్యవస్థా మనసో జాగ్రత్స్వప్న సుషుప్తయః ।**
**చక్రవత్పరివర్తంతే భేదభ్రాంత్యేకహేతవః ॥18॥**

జాగ్రత్స్వప్న సుషుప్తయః = మెలకువ, కల నిద్ర, అను, మనసః=మనసు యొక్క, తిస్రః అవస్థాః అపి = మూడు అవస్థలును, భేదభ్రాంత్యేకహేతవః = భేదమగు అజ్ఞానమునకు ముఖ్య కారణములై, చక్రవత్ = చక్రమువలె, పరివర్తంతే = తిరుగుచున్నవి.

జాగ్రత్స్వప్నసుషుప్తులను మనస్సుయొక్క మూడు అవస్థలు కూడ, భేదభ్రాంతికి ముఖ్య కారణములై చక్రమువలె తిరుగుచున్నవి.

**తాభిః కరోతి కర్మాణి పునస్తైర్బధ్యతే మనః ।**
**మనసః కేవలః సాక్షీ భానువత్పురుషః పరః ॥19॥**

మనః = మనస్సు, తాభిః = వానిచే, కర్మాణి = పనులను, కరోతి = చేయుచున్నది, పునః = మరల, తైఃఏవ = ఆ కర్మలచేతనే,

బధ్యతే = కట్టబడుచున్నది, పరః పురుషః = పరమాత్మ, భానువత్ = సూర్యునివలె, మనః = మనస్సు యొక్క, కేవలః = వట్టి ( సంబంధమును లేని), సాక్షీ = చూచువాడు.

మనస్సు ఆ భ్రాంతులచే పనులను చేయుచున్నది మఱియు ఆ పనులచేతనే బంధింపబడుచున్నది. పరమాత్మ సూర్యుని వలె మనసు యొక్క ఏ సంబంధమును లేని సాక్షి మాత్రమే.

**యథా ప్రాణికృతైరర్కః కర్మభిర్నైవ బధ్యతే ।**
**తథా మనఃకృతైరాత్మా సాక్షిత్వాన్నైవ బధ్యతే ॥20॥**

యథా = ఎట్లు, అర్కః = సూర్యుడు, ప్రాణికృతైః = ప్రాణులచే చేయబడిన, కర్మభిః = పనులచే, న ఏవ బధ్యతే = కట్టబడుటలేదో, తథా = అట్లే, ఆత్మ = ఆత్మ, సాక్షిత్వాత్ = సాక్షియగుటవలన, న ఏవ బధ్యతే = కట్టబడుట లేదు.

సూర్యుడు ప్రాణుల కర్మలచే బంధింపబడనట్లే సాక్షిమాత్రుడగుట వలన ఆత్మ మనస్సుయొక్క కార్యములచే బంధింపబడదు.

**ఆత్మా కరోతి కర్మాణి బధ్యతే ముచ్యతే చ తైః ।**
**ఇత్యౌపచారికీ క్లృప్తి ర్భ్రమమాత్రైవ కేవలమ్ ॥21॥**

ఆత్మా = ఆత్మ, కర్మాణి = పనులను, కరోతి = చేయుచున్నాడు, చ = మఱియు, తైః = వానిచే, బధ్యతే = కట్టబడుచున్నాడు, ముచ్యతే= విడువబడుచున్నాడు, ఇతి = అను, క్లృప్తిః = కల్పన, ఔపచారికీ = వ్యవహారమునకు మాత్రము చేరినది (నిజమునకు), కేవలం = వట్టి, భ్రమమాత్రా ఏవ = భ్రాంతియే.



ఆత్మ పనులను చేయుచున్నాడు. ఆ పనులచే బంధమును, విడుదలను పొందుచున్నాడు అను కల్పన ఔపచారికము మాత్రమే. నిజమునకు ఇట్టి జ్ఞానము వట్టి భ్రాంతియే.

**ధూమాభ్రధూలీ నీహారై రస్పృష్టోఽపి దివాకరః ।**
**యథా ఛన్న ఇవాభాతి తథైవాత్మాపి మాయయా ॥22॥**

యథా = ఎట్లు, దివాకరః = సూర్యుడు, ధూమాభ్రధూలీనీహారైః= పొగ మబ్బు దుమ్ము మంచులచే, అస్పృష్టః అపి = తాకబడకున్నను, ఛన్నః ఇవ = కప్పబడినవాడువలె, ఆభాతి = కనుపించునో, ఆత్మా అపి= ఆత్మ కూడ, మాయయా = మాయచే, తథా ఏవ = అట్లె.

సూర్యుడు పొగమబ్బు దుమ్ము మంచులచే తాకబడకున్నను కప్పబడినవాడువలె కనుపించునట్లె ఆత్మకూడా మాయచే స్పృశింపబడకున్నను కప్పబడినట్లు కనుపించును.

**యథా లీలావశాత్కశ్చిద్భ్రమమాణః కుమారకః ।**
**భ్రమత్తత్పశ్యతి జగచ్ఛతచంద్రం నభస్థలమ్ ॥23॥**

**తథైవ మాయయా జీవో భ్రామితో వాసనావశాత్ ।**
**నానాకారమిదం విశ్వం భ్రమమాణం చ పశ్యతి ॥24॥**

యథా = ఎట్లు, లీలావశాత్ = ఆటకొఱకు, భ్రమమాణః = తిరుగుచున్న, కశ్చిత్ = ఒకానొక, కుమారకః = పిల్లవాడు, తత్ = ఆ,

జగత్ = ప్రపంచమును, భ్రమత్ = తిరుగుచున్నట్లు, చ = మఱియు, నభః స్థలం = ఆకాశమును, శతచంద్రం = నూరుగురు చంద్రులున్నదిగా, పశ్యతి = చూచునో, తథా ఏవ = అట్లే, జీవః = జీవుడు, వాసనావశాత్ = సంస్కారమువలన, భ్రామితః = భ్రాంతిజెంది, ఇదం విశ్వం = ఈ ప్రపంచమును, నానాకారం = అనేక రూపములుగలది, చ = మఱియు, భ్రమమాణం = తిరుగుచున్నట్లు, పశ్యతి = చూచుచున్నాడు.

ఆటకొఅకు తిరుగుచున్న బాలుడు ప్రపంచమును తిరుగుచున్నట్లు, ఆకాశమున నూర్గురు చంద్రులున్నట్లు ఎట్లు చూచునో, అట్లె సంస్కారము వలన భ్రాంతిజెందిన జీవుడు ఈ ప్రపంచమును బహురూపముగను, తిరుగుచున్నట్లును గాంచుచున్నాడు.

**సంసృజ్య మనసా దేవః సంసరన్నివ లక్ష్యతే ।**
**యథార్కో జలసంసర్గాచ్చలన్నానేవ లక్ష్యతే ॥25॥**

యథా = ఎట్లు, జలసంసర్గాత్ = నీటి సంబంధము వలన, అర్కః = సూర్యుడు, చలన్ = చలించుచున్నవాడుగ, నానా ఇవ = అనేకముగా నున్నట్లు, లక్ష్యతే = కనుపించునో, అట్లె దేవః = పరమాత్మ, మనసా = మనస్సుతో, సంసృజ్య = సంపర్కమును పొంది, సంసరన్ ఇవ = సంసారివలె, లక్ష్యతే = కనుపించుచున్నాడు.

నీటిలో ప్రతిబింబించిన సూర్యుడు చలించుచున్నట్లు, అనేకముగనున్నట్లు ఎట్లు కనుపించునో, అట్లె మనస్సంబంధముచే పరమేశ్వరుడు సంసారివలె కనుపించును.



**యోగాభ్యాసవశాద్యేన మనో నిర్విషయం కృతమ్ ।**
**నివృత్తః స పుమాన్సద్యో జీవన్ముక్తో భవిష్యతి ॥26॥**

యేన = ఎవనిచే, యోగాభ్యాసవశాత్ = యోగాభ్యాసము వలన, మనః = మనస్సు, నిర్విషయం = వృత్తిరహితముగ, కృతం = చేయబడినదో, సః = ఆ, పుమాన్ = మనుష్యుడు, నివృత్తః = నివృత్తిగలవాడై, జీవన్ముక్తః = జీవన్ముక్తుడు, భవిష్యతి = కాగలడు.

యోగాభ్యాసముచే మనస్సును వృత్తిరహిత మొనర్చుకొనినవాడు లోకవ్యవహారమునుండి నివృత్తుడై జీవన్ముక్తుడగును.

**ద్వా సువర్ణౌ చ సయుజావభవన్మాయయా శివః ।**
**అజామేకాం జుషన్నేకో నానేవాసీదితి శ్రుతిః ॥ 27**

శివః = శివుడు, మాయయా = మాయచే, సయుజౌ = కలసియున్న, ద్వౌ = రెండు, సుపర్ణౌ = పక్షులుగ, అభవత్ = ఆయెను, ఏకాం = ఒక, అజాం = మాయను, జుషన్ = సేవించుచు, ఏకః = ఒకడే, నానా ఇవ = అనేకులవలె, ఆసీత్ = ఆయెను, ఇతి = అని, శ్రుతిః = వేదము.

శివుడు మాయచే కలిసియున్న రెండు పక్షులయ్యెను. ప్రకృతిని అనుభవించుచు ఒక్కడే అనేకులవలె ఆయెనని వేదము చెప్పుచున్నది.

**ఇతి శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకే ।**
**ప్రబంధే మానసోల్లాసే అష్టమోల్లాస సంగ్రహః ॥28॥**

ఇతి = ఇట్లు, శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకే = శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థమును వివరించు, మానసోల్లాసే = మానసోల్లాసమను, ప్రబంధే = కృతియందు, అష్టమోల్లాస సంగ్రహః= సంగ్రహమగు ఎనిమిదవ ఉల్లాసము.

ఇట్లు శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థమును వివరించు మానసోల్లాసమను కృతియందు సంగ్రహమగు అష్టమోల్లాసము.

హరిః ఓం తత్సత్



## నవమోల్లాసః

**భూరంభాంస్యనలో౽నిలో౽ంబరమహర్నాథో హిమాంశుః పుమాన్**
**ఇత్యాభాతి చరాచరాత్మక మిదం యస్యైవ మూర్త్యష్టకమ్ ।**
**నాన్యత్కించ నవిద్యతే విమృశతాం యస్మాత్పరస్మాద్విభోః**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 9 ॥**

భూః = భూమి, అంభాంసి = నీరు, అనలః = అగ్ని, అనిలః= గాలి, అంబరం = ఆకాశము,అహర్నాథః=సూర్యుడు, హిమాంశుః = చంద్రుడు, పుమాన్ = పురుషుడు, ఇతి = అను, చరాచరాత్మకం = జంగమ స్థావరరూపమగు, ఇదం = ఇది, యస్య = ఎవని, మూర్త్యష్టకం ఏవ = ఎనిమిది మూర్తులుగానే, ఆభాతి = ప్రకాశించుచున్నదో, విమృశతాం = విమర్శించువారికి, విభోః = సర్వవ్యాపియు అగు, యస్మాత్ పరస్మాత్ = పరుడైన ఎవనికంటే, అన్యత్ = వేరు, కించన= ఏదియు, నవిద్యతే = ఉండదో, తస్మై = ఆ, శ్రీగురుమూర్తయే = శ్రీగురు స్వరూపుడగు, శ్రీదక్షిణామూర్తయే = శ్రీదక్షిణామూర్తికి, ఇదం= ఈ, నమః = నమస్కారము.

భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, సూర్యచంద్రులు, పురుషుడు (చైతన్యము) అని కనబడు ఈ చరాచర ప్రపంచము విమర్శించువారికి ఎవని అష్టమూర్తులుగా, ప్రకాశించుచున్నవో, విమర్శించువారికి అత్యంత శ్రేష్ఠము, సర్వవ్యాపియు ఐన ఎవనికంటే వేరైనది ఏదియు కన్పించుట లేదో ఆ గురు స్వరూపుడగు శ్రీదక్షిణామూర్తికి నమస్కారము.

## మానసోల్లాసః - 9

**కథమేవం విధా మాయా నివర్తేతేతి పృచ్ఛతః ।**
**ఈశ్వరోపాసనారూప స్తదుపాయః ప్రకీర్త్యతే ॥1॥**

ఏవం విధా = ఈరీతియగు, మాయా = మాయ, కథం = ఎట్లు, నివర్తేత = నివర్తించును, ఇతి = అని, పృచ్ఛతః = అడుగువానికి, ఈశ్వరోపాసనారూపః = ఈశ్వరధ్యానరూపమగు, తదుపాయః = దానిసాధన, ప్రకీర్త్యతే = చెప్పబడుచున్నది.

ఇట్టి (వెనుక చెప్పిన) మాయ ఎట్లు నివర్తిల్లునని ప్రశ్నించువానికి ఈశ్వరధాన్యరూప సాధన మాయానివర్తకమని చెప్పబడుచున్నది.

**షట్త్రింశత్తత్త్వరూపాసు పరమేశ్వరమూర్తిషు ।**
**ప్రత్యక్షేణోపలభ్యంతే సర్వైరప్యష్టమూర్తయః ॥2॥**

షట్త్రింశత్తత్త్వరూపాసు = ముప్పదియారు తత్త్వముల రూపముగల, పరమేశ్వరమూర్తిషు = పరమేశ్వరుని మూర్తులయందు, సర్వైః అపి = ఎల్లరచేతను, అష్టమూర్తయః = ఎనిమిది మూర్తులు, ప్రత్యక్షేణ = ప్రత్యక్షముగ, ఉపలభ్యంతే = తెలియబడుచున్నవి.

ముప్పది ఆరు తత్త్వరూప పరమేశ్వరమూర్తులలో ఎనిమిది మూర్తులు ఎల్లరకు ప్రత్యక్షముగ తెలియుచున్నవి.

**అమేయాసు మనః క్షిప్రమారోఢుం నార్హతీత్యతః ।**
**మూర్త్యష్టకమయీం బ్రూతే గురుః సర్వాత్మభావనామ్ ॥3॥**

మనః = మనస్సు, అమేయాసు = కొలతకు చిక్కనివానియందు,



క్షిప్రం = వెంటనే, ఆరోఢుం = ఎక్కుటకు, న అర్హతి = సాధ్యము కాదు, ఇతి అతః = అందువలన, గురుః = గురువు, మూర్త్యష్టకమయీం = అష్టమూర్తిరూపమగు, సర్వాత్మభావనాం = సర్వాత్మయగు ఈశ్వరుని ధ్యానమును, బ్రూతే = చెప్పుచున్నాడు.

ప్రమాణగోచరము కాని విషయములలో వెంటనే ఎక్కుటకు మనస్సుకు అసాధ్యము. కావున గురువు సర్వాత్మయగు ఈశ్వరుని అష్టమూర్తి రూపధ్యానము నుపదేశించుచున్నాడు.

**విరాట్ఛరీరే బ్రహ్మాండే ప్రాణినామపి విగ్రహే ।**
**షట్త్రింశత్తత్త్వసంఘాతః సర్వత్రాప్యనువర్తతే ॥4॥**

విరాట్ఛరీరే = విరాట్ శరీరమైన, బ్రహ్మాండే = బ్రహ్మాండమున, ప్రాణినాం = ప్రాణుల, విగ్రహే అపి = దేహమునకూడ, షట్త్రింశత్తత్త్వ సంఘాతః = ముప్పదియారు తత్త్వముల సమూహము, సర్వత్ర అపి = అన్నిచోట్లను, అనువర్తతే = ఉండియే ఉన్నది.

మహేశ్వరుని శరీరమగు బ్రహ్మాండములోను, ప్రాణుల దేహములోను ముప్పది ఆరు తత్త్వముల సమూహము ఉండియున్నది.

**వ్యాప్తిర్వ్యష్టిశరీరేఽస్మి న్మనసో వ్యష్టిరూపిణః ।**
**తస్మాత్సర్వాత్మకమిదం స్వశరీరం విచింతయేత్ ॥ 5**

వ్యష్టిరూపిణః = వ్యష్టిరూపమగు, మనసః = మనస్సుయొక్క, వ్యాప్తిః = వ్యాప్తి, అస్మిన్ = ఈ, వ్యష్టిశరీరే = వ్యష్టిశరీరమున (మాత్రము), తస్మాత్ = అందువలన, సర్వాత్మకం = ఈశ్వరాత్మకమగు, ఇదం =

ఈ జగత్తును, స్వశరీరం = తన (సాధకుని) శరీరమని, విచింతయేత్= చింతన చేయవలెను.

వ్యష్టిరూపమైన మనస్సుయొక్క వ్యాప్తి ఈ వ్యష్టి శరీరములో మాత్రమే. కావున ఈశ్వరాత్మకమైన ఈ జగత్తునే తన శరీరముగ తలచవలెను.

**వ్యష్ట్యుపాసనయా పుంసః సమష్టి వ్యాప్తిమాప్నుయాత్ ।**
**ఉపసంక్రామతీత్యేవం దశకృత్వ ఉపాదిశత్ ॥6॥**

పుంసః = జీవుని, వ్యష్ట్యుపాసనయా = తన దేహములో నున్న ఈశ్వరధ్యానముచే, సమష్టివ్యాప్తిం = విశ్వవ్యాపక భావమును, ఆప్నుయాత్ = పొందును, ఏవం = ఇట్లు, ఉపసంక్రామతి ఇతి = కూడికొను చున్నాడని, దశకృత్వః = పదిమార్లు (శ్రుతి), ఉపాదిశత్ = ఉపదేశించినది.

జీవుడు వ్యష్ట్యుపాసనచే సమష్టివ్యాప్తిని పొందునని వేదము 'ఉప సంక్రామతి' అని పదిసార్లు ఉపదేశించినది.

**బ్రహ్మాండస్యోదరే లోకాః సప్తభూరాదయః స్మృతాః ।**
**మూలాది బ్రహ్మరంధ్రాంతేష్వాధారేషు వసంతి తే ॥7॥**

బ్రహ్మాండస్యోదరే = బ్రహ్మాండములోపల, భూరాదయః సప్తలోకాః = భూమి మొదలగు సప్తలోకములు, స్మృతాః = చెప్పబడినవి, తే = అవి (పిండాండమున), మూలాది బ్రహ్మరంధ్రాంతేషు = మూలము మూలాధారమునుండి బ్రహ్మరంధ్రమువఱకు గల, ఆధారేషు = ఆధార (చక్ర)ములయందు, వసంతి = ఉన్నవి.



భూలోకము మున్నగు ఏడు లోకములు బ్రహ్మాండమున కలవని చెప్పబడినవి. అవియే పిండాండమున కూడ మూలాధారమునుండి బ్రహ్మరంధ్రమువఱకు గల ఏడు చక్రములలో నున్నవి.

**వీణాదండో మహామేరురస్థీని కులపర్వతాః ।**
**గంగా తు పింగళా నాడీ యమునేడా ప్రకీర్తితా ॥8॥**

వీణాదండః = వెన్నెముక, మహామేరుః = మహామేరువు; అస్థీని = ఎముకలు, కులపర్వతాః = కుల పర్వతములు; పింగళానాడీ తు = పింగళా నాడి, గంగా = గంగ; ఇడా =ఇడానాడి, యమునా = యమున, అని ప్రకీర్తితా = చెప్పబడినది.

వెన్నెముక మహామేరువు, ఎముకలు కులపర్వతములు, పింగళా నాడి గంగ, ఇడానాడి యమున అని చెప్పబడినది.

**సరస్వతీ సుషుమ్నోక్తా నాడ్యోఽన్యాః పుణ్యనిమ్నగాః ।**
**ద్వీపాః స్యుస్సప్తధాతవః స్వేదబాష్పాదయోఽబ్ధయః ॥9॥**

సుషుమ్నా = సుషుమ్నానాడి, సరస్వతీ = సరస్వతి అని, ఉక్తా= చెప్పబడినది. అన్యాః నాడ్యః = ఇతరనాడులు, పుణ్య నిమ్నగాః = పుణ్యనదులు, సప్త ధాతవః = ఏడు ధాతువులు, ద్వీపాః = ద్వీపములు, స్వేద బాష్పాదయః = చెమట, కన్నీరు మున్నగునవి, అబ్ధయః = సముద్రములు, స్యుః = అగును.

సుషుమ్నానాడి సరస్వతి, ఇతరనాడులు పుణ్యనదులు, సప్తధాతువులు (చర్మ రక్తమాంసమేదోఽస్థిమజ్జాశుక్రములు) ద్వీపములు, చెమట, కన్నీరు మున్నగునవి సముద్రములు అగును.

**మూలే తిష్ఠతి కాలాగ్ని రస్థిమధ్యే చ బాడబః ।**
**వైద్యుతోఽగ్నిః సుషుమ్నాయాం పార్థివో నాభిమండలే ॥10॥**

మూలే = మూలాధారమున, కాలాగ్నిః = కాలాగ్ని, తిష్ఠతి = ఉన్నది, అస్థిమధ్యే = ఎముకల మధ్య, బాడబః = బడబాగ్ని, సుషుమ్నాయాం = సుషుమ్నా నాడిలో, వైద్యుతః అగ్నిః = వైద్యుతాగ్ని, నాభిమండలే = బొడ్డుభాగమున, పార్థివః = పార్థివాగ్నియు కలవు.

మూలాధారమున కాలాగ్ని, అస్థిమధ్య బడబాగ్ని, సుషుమ్నలో వైద్యుతాగ్ని, నాభిలో పార్థివాగ్నియు ఉన్నవి.

**హృది తిష్ఠతి సూర్యాగ్నిః కపాలే చంద్రమండలమ్ ।**
**నక్షత్రాణ్యపరాణ్యాహు ర్నేత్రాదీనీంద్రియాణ్యపి ॥11॥**

హృది = హృదయమున, సూర్యాగ్నిః = సూర్యాగ్ని, తిష్ఠతి = ఉన్నది, కపాలే = కపాలమున, చంద్రమండలం = చంద్రమండలము, ఉన్నది, నేత్రాదీని = కన్ను మున్నగు, ఇంద్రియాణి అపి = ఇంద్రియములను కూడ, అపరాణి నక్షత్రాణి = ఇతర నక్షత్రములని ఆహుః = చెప్పుచున్నారు.

హృదయమున సూర్యాగ్ని, కపాలమున చంద్రమండలము కలవు. నేత్రాదీంద్రియములు నక్షత్రములని చెప్పుచున్నారు.

**ధార్యంతే వాయుభిర్లోకాః యథా ప్రవహణాదిభిః ।**
**ప్రాణాదిభిర్దశవిధైర్ధార్యతే వాయుభిర్వపుః ॥12॥**

యథా = ఎట్లు, ప్రవహణాదిభిః = ప్రవహణము, మున్నగు, వాయుభిః = వాయువులచే, లోకాః = లోకములు, ధార్యంతే = ధరింపబడు చున్నవో, అట్లే, దశవిధైః = పది విధములైన, ప్రాణాదిభిః= ప్రాణము మున్నగు, వాయుభిః = వాయువులచే, వపుః = శరీరము, ధార్యతే = ధరింపబడుచున్నది.

ప్రవహణాది వాయువులచే లోకములు ధరింపబడినట్లు ప్రాణాదిదశవిధవాయువులచే దేహము ధరించబడినది.



**ప్రాప్యేడాపింగళే ప్రాణో మూలాత్సూర్య స్వరూపతః ।**
**నాసికాభ్యాం బహిర్గత్వా లీయతే ద్విషడంగులే ॥13॥**

మూలాత్ = మూలాధారము నుండి, లేచిన, ప్రాణః = ప్రాణము, ఇడాపింగళే = ఇడాపింగళలను నాడులను, ప్రాప్య = పొంది, సూర్యస్వరూపతః = సూర్యరూపము నుండి, వెచ్చనై, నాసికాభ్యాం = ముక్కు రంధ్రములనుండి, బహిః = బయటకు, గత్వా = వెళ్ళి, ద్విషడంగుళే = పన్నెండు అంగుళముల దూరమున, లీయతే = లయమగుచున్నది.

మూలాధారమునుండి ప్రాణము ఇడాపింగళలను పొంది సూర్యరూపమున వెచ్చనై ముక్కు రంధ్రముల నుండి బయటకు వెళ్ళి పన్నెండు అంగుళముల దూరమున లయమగుచున్నది.

**అష్టాంగులేన సోమాత్మా నాడీభ్యామంతరావిశత్ ।**
**మలమూత్రమరుచ్ఛుక్రాణ్యపానో విసృజేద్బహిః ॥14॥**

సోమాత్మా = చంద్రరూపమగు, అపానః = అపానము, అష్టాంగులేన = ఎనిమిది అంగుళముల దూరమునుండి వచ్చి, నాడీభ్యాం= రెండు నాడులనుండి, అంతః = లోపల, ఆవిశత్ =

ప్రవేశించి, మలమూత్రమరుచ్ఛుక్రాణి = మలమూత్ర వాయురేతస్సులను, బహిః = బయటకు, విసృజేత్ = విడుచును.

చంద్రరూపమగు అపానము ఎనిమిది అంగుళముల దూరము నుండి వచ్చి రెండు నాడులనుండి లోపల ప్రవేశించి మలమూత్ర వాయురేతస్సులను బయటకు విడుచును.

**అగ్నీషోమమయో భూత్వా సుషుమ్నా రంధ్రమాస్థితః ।**
**ఆబ్రహ్మరంధ్రముద్గచ్ఛన్నుదానో వర్ధతే స్వయమ్ ॥15॥**

ఉదానః = ఉదానవాయువు, అగ్నీషోమమయః = చంద్రాగ్నుల ఏకరూపముగ, భూత్వా = అయి, సుషుమ్నారంధ్రం = సుషుమ్నానాడిని, ఆస్థితః = చేరి, ఆ బ్రహ్మరంధ్రం = బ్రహ్మరంధ్రము వఱకు, ఉద్గచ్ఛన్= పైకిపోవుచు, స్వయం = తానుగ, వర్ధతే = పెరుగుచున్నది.

ఉదానము చంద్రాగ్నులరూపమై సుషుమ్నను చేరి బ్రహ్మరంధ్ర పర్యంతము పైకి వెళ్ళుచు స్వయముగా వర్ధిల్లును.

**వ్యాపయేద్వపుషి వ్యానో భుక్తాన్నరసమన్వహమ్ ।**
**సంధుక్షణం సమానస్తు కాయాగ్నేః కురుతే సదా ॥16॥**

వ్యానః = వ్యానవాయువు, అన్వహం = సదా, భుక్తాన్న రసం= తినిన ఆహారసారమును, వపుషి = దేహమున, వ్యాపయేత్ = వ్యాపింపజేయును, తు = మఱియు, సమానః = సమానవాయువు, కాయాగ్నేః = దేహాగ్నికి, సంధుక్షణం = ఉద్దీపనమును, సదా = ఎల్లపుడు, కురుతే = చేయుచున్నది.



వ్యానము భుజించిన ఆహారసారమును దేహమున వ్యాపింపజేయును. సమానము దేహాగ్నికి సదా ఉద్దీపన కలిగించును.

**నాగో హిక్కాకరః కూర్మో నిమేషోన్మేషకారకః ।**
**క్షుతం కరోతి కృకరో దేవదత్తో విజృంభణమ్ ॥17॥**

నాగః = నాగము, హిక్కాకరః = ఎక్కిళ్ళు కలిగించునది, కూర్మః= కూర్మము, నిమేషోన్మేషకారకః = కనులు మూయుట తెరచుట చేయునది, కృకరః = కృకరము, క్షుతం = తుమ్మును, కరోతి = చేయుచున్నది. దేవదత్తః = దేవదత్తము, విజృంభణం = ఆవులింతను, కరోతి = చేయుచున్నది.

నాగము ఎక్కిళ్ళు, కూర్మము కన్నులు మూయుట తెరచుట, కృకరము తుమ్ముట, దేవదత్తము ఆవులించుట చేయును.

**స్థౌల్యం ధనంజయః కుర్యాత్ మృతం చాపి న ముంచతి ।**
**ఆకాశో బహిరప్యంతరవకాశం ప్రయచ్ఛతి ॥18॥** 18

ధనంజయః = ధనంజయము, స్థౌల్యం = లావగుటను, కుర్యాత్= చేయును, చ = మఱియు, మృతం అపి = చచ్చినవానిని కూడ, న ముంచతి = విడువదు, ఆకాశః = ఆకాశము, బహిః = బయట, అంతః అపి = లోపలకూడ, అవకాశం = అవకాశమును, ప్రయచ్ఛతి = ఇచ్చుచున్నది.

ధనంజయము లావుచేయును, మృతుని కూడ విడువదు. ఆకాశము దేహము లోపల, బయటను స్థలము నిచ్చుచున్నది.

**చంద్రార్కౌ కాలనేతారౌ ప్రాణాపానౌ శరీరిణామ్ ।**
**సాక్షీ పురుష ఇత్యేవం మూర్త్యష్టక మిదం వపుః ॥19॥**

కాలనేతారౌ = (ప్రపంచ) కాలనియామకులైన, చంద్రార్కౌ = చంద్రసూర్యులు, శరీరిణాం = దేహధారుల, ప్రాణాపానౌ = ప్రాణాపానములు, పురుషః = ఈశ్వరుడు, సాక్షీ = సాక్షియగు జీవుడు, ఇతి ఏవం = ఇట్లు, ఇదం = ఈ, వపుః = శరీరము, మూర్త్యష్టకం = అష్టమూర్తులతో కూడినది.

కాలనియామకులగు చంద్రసూర్యులు, దేహధారుల ప్రాణాపానములు, ఈశ్వరుడు, సాక్షియగు జీవుడు ఇట్లు ఈ దేహము ఎనిమిది మూర్తులు గలది.

**సమనస్క మిదం యోగీ సేవమాన ఉపాసనమ్ ।**
**అష్టాంగ యోగ యుక్తం సన్నమనస్కం స గచ్ఛతి ॥20॥**

ఇదం = ఈ, సమనస్కం = మనస్సుతో కూడిన, ఉపాసనం = ధ్యానమును, అష్టాంగయోగయుక్తఃసన్ = అష్టాంగ యోగముతో కూడినవాడై, సేవమానః = అభ్యాసముచేయు, యోగీ = యోగియగు, సః = అతడు, అమనస్కం = మనస్సును మీరిన దానిని, గచ్ఛతి = పొందుచున్నాడు.

ఇట్లు మనస్సుతో కూడిన ధ్యానమును అష్టాంగయోగయుక్తుడై అభ్యసించు యోగి మనస్సును మీరిన పదవిని పొందును.

**మనఃప్రసాదః సంతోషో మౌనమింద్రియనిగ్రహః ।**
**దయా దాక్షిణ్య మాస్తిక్య మార్జవం మార్దవం క్షమా ॥21॥**



**భావశుద్ధి రహింసా చ బ్రహ్మచర్యం స్మృతిర్ధృతిః ।**
**ఇత్యేవమాదయోఽన్యే చ మనస్సాధ్యా యమాః స్మృతాః ॥22॥**

మనస్సాధ్యాః = మనస్సుచే సాధింపదగిన, మనఃప్రసాదః = మనస్సుయొక్క స్వచ్ఛత, సంతోషః = తృప్తి, మౌనం = మౌనము, ఇంద్రియ నిగ్రహః = ఇంద్రియ నిగ్రహము, దయా = దయ, దాక్షిణ్యం= దాక్షిణ్యము, ఆస్తిక్యం = నమ్మకము, ఆర్జవం = ఋజుత్వము, మార్దవం= మృదుత్వము, క్షమా = ఓర్పు, భావసంశుద్ధిః = శుద్ధభావములు కల్గియుండుట, అహింసా = అహింస, బ్రహ్మచర్యం = బ్రహ్మచర్యము, స్మృతిః = స్మృతి, చ = మఱియు, ధృతిః = ధైర్యము,ఇతి ఏవం ఆదయః= ఇవే మొదలైనవి, అన్యే చ = ఇతర సాధనలుకూడ, యమాః = యమములని, స్మృతాః = తలచబడినవి.

మనః ప్రసన్నత, తృప్తి, మౌనము, ఇంద్రియ నిగ్రహము, దయ, దాక్షిణ్యము, ఆస్తిక్యము, ఆర్జవము, మృదుత్వము, సహిష్ణత, శుద్ధ భావములు కల్గియుండుట, అహింస, బ్రహ్మచర్యము, స్మరణ, ధీరత్వము మున్నగు మానసికసాధనలు యమములు.

**స్నానం శౌచం క్రతుస్సత్యం జపో హోమశ్చ తర్పణమ్ ।**
**తపో దానం తితిక్షా చ నమస్కారః ప్రదక్షిణమ్ ।**
**వ్రతోపవాసాద్యాశ్చాన్యే కాయికా నియమాః స్మృతాః ॥**

కాయికాః = దేహముచే సాధింపదగిన స్నానం = స్నానము, శౌచం = శుచిత్వము, క్రతుః = పూజ, సత్యం = సత్యము, జపః = జపము, హోమః = హవనము, చ = మఱియు, తర్పణం = తర్పణము,

తపః = తపస్సు, దానం = దానము, తితిక్షా = ద్వంద్వసహనము, నమస్కారః = నమస్కారము, చ = మఱియు, ప్రదక్షిణం = ప్రదక్షిణ,వ్రతోపవాసాద్యాః = వ్రతము, ఉపవాసము మున్నగు, అన్యే చ = ఇతర సాధనలు కూడా, నియమాః = నియమములని, స్మృతాః = తలచబడినవి.

దేహముచే సాధింపదగిన స్నానము, శుచి, పూజ, సత్యము, జపము, హోమము, తర్పణము, తపస్సు, దానము, ద్వంద్వసహనము, నమస్కారము, ప్రదక్షిణ, వ్రతము, ఉపవాసము మున్నగు సాధనలు నియమములగును.

**స్వస్తికం గోముఖం పద్మం హంసాఖ్యం బ్రాహ్మమాసనమ్ ।**
**నృసింహం గారుడం కూర్మం నాగాఖ్యం వైష్ణవాసనమ్ ॥24॥**

**వీరం మయూరం వజ్రాఖ్యం సిద్ధాఖ్యం రౌద్రమాసనమ్ ।**
**యోన్యాసనం విదుశ్శాక్తం శైవం పశ్చిమతానకమ్ ॥25॥**

స్వస్తికం = స్వస్తికము, గోముఖం = గోముఖము, పద్మం = పద్మము, హంసాఖ్యం = హంసమనియు, బ్రాహ్మం ఆసనం = బ్రాహ్మాసనము, నృసింహం = నృసింహము, గారుడం = గారుడము, కూర్మం = కూర్మము, నాగాఖ్యం = నాగమనునదియు, వైష్ణవాసనం = వైష్ణవాసనము, వీరం = వీరము, మయూరం = మయూరము, వజ్రాఖ్యం= వజ్రమనునదియు, సిద్ధాఖ్యం = సిద్ధమనునదియును, రౌద్రం ఆసనం = రౌద్రాసనము, యోన్యాసనం = యోన్యాసనమును,



శాక్తం = శాక్తమని, పశ్చిమతానకం = పశ్చిమతాసనమును, శైవం = శైవమని, విదుః = తలచిరి.

స్వస్తిక గోముఖ పద్యహంసాసనములు బ్రాహ్మములు, నృసింహ గారుడ కూర్మ నాగాసనములు వైష్ణవములు, వీరమయూర వజ్రసిద్ధాసనములు రౌద్రములు, యోన్యాసనము శాక్తము, పశ్చిమతానకాసనము శైవము.

**నిరాలంబనయోగస్య నిరాలంబనమాసనమ్ ॥26॥**

**నిరాలంబతయా ధ్యానం నిరాలంబః సదాశివః ।**
**రేచకః పూరకశ్చైవ కుంభకః ప్రాణసంయమః ॥27॥**

నిరాలంబనయోగస్య = నిరాలంబన యోగమునకు, నిరాలంబనం = ఆలంబనము లేకుండుట, ఆసనం = ఆసనము, నిరాలంబతయా = ఆలంబన రహితమైనది అను, ధ్యానం = ధ్యానము, నిరాలంబః = ఆలంబన రహితుడు, సదాశివః = సదాశివుడు, రేచకః = రేచకము, పూరకః = పూరకము, కుంభకః చ ఏవ = కుంభకము కూడ, ప్రాణసంయమః = ప్రాణాయామము.

నిరాలంబన యోగమునకు ఆలంబనము లేకుండుట ఆసనము, అలంబనరహితమను ధ్యానము, అలంబనరహితుడు సదాశివుడు (పరబ్రహ్మము). రేచక పూరక కుంభకములు ప్రాణాయామము.

**ఇంద్రియాణాం సమస్తానాం విషయేభ్యో నివారణమ్ ।**
**ప్రత్యాహార ఇతి ప్రోక్తం ప్రత్యాహారార్థవేదిభిః ॥28॥**

విషయేభ్యః = విషయముల నుండి, సమస్తానాం ఇంద్రియాణాం = ఎల్ల ఇంద్రియముల, నివారణం = నివారణ, ప్రత్యాహార ఇతి = ప్రత్యాహారమని, ప్రత్యాహారార్థ వేదిభిః = ప్రత్యాహారార్థము నెరిగిన వారిచే, ప్రోక్తం = చెప్పబడినది.

విషయముల నుండి సర్వేంద్రియ నివారణ ప్రత్యాహారమని దానిని తెలిసినవారు చెప్పెదరు.

**ఆధారే క్వాపి మనసః స్థాపనం ధారణోచ్యతే ।**
**బ్రహ్మవిష్ణు శివాదీనాం చింతా ధ్యానం ప్రచక్షతే ॥29॥**

క్వాపి = ఒకానొక, ఆధారే = విషయమున, మనసః స్థాపనం= మనస్సును నిల్పుట, ధారణా = ధారణ అని, ఉచ్యతే = చెప్పబడుచున్నది. బ్రహ్మవిష్ణుశివాదీనాం = బ్రహ్మవిష్ణు శివాదుల, చింతా = యోచన, ధ్యానం = ధ్యానమని, ప్రచక్షతే = చెప్పుచున్నారు.

ఏదేని ఒక విషయమున మనస్సును నిశ్చలముగ నిలుపుట ధారణ అని చెప్పెదరు. బ్రహ్మ విష్ణుశివాదుల స్మరణ ధ్యానమని చెప్పెదరు.

**ధ్యానాదస్పందనం బుద్ధే స్సమాధిరభిధీయతే ।**
**అమనస్కసమాధిస్తు సర్వచింతా వివర్జనమ్ ॥30॥**

ధ్యానాత్ = ధ్యానమునుండి, బుద్ధేః అస్పందనమ్ = బుద్ధి కదల కుండుట, సమాధిః = సమాధియని, అభిధీయతే = పిలువబడుచున్నది. అమనస్కసమాధిః తు = అమనస్కసమాధియైతే, సర్వచింతా వివర్జనం = సమస్త మనోవ్యాపారమును విడుచుట.



బుద్ధి ధ్యానమునుండి కదలకుండుట సమాధి. సమస్త మనోవ్యాపారమును విడుచుట అమనస్క సమాధి.

**చిత్తే నిశ్చలతాం యాతే ప్రాణో భవతి నిశ్చలః ।**
**చిత్తస్య నిశ్చలత్వాయ యోగం సధ్యానమభ్యసేత్ ॥31॥**

చిత్తే = చిత్తము, నిశ్చలతాం = నిశ్చలత్వమును, యాతే = పొందగా, ప్రాణః = ప్రాణము, నిశ్చలః = నిశ్చలముగ, భవతి = అగుచున్నది. చిత్తస్య = మనస్సుయొక్క నిశ్చలత్వాయ = స్థైర్యము కొఱకు, సధ్యానం = ధ్యానముతో కూడిన, యోగం = యోగమును, అభ్యసేత్ = అభ్యసించవలెను.

మనస్సు స్థిరమైనపుడు ప్రాణము నిశ్చలమగును. మనస్సు స్థైర్యమును పొందుటకై ధ్యానముతో కూడిన యోగమును అభ్యసించవలెను.

**ఆకుంచనమపానస్య ప్రాణస్య చ నిరోధనమ్ ।**
**లంబికోపరిజిహ్వాయాః స్థాపనం యోగసాధనమ్ ॥32॥**

అపానస్య ఆకుంచనం = అపానమును ముడుచుకొనుట, ప్రాణస్య నిరోధనం = ప్రాణమును నిలుపుట, చ = మఱియు, లంబికోపరి = చిరునాలుకపై, జిహ్వాయాః స్థాపనం = నాలుక నుంచుట యోగసాధనం = యోగసాధనము.

అపానమును తగ్గించుట, ప్రాణమును నిలుపుట, నాలుకను కొండనాలుకకు తగిలించుట ఇవి యోగమునకు సాధనలు.

**చిత్తే నిశ్చలతాం యాతే ప్రాణే మధ్యపథం గతే ।**
**చిహ్నా న్యేతాని జాయంతే పంచభూతజయాత్పృథక్ ॥33॥**

చిత్తే = మనస్సు, నిశ్చలతాం = స్థిరత్వమును, యాతే = పొందినపుడు, ప్రాణే = ప్రాణము, మధ్యపథం = మధ్యమార్గమును, గతే = చేరినపుడు, పంచభూతజయాత్ = పంచభూతముల జయము వలన, పృథక్ = వేరుగ, ఏతాని = ఈ, చిహ్నాని = లక్షణములు, జాయంతే = కలుగును.

మనసు స్థిరత్వమును పొందగ, ప్రాణము మధ్యమార్గమును చేరగ పంచభూతజయమువలన వేరుగ ఈ చిహ్నములు కనిపించును.

**మలమూత్రకఫాల్పత్వ మారోగ్యం లఘుతా తనోః ।**
**సుగంధః స్వర్ణవర్ణత్వం ప్రథమం యోగలక్షణమ్ ॥34॥**

మలమూత్ర కఫాల్పత్వం = మలమూత్ర కఫములు తగ్గుట, ఆరోగ్యం = ఆరోగ్యము, తనోఃలఘుతా = శరీరము తేలికగా నుండుట, సుగంధః = మంచివాసన, స్వర్ణవర్ణత్వం = బంగారువన్నె కల్గియుండుట, ప్రథమం = మొదటి, యోగలక్షణం = యోగలక్షణము.

మలమూత్రకఫములు తగ్గుట, ఆరోగ్యము, శరీరము తేలికనుండుట, సుగంధము, స్వర్ణవర్ణము కల్గియుండుట యోగముయొక్క ప్రథమ చిహ్నము.

**కంటకాగ్రేష్వసంగత్వం జలపంకేష్వమజ్జనమ్ ।**
**క్షుత్తృడాదిసహిష్ణుత్వం ద్వితీయం యోగలక్షణమ్ ॥35॥**



కంటకాగ్రేషు = ముల్లుకొనలలో చిక్కికొనకుండుట, జలపంకేషు అసంగత్వం = నీరు బురదలలో, అమజ్జనం = మునుగకుండుట, క్షుత్తృడాది సహిష్ణుత్వం = ఆకలి దప్పిక మున్నగునవి సహించుకొనుట, ద్వితీయం = రెండవ, యోగలక్షణం = యోగలక్షణము.

ముల్లుకొనలలో చిక్కికొనకుండుట, నీరు బురదలలో మునుగకుండుట, క్షుత్పిపాసాదుల సహనము యోగముయొక్క ద్వితీయ చిహ్నము.

**బహ్వన్నపానభోక్తృత్వ మాతపాగ్ని సహిష్ణుతా ।**
**దర్శనం శ్రవణం దూరాత్తృతీయం యోగలక్షణమ్ ॥36॥**

బహ్వన్నపానభోక్తృత్వం = హెచ్చుగ అన్న పానములు సేవించుట, ఆతపాగ్ని సహిష్ణుతా = ఎండ అగ్నులను సహించుకొనుట, దూరాత్ = దూరము నుండి, దర్శనం = చూచుట, శ్రవణం = వినుట, తృతీయం = మూడవ, యోగలక్షణం = యోగలక్షణము.

హెచ్చుగ అన్నపానములు సేవించుట, ఆతపాగ్నులసహనము, దూరదర్శన శ్రవణములు యోగముయొక్క తృతీయ చిహ్నము.

**మండూకప్లవనం భూమౌ మర్కటప్లవనం ద్రుమే ।**
**ఆకాశగమనం చేతి చతుర్థం యోగలక్షణమ్ ॥37॥**

భూమౌ = నేలమీద, మండూక ప్లవనం = కప్పవలె ఎగురుట, ద్రుమే = చెట్టుమీద, మర్కటప్లవనం = కోతివలె ఎగురుట, చ = మతియు, ఆకాశగమనం = ఆకాశమున పోవుట, ఇతి = అని, చతుర్థం= నాల్గవ, యోగలక్షణం = యోగలక్షణము.

నేలపై కప్పవలె, చెట్టుపై కోతివలె గంతులు వేయుట, ఆకాశగమనము యోగముయొక్క చతుర్థ చిహ్నము.

**జ్ఞానం త్రికాలవిషయ మైశ్వర్య మణిమాదికమ్ ।**
**అనంతశక్తిమత్త్వం చ పంచమం యోగలక్షణమ్ ॥38॥**

త్రికాలవిషయం జ్ఞానం = త్రికాల (మూడుకాలముల) విషయకజ్ఞానము, అణిమాదికం ఐశ్వర్యం = అణిమాద్యైశ్వర్యము, చ = మఱియు, అనంతశక్తిమత్త్వం = అనంతమైన శక్తి కలిగియుండుట, పంచమం = ఐదవ, యోగలక్షణం = యోగలక్షణము.

త్రికాలజ్ఞానము కలుగుట, అణిమాద్యైశ్వర్యము, అనంతశక్తి కల్గియుండుట యోగముయొక్క పంచమ చిహ్నము.

**ప్రాణే సుషుమ్నాం సంప్రాప్తే నాదోఽంత శ్రూయతేఽష్టధా ।**
**ఘంటాదుందిభిశంఖాబ్ధి వీణా వేణ్వాదితాళవత్ ॥39॥**

ప్రాణే = ప్రాణము, సుషుమ్నాం = సుషుమ్నను, సంప్రాప్తే = చేరగ, అంతః = లోపల, ఘంటాదుందుభిశంఖాబ్ధివీణా వేణ్వాది తాళవత్= ఘంట, భేరి, శంఖము, సముద్రము, వీణ, పిల్లనగ్రోవి, మృదంగము, తాళమువలె,అష్టధా = ఎనిమిది విధములుగ, నాదః = నాదము, శ్రూయతే = వినబడును.

ప్రాణము సుషుమ్నను చేరినపుడు లోపల ఘంటా భేరీ శంఖ సముద్ర వీణా వేణు (ఆదిశబ్దముచే) మృదంగము, తాళములవలె ఎనిమిది విధముల నాదము వినిపించును.



**తనూనపాత్తటిత్తారారాతారేశతపనోపమమ్ ।**
**బ్రహ్మనాడీం గతే ప్రాణే బింబరూపం ప్రకాశతే ॥40॥**

ప్రాణే = ప్రాణము, బ్రహ్మనాడీం = బ్రహ్మనాడిని, గతే = చేరగ, తనూనపాత్తటిత్తారారాతారేశతపనోపమం = అగ్ని, మెఱుపు, నక్షత్రము, చంద్రుడు సూర్యుడువలె నున్న, బింబరూపం = (ఈశ్వర) బింబరూపము, ప్రకాశతే = గోచరమగును.

ప్రాణము సుషుమ్నను చేరినపుడు అగ్ని విద్యున్నక్షత్ర చంద్ర సూర్యులవలె ఈశ్వర బింబరూపము ప్రకాశించును.

**శ్వాసాశ్చరంతి యావంతో మనుష్యస్య దినం ప్రతి ।**
**తావంతి యోజనాన్యర్కః శ్వాసే శ్వాసే ప్రధావతి ॥41॥**

ప్రతిదినం = ప్రతిదినము, మనుష్యస్య = మనుష్యునకు, యావంతి = ఎన్ని, శ్వాసాః = శ్వాసలు, చరంతి = నడుచుచున్నవో, శ్వాసే శ్వాసే = ప్రతిశ్వాసలోను, అర్కః = సూర్యుడు, తావంతి = అన్ని, యోజనాని = యోజనములు, ప్రధావతి = పరుగెత్తుచున్నాడు.

ప్రతిదినము మనుష్యుని శ్వాసలు ఎన్ని నడచుచున్నవో ప్రతిశ్వాసలోను సూర్యుడు అన్ని యోజనములు పరుగెత్తుచుండును.

**ఏకవింశతి సాహస్రం షట్ఛతం శ్వాససంఖ్యయా ।**
**సోఽహమిత్యుచ్చరత్యాత్మా మంత్రం ప్రత్యహ మాయుషే ॥42॥**

ఆత్మా = ఆత్మ, ఆయుషే = ఆయుస్సు కొఱకు, ప్రత్యహం = ప్రతిదినము, ఏకవింశతి సాహస్రం షట్ఛతం = ఇరువదియొక్క వేల

ఆరు వందలు. శ్వాససంఖ్యయా = శ్వాసలసంఖ్యచే, సః అహం = అతడు నేను, ఇతి మంత్రం = అను మంత్రమును, ఉచ్చరతి= ఉచ్చరించుచున్నాడు.

ఆత్మ ప్రతిదినము ఊపిరిసంఖ్యయగు 21600 మార్లు "సోఽహం" అను మంత్రమును ఉచ్చరించుచున్నాడు.

**సకారం చ హకారం చ లోపయిత్వా ప్రయోజయేత్ ।**
**సంధిం వై పూర్వరూపాఖ్యం గతోఽసౌ ప్రణవో భవేత్ ॥43॥**

సకారం చ = సకారమును, హకారం చ = హకారమును, లోపయిత్వా = లోపముచేసి, పూర్వరూపాఖ్యం = పూర్వరూపమును , సంధిం వై = సంధిని, ప్రయోజయేత్ = కూర్చవలెను, తతః = అప్పుడు, అసౌ = ఇది, ప్రణవః = ప్రణవము, భవేత్ = అగును.

సకార హకారములను లోపముచేసి పూర్వ రూప సంధిని గూర్చిన "సోఽహం" అనునది ప్రణవ మగును(ఓం)

**అకారశ్చాప్యుకారశ్చ మకారో బిందునాదకౌ ।**
**పంచాక్షరాణ్యమూన్యాహుః ప్రణవస్థాని పండితాః ॥44॥**

అకారః చ = అకారము, ఉకారః చ = ఉకారము, మకారః అపి = మకారమున్ను, బిందునాదకౌ = బిందునాదములు, అమూని పంచాక్షరాణి = ఈ ఐదు అక్షరములు, ప్రణవస్థాని = ప్రణవమునందున్నవని, పండితాః = పండితులు, ఆహుః = చెప్పుచున్నారు.



అ, ఉ, మ, బిందు, నాదము లను ఐదు అక్షరములు ప్రణవములో నున్నవని పండితులు చెప్పెదరు.

**బ్రహ్మో విష్ణుశ్చ రుద్రశ్చాపీశ్వరశ్చ సదాశివః ।**
**తేష్వక్షరేషు తిష్ఠంతి షట్త్రింశత్తత్త్వసంయుతాః ॥45॥**

బ్రహ్మో = బ్రహ్మ, విష్ణుః చ = విష్ణువును, అపి = మఱియు, రుద్రః చ = రుద్రుడును, ఈశ్వరః చ = ఈశ్వరుడును, సదాశివః = సదాశివుడు, షట్త్రింశత్తత్త్వ సంయుతాః = ముప్పది యారు తత్త్వములు గలవారై, తేషు అక్షరేషు = ఆ అక్షరములలో, తిష్ఠంతి = ఉంటున్నారు.

బ్రహ్మ విష్ణు రుద్ర ఈశ్వర సదాశివులు ముప్పది ఆరు తత్త్వములతో సహా ఆ అయిదు అక్షరములలో నుంటున్నారు.

**గురుప్రసాదాల్లభతే యోగమష్టాంగలక్షణమ్ ।**
**శివప్రసాదాల్లభతే యోగసిద్ధిం చ శాశ్వతీమ్ ॥46॥**

గురుప్రసాదాత్ = గుర్వనుగ్రహము వలన, అష్టాంగ లక్షణం = అష్టాంగ లక్షణమైన, యోగం = యోగమును, లభతే = పొందుచున్నాడు, చ = మఱియు, శివప్రసాదాత్ = ఈశ్వరానుగ్రహము వలన, శాశ్వతీం = నిత్యమైన, యోగసిద్ధిం = యోగసిద్ధిని, లభతే = పొందుచున్నాడు.

గుర్వనుగ్రహముచే అష్టాంగ యోగమును, ఈశ్వరానుగ్రహముచే యోగసిద్ధిని పడయుచున్నాడు.

**సచ్చిదానందరూపాయ బిందునాదాంతరాత్మనే ।**

**ఆదిమధ్యాంతశూన్యాయ గురూణాం గురవే నమః ॥47॥**

సచ్చిదానంద రూపాయ = సచ్చిదానందరూపుడగు, బిందునాదాంతరాత్మనే = బిందు నాదముల అంతరాత్మయగు, ఆదిమధ్యాంతశూన్యాయ = ఆదిమధ్యాంతరహితుడగు, గురూణాం గురవే = గురువుల గురువుకు, నమః = నమస్కారము.

సచ్చిదానంద రూపుడు, బిందునాదాంతరాత్మయు ఆదిమధ్యాంతరహితుడగు గురువుల గురువుకు నమోవాకము.

**ఇతి శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకే ।**
**ప్రబంధే మానసోల్లాసే నవమోల్లాస సంగ్రహః ॥48॥**

ఇతి = ఇట్లు, శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకే = శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థమును వివరించు, మానసోల్లాసే = మానసోల్లసమను, ప్రబంధే = కృతియందు, నవమోల్లాస సంగ్రహః = సంగ్రహమగు నవమోల్లాసము.

ఇట్లు శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థమును వివరించు మానసోల్లాస మను కృతియందు సంగ్రహ మగు నవమోల్లాసము.

హరిః ఓం తత్సత్



## దశమోల్లాసః

**సర్వాత్మత్వ మితి స్ఫుటీకృతమిదం యస్మాదముష్మిన్ స్తవే**
**తేనాస్య శ్రవణా త్తథార్థమననాద్ధ్యానాచ్చ సంకీర్తనాత్ ।**
**సర్వాత్మత్వ మహావిభూతి సహితం స్యాదీశ్వరత్వం స్వతః**
**సిద్ధ్యేత్తత్పునరష్టధా పరిణతం చైశ్వర్య మవ్యాహతమ్ ॥10॥**

యస్మాత్ = ఎందువలన, అముష్మిన్ స్తవే = ఈ స్తోత్రమున, సర్వాత్మత్వం = అంతయు ఆత్మయగుట, ఇతి = అను, ఇదం = ఈ తత్త్వము, స్ఫుటీకృతం = స్పష్టము చేయబడినదో, తేన - అందుచే, అస్య = దీని, శ్రవణాత్ = శ్రవణము వలన, తథా = అట్లే, అర్థమననాత్= అర్థానుసంధానమువలన, ధ్యానాత్ = ధ్యానమువలన, చ = మఱియు, సంకీర్తనాత్ = చెప్పుట వలన, సర్వాత్మత్వ మహావిభూతిసహితం = సర్వాత్మత్వమను మహా విభూతితో కూడిన, ఈశ్వరత్వం = పరమేశ్వర భావము, స్వతః = తానుగనే, స్యాత్ = అగును, చ = మఱియు, అష్టధా = ఎనిమిది విధములుగా, పరిణతం = పరిణామమును పొందియున్న, ఐశ్వర్యం = ఈశ్వరత్వము, అవ్యాహతం = నిరంతరముగ, సిద్ధ్యేత్ = సిద్ధించును.

ఈస్తోత్రమున జీవుని సర్వాత్మత్వము స్పష్టీకరించి చెప్పియున్నందున, దీని శ్రవణ మనన ధ్యాన సంకీర్తనల వలన సర్వాత్మత్వమను మహావిభూతితో కూడిన పరమేశ్వరభావము స్వతః కలుగును. మరియు అణిమాద్యష్టైశ్వర్యము కూడ సిద్ధించును.

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యవర్య
శ్రీశంకరాచార్య విరచితం
శ్రీదక్షిణామూర్తి స్తోత్రం సంపూర్ణం.

**మానసోల్లాసః - 10**

**పరిచ్ఛిన్న మహంభావం పరిత్యజ్యానుషంగికమ్ ।**
**పూర్ణాహంభావలాభోఽస్య స్తోత్రస్య ఫలముచ్యతే ॥1॥**

ఆనుషంగికం = ఔపాధికము, పరిచ్ఛిన్నం = సంకుచితము అగు, అహంభావం = నేను అను దానిని, పరిత్యజ్య = విడిచి, పూర్ణాహంభావః = సర్వాత్మత్వమును పొందుట, అస్య స్తోత్రస్య = ఈ స్తోత్రమునకు, ఫలం = ఫలమని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

సహజముకాని సంకుచితమైన అహంభావమును విడిచి సర్వము నేనే అను భావమును పొందుటయే ఈ స్తోత్ర ఫలమని చెప్పబడినది.

**పుత్రపౌత్రగృహక్షేత్రధనధాన్య సమృద్ధయః ।**
**అర్వాచీనాశ్చ సిద్ధ్యంతి స్వర్గపాతాళభూమిషు ॥2॥**

స్వర్గపాతాళభూమిషు = స్వర్గ పాతాళ భూలోకములయందు, పుత్రపౌత్రగృహ క్షేత్ర ధనధాన్యసమృద్ధయః = కొడుకులు మనుమలు ఇండ్లు పొలములు ధనము ధాన్యము వీటితో నిండియుండుట, అర్వాచీనాః చ = ఇచ్చటి సుఖములు కూడ, సిద్ధ్యంతి = సిద్ధించుచున్నవి.

స్వర్గ పాతాళ భూలోకములలో పుత్రపౌత్ర గృహక్షేత్ర ధనధాన్య సమృద్ధి మఱియు ఇచ్చటి సుఖములున్ను సిద్ధించును.

**పాకే ప్రవర్తమానస్య శీతాదిపరిహారవత్ ।**
**ప్రాసంగికాశ్చ సిద్ధ్యంతి స్తోత్రేణానేన సర్వదా ॥3॥**

పాకే = వంటలో, ప్రవర్తమానస్య = నిరతుడై యున్న వానికి, శీతాది పరిహారవత్ = చలి మున్నగునవి బోవునట్లు, అనేన స్తోత్రేణ = ఈ స్తోత్రముచే, ప్రాసంగికాః చ = ఉద్దేశము లేని ఫలములును, సిద్ధ్యంతి= సిద్ధించుచున్నవి.



వంటచేయునపుడు చలికూడ పోవునట్లు ఈ స్తోత్రముచే ఆత్మస్వరూపము తెలిసినపుడు ఇష్టములేని ఫలములును లభించును.

**ఐశ్వర్యమీశ్వరత్వం హి తస్య నాస్తి పృథక్స్థితిః ।**
**పురుషే ధావమానేఽపి ఛాయా తమనుధావతి ॥4॥**

ఐశ్వర్యం = ఐశ్వర్యము, ఈశ్వరత్వం = ఈశ్వరుని భావము, తస్య పృథక్ స్థితిః = (ఈశ్వరుని విడిచి) వేరుగా నుండుట, న అస్తి = లేదు, పురుషే = మనుష్యుడు, ధావమానే అపి = పరుగెత్తుచున్నను, ఛాయా = నీడ, తం = అతనిని, అనుధావతి హి = వెంబడించుచున్నది గదా!

ఐశ్వర్య మనునది ఈశ్వరుని భావమే తప్ప ఈశ్వరుని కంటె వేరు ఉనికి దానికి లేదు. మానవుడు పరుగెత్తుచున్నపుడు వాని నీడ వానిని వెంబడించుచునే యుండును.

**అనంతశక్తిరైశ్వర్యం నిష్యందాశ్చాణిమాదయః ।**
**స్వస్యైశ్వరత్వే సంసిద్ధే సిద్ధ్యంతి స్వయమేవ హి ॥5॥**

అనంతశక్తిః = అనంతమైన శక్తి, ఐశ్వర్యం = ఈశ్వరత్వము. అణిమాదయః = అణిమాది సిద్ధులు, నిష్యందాః = రాలినబొట్లు, స్వస్య= తన (జీవుని), ఈశ్వరత్వే = ఈశ్వరత్వము, సంసిద్ధే = సిద్ధింప, ఇవి, స్వయం ఏవ = తాముగనే, సిద్ధ్యంతి హి = సిద్ధించును కదా.

అనంతశక్తియే ఈశ్వరత్వము. అణిమాదులు దానినుండి రాలునట్టి దాని కణములు, కాన జీవుని ఈశ్వరత్వము సిద్ధింప ఇవి స్వయముగనే ఇతర ప్రయత్నము లేకయే సిద్ధించును.

**యదీయైశ్వర్యవిప్రుడ్భిర్బ్రహ్మ విష్ణు శివాదయః ।**
**ఐశ్వర్యవంతో శాసంతే స ఏవాత్మా సదాశివః ॥6॥**

యదీయైశ్వర్య విప్రుడ్భిః = ఎవని శక్తి కణములచే, బ్రహ్మవిష్ణుశివాదయః = బ్రహ్మ విష్ణు శివాదులు, ఐశ్వర్యవంతః = శక్తిమంతులై, శాసంతే = ఏలుచున్నారో, సః = ఆ, సదాశివః ఏవ = సదాశివుడే, ఆత్మా = ఆత్మ.

ఎవని శక్తికణములచే బ్రహ్మ విష్ణు శివాదులు శక్తిమంతులై జగత్తు నేలుచున్నారో ఆ సదాశివుడే ఆత్మ.

**పుష్పమానయతా గంధో వినేచ్ఛామనుభూయతే ।**
**పూర్ణాహంభావయుక్తేన పరిచ్ఛిన్నా విభూతయః ॥7॥**

పుష్పం = పువ్వును, ఆనయతా = తెచ్చు వానిచే, ఇచ్ఛాం వినా = ఇష్టము లేకున్నను, గంధః = వాసన, అనుభూయతే = అనుభవింపబడును, పూర్ణాహంభావయుక్తేన = పూర్ణాహంభావముతో కూడిన వానిచే, పరిచ్ఛిన్నాః = చిన్నవైన, విభూతయః = ఐశ్వర్యములు, అనుభూయతే= అనుభవింపబడును.

పూలు తెచ్చువానికి తనయిచ్ఛ లేకున్ననూ దాని వాసన లభించినట్లే పూర్ణాహంభావము గలవానికి చిన్నవైన ఐశ్వర్యములు ప్రాసంగికముగా లభించును.



**అణిమా మహిమాచైవ గరిమా లఘిమా తథా ।**
**ప్రాప్తిః ప్రాకామ్యమీశత్వం వశిత్వం చాష్టసిద్ధయః ॥8॥**

అణిమా = అణిమ, చ = మఱియు, మహిమా = మహిమ, ఏవ = మఱియు గరిమా = గరిమ, లఘిమా = లఘిమ, తథా అట్లే, ప్రాప్తిః = ప్రాప్తి, ప్రాకామ్యం = ప్రాకామ్యము, ఈశత్వం = ఈశత్వము, చ = మఱియు, వశిత్వం = వశిత్వము, ఇవి, అష్ట = ఎనిమిది సిద్ధయః = సిద్ధులు.

అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము అనునవి ఎనిమిది సిద్ధులు.

**అత్యంతమణుషు ప్రాణిష్వాత్మత్వేన ప్రవేశనమ్ ।**
**అణిమాసంజ్ఞమైశ్వర్యం వ్యాప్తస్య పరమాత్మనః ॥9॥**

అత్యంతం = చాల, అణుషు = చిన్నవైన, ప్రాణిషు = ప్రాణులలో, ఆత్మత్వేన = వాని ఆత్మగ, ప్రవేశనం = ప్రవేశించుట, వ్యాప్తస్య = సర్వవ్యాపియగు, పరమాత్మనః = పరమాత్మకు, అణిమాసంజ్ఞం = అణిమ అను పేరు గల, ఐశ్వర్యం = శక్తి.

సర్వవ్యాపియగు పరమేశ్వరుడు, అత్యంత సూక్ష్మ ప్రాణులయందు కూడ వాని ఆత్మగ ప్రవేశించుట అణిమ అను శక్తి.

**బ్రహ్మాండాదిశివాంతాయాః షట్త్రింశత్తత్త్వ సంహతేః ।**
**బహిశ్చ వ్యాప్య వృత్తిత్వమైశ్వర్యం మహిమాహ్వయమ్ ॥10॥**

బ్రహ్మాండాది శివాంతాయాః = బ్రహ్మాండము మొదలు శివుని

వరకున్న, షట్త్రింశత్తత్త్వసంహతేః = ముప్పదియారు తత్త్వముల గుంపుకు, బహిః చ = బయట కూడ, వ్యాప్య = వ్యాపించి, వృత్తిత్వం = ఉండుట, మహిమాహ్వయం = మహిమ యను, ఐశ్వర్యం = శక్తి.

బ్రహ్మాండాది శివతత్త్వ పర్యంతము గల ముప్పది ఆరు తత్త్వములలోను, బైటను వ్యాపించి యుండుట మహిమ యను శక్తి.

**మహామేరుసమాంగస్య సముద్ధరణకర్మణి ।**
**లాఘవే తూలతుల్యత్వం లఘిమానం విదుర్బుధాః ॥11॥**

మహామేరుసమాంగస్య = గొప్ప మేరువువంటి దేహిని, సముద్ధరణ కర్మణి = పైకి ఎత్తునపుడు, లాఘవే = తేలికలో, తూలతుల్యత్వం = దూది వలె ఉండుటను, బుధాః = పండితులు, లఘిమానం = లఘిమ అని, విదుః = తలచిరి.

మహా మేరువువంటి దేహిని, పైకి ఎత్తునపుడు దూదిపింజవలె తేలికగా నుండు శక్తిని లఘిమ యని విద్వాంసులు తలచిరి.

**పరమాణుసమాంగస్య సముద్ధరణ కర్మణి ।**
**గౌరవే మేరుతుల్యత్వం గరిమాణం విదుర్బుధాః ॥12॥**

పరమాణుసమాంగస్య = పరమాణువువంటి దేహిని, సముద్ధరణ కర్మణి = పైకి ఎత్తునపుడు, గౌరవే = బరువులో, మేరుతుల్యత్వం = మేరువువలె ఉండుటను, బుధాః = పండితులు, గరిమాణం = గరిమ అని, విదుః = తలచిరి.

పరమాణువువంటి దేహిని ఎత్తునపుడు మేరువువలె నుండు బరువైన శక్తిని గరిమ యని విద్వాంసులు తలచిరి.



**పాతాళవాసినః పుంసో బ్రహ్మలోకావలోకనమ్ ।**
**ప్రాప్తిర్నామ మహైశ్వర్యం సుదుష్ప్రాపమయోగినామ్ ॥13॥**

పాతాళవాసినః = పాతాళములోనున్న, పుంసః = మనుష్యుడు. బ్రహ్మలోకావలోకనం = బ్రహ్మలోకమును చూచుట, ప్రాప్తిః నామ = ప్రాప్తి అను, మహైశ్వర్యం = మహాశక్తి, (అది) అయోగినాం = యోగులు కానివారికి, సుదుష్ప్రాపం = పొంద సాధ్యము కానిది,

పాతాళవాసి యగు మానవుడు బ్రహ్మలోకమును గాంచుట ప్రాప్తియను మహాశక్తి. ఇది అయోగులకు సుదుర్లభము.

**ఆకాశగమనాదీనామన్యాసాం సిద్ధిసంపదామ్ ।**
**స్వేచ్ఛామాత్రేణ సంసిద్ధిః ప్రాకామ్యమభిధీయతే ॥14॥**

స్వేచ్ఛామాత్రేణ = తన ఇచ్ఛచేతనే, ఆకాశగమనాదీనాం = ఆకాశగమనమమున్నగు, అన్యాసాం సిద్ధిసంపదాం = ఇతర సిద్ధిసంపదల, సంసిద్ధిః = సిద్ధి, ప్రాకామ్యం = ప్రాకామ్య మని అభిధీయతే = పిలువబడుచున్నది.

స్వేచ్ఛా మాత్రముచే ఆకాశ గమనాదీతర సిద్ధిసంపత్తుల సంసిద్ధి ప్రాకామ్యము.

**స్వశరీరప్రకాశేన సర్వార్థానాం ప్రకాశనమ్ ।**
**ప్రాకాశ్యమిదమైశ్వర్యమితి కేచిత్ప్రచక్షతే ॥15॥**

కేచిత్ = కొందరు, స్వశరీరప్రకాశేన = తన శరీర ప్రకాశముచే, సర్వార్థానాం ప్రకాశనం = అన్ని విషయముల ప్రకాశింపజేయుట,

ఇదం ఐశ్వర్యం = ఈశక్తిని, ప్రాకాశ్యం = ప్రాకాశ్యమని, ప్రచక్షతే = చెప్పుచున్నారు.

కొందరు స్వశరీర ప్రకాశముచే సర్వవిషయప్రకాశన శక్తిని ప్రాకాశ్య మని చెప్పెదరు (ప్రాకామ్యమునకు బదులుగ).

**స్వేచ్ఛామాత్రేణ లోకానాం సృష్టిస్థిత్యంత కర్తృతా ।**
**సూర్యాదీనాం నియోక్తృత్వ మీశత్వమభిధీయతే ॥16॥**

స్వేచ్ఛామాత్రేణ = తన ఇచ్ఛచేతనే, లోకానాం = ప్రపంచముల, సృష్టి స్థిత్యంత కర్తృతా = సృష్టి స్థితి లయములను చేయుట, సూర్యాదీనాం = సూర్యాదుల, నియోక్తృత్వం = ప్రభుత్వము, ఈశత్వం = ఈశత్వ మని, అభిధీయతే = చెప్పబడుచున్నది.

స్వేచ్ఛా మాత్రముచే సృష్టి స్థితి లయము లొనర్చుట, సూర్యాదులపై ప్రభుత్వము ఈశత్వమని చెప్పెదరు.

**సలోకపాలాః సర్వేఽపి లోకాః స్వవశవర్తినః ।**
**తదైశ్వర్యం వశిత్వాఖ్యం సులభం శివయోగినామ్ ॥17॥**

సలోకపాలాః = లోకపాలురతో సహ, సర్వే లోకాః అపి = ఎల్ల లోకములు కూడ, స్వవశ వర్తినః = తన వశమందుండుట, వశిత్వాఖ్యం = వశిత్వమను, ఐశ్వర్యం = శక్తి, తత్ = అది, శివయోగినాం = శివయోగులకు, సులభం = సుఖముగ లభించును.

లోకపాలురతో సహా సర్వలోకములును స్వవశమందుంచుకొనుట వశిత్వమను శక్తి. అది శివయోగులకు సులభము.



**యస్త్వేవం బ్రాహ్మణో వేత్తి తస్య దేవా వశే స్థితాః ।**
**కిం పునః క్ష్మాపతివ్యాఘ్రవ్యాళ స్త్రీపురుషాదయః ॥18॥**

ఏవం = ఇట్లు, యః = ఏ, బ్రాహ్మణః = బ్రహ్మజ్ఞాని, వేత్తి = తెలియుచున్నాడో, తస్య = వానియొక్క, వశే = వశమున, దేవాః = దేవతలు, స్థితాః = ఉందురు, క్ష్మాపతివ్యాఘ్రవ్యాళ స్త్రీపురుషాదయః = రాజు పులి పాము స్త్రీ పురుషాదుల గురించి, కింపునః = మరేమి?

దీనిని తెలిసిన బ్రహ్మజ్ఞాని వశమున దేవతలుందురు. అట్టి ఎడ రాజ వ్యాఘ్ర సర్ప స్త్రీ పురుషాదుల మాటేమి?

**సర్వాత్మభావసామ్రాజ్యనిరంతరితచేతసామ్ ।**
**పరిపక్వసమాధీనాం కిం కిం నామ న సిద్ధ్యతి ॥19॥**

సర్వాత్మభావసామ్రాజ్య నిరంతరితచేతసాం = సర్వాత్మ భావ సామ్రాజ్యము నిరంతరము నడుచుచున్న మనస్సు గల, పరిపక్వ సమాధీనాం = సమాధియందు పరిపక్వస్థితిని పొందిన వారికి, కిం కిం నామ = ఏది ఏది, న సిద్ధ్యతి = సిద్ధించదు?

సర్వాత్మభావసామ్రాజ్య మవిచ్ఛిన్నముగ నడచుచున్న మనస్సుగల సమాధిసిద్ధిని బడసిన వారికి ఏది తనకు తానే సిద్ధించదు?

**స్తోత్రమేతత్పఠేద్ధీమాన్సర్వాత్మత్వం చ భావయేత్ ।**
**అర్వాచీనే స్పృహాం ముక్త్వా ఫలే స్వర్గాది సంభవే ॥20॥**

స్వర్గాదిసంభవే = స్వర్గాదులచే కలుగు, అర్వాచీనే = ఇచ్చటి, ఫలే = ఫలమున, స్పృహాం = ఆశను, ముక్త్వా = విడిచి, ధీమాన్ =

బుద్ధిమంతుడు, ఏతత్ స్తోత్రం = ఈస్తోత్రమును, పఠేత్ = చదువవలెను, చ = మఱియు, సర్వాత్మత్వం = తానే సర్వాత్మ యనుదానిని, భావయేత్ = భావించవలెను.

స్వర్గాదులచే లభించు ఇచ్చటి ఫలమందు ఆశను విడిచి బుద్ధిమంతు డీ స్తోత్రమును చదువవలె. తానే సర్వాత్మ యనియు చింతించవలె.

**స్వర్గాదిరాజ్యసామ్రాజ్యం మనుతే న హి పండితః ।**
**తదేవ తస్య సామ్రాజ్యం యత్తు స్వారాజ్యమాత్మని ॥21॥**

పండితః = పండితుడు, స్వర్గాదిరాజ్యం = స్వర్గాది రాజ్యమును, సామ్రాజ్యం = సామ్రాజ్యమని, నహి మనుతే = తలచుటయే లేదు, ఆత్మని = తనయందు, స్వారాజ్యం = సర్వాత్మ భావనతో రమించుట, యత్ తు = ఏదియో, తత్ ఏవ = అదియే, తస్య = అతని, సామ్రాజ్యం = సామ్రాజ్యము.

ఆత్మజ్ఞాని స్వర్గాదిరాజ్యమును సామ్రాజ్యమని తలంచుటయే లేదు. తనయందే సర్వాత్మభావనతో రమించుటయే అతని సామ్రాజ్యము.

**సర్వాత్మ భావనావంతం సేవంతే సర్వసిద్ధయః ।**
**తస్మాదాత్మని సామ్రాజ్యం కుర్యాన్నియత మానసః ॥22॥**

సర్వాత్మభావనావంతం = సర్వాత్మభావనగలవానిని, సర్వసిద్ధయః = సిద్ధులన్నియు, సేవంతే = సేవించును, తస్మాత్ = అందువలన, నియతమానసః = నిగ్రహించిన మనస్సు గలవాడై, ఆత్మని = తనయందే, సామ్రాజ్యం = సామ్రాజ్యమును, కుర్యాత్ = చేయవలె.



సర్వాత్మ భావన గలవానిని ఎల్ల సిద్ధులు సేవించును. కాన మనస్సును నిగ్రహించి తనయందే సామ్రాజ్యము చేయవలె.

**యస్య దేవే పరా భక్తిర్యథా దేవే తథా గురౌ ।**
**తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః ॥23॥**

యస్య = ఎవనికి, దేవే = దేవుని యందు, పరా = నిరతిశయమైన, భక్తిః = భక్తియో, దేవే యథా = దేవునియం దెట్లో, తథా = అట్లే, గురౌ = గురువునందు నుండునో, తస్య మహాత్మనః = అట్టి మహాత్మునకు, ఏతే = ఈ, కథితాః = చెప్పబడిన, అర్థాః = విషయములు ప్రకాశంతే = గోచరించును.

దేవునియందు, గురువునందును పరాభక్తిగల మహాత్మునకే పై చెప్పినవి ప్రకాశించును.

**ప్రకాశాత్మికయా శక్త్యా ప్రకాశానాం ప్రభాకరః ।**
**ప్రకాశయతి యో విశ్వప్రకాశోఽయం ప్రకాశతామ్ ॥24॥**

ప్రకాశాత్మికయా = ప్రకాశ రూపమైన, శక్త్యా = శక్తిచే, యః = ఏది, ప్రకాశానాం = వెలుగులకు, ప్రభాకరః = వెలుగు నిచ్చునదై, విశ్వం = జగత్తును, ప్రకాశయతి = వెలిగించుచున్నదో, అయం ప్రకాశః= ఈ ప్రకాశము, ప్రకాశతాం = వెలుగుగాక.

ప్రకాశరూపమగు తన శక్తిచే సర్వప్రకాశములకు ప్రకాశము నొసంగి ప్రపంచమునే ప్రకాశింపజేయు ప్రకాశము తనయందే ప్రకాశించును గాక!

ఇతి శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకే ।
ప్రబంధే మానసోల్లాసే దశమోల్లాస సంగ్రహః ॥25॥

ఇతి = ఇట్లు, శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకే = శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థమును వివరించు, మానసోల్లాసే = మానసోల్లసమను, ప్రబంధే = కృతియందు, దశమోల్లాస సంగ్రహః = సంగ్రహమగు దశమోల్లాసము.

ఇట్లు శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థమును వివరించు మానసోల్లాస మను కృతియందు సంగ్రహమగు దశమోల్లాసము (పదవఉల్లాసము).

హరిః ఓం తత్సత్.





# దైవప్రార్థన

**కరుణామూర్తియగు దేవా!**

మా చిత్తము సర్వకాల సర్వావస్థలయందును నీ పాదారవిందము లందు లగ్నమై అచంచలమైన భక్తితో కూడియుండునట్లు అనుగ్రహింపుము.

**పరమ దయానిధీ!**

ప్రాతఃకాలమున నిద్రలేచినది మొదలు మరల పరుండువఱకును మనో వాక్కాయములచే మావలన ఎవరికిని అపకారము కలుగకుండునట్లును, ఇతర ప్రాణికోట్లకు ఉపకారము చేయులాగునను సద్బుద్ధిని దయచేయుము.

**సచ్చిదానందమూర్తీ!**

మా యంతఃకరణమునందు ఎన్నడును ఏ విధమైన దుష్టసంకల్పము గాని, విషయవాసన గాని, అజ్ఞానవృత్తి గాని జొరబడకుండునట్లు దయతో అనుగ్రహింపుము.

**వేదాన్తవేద్యా! అభయస్వరూపా!**

మాయందు భక్తిజ్ఞానవైరాగ్య బీజములంకురించి శీఘ్రముగా ప్రవృద్ధములగునట్లు ఆశీర్వదింపుము. మఱియు ఈ జన్మమునందే కడతేరి నీసాన్నిధ్యమున కేతెంచుటకు కావలసిన శక్తి సామర్థ్యములను కరుణతో నొసంగుము.

**దేవా!**

నీవు భక్తవత్సలుడవు. దీనులపాలిటి కల్పవృక్షస్వరూపుడవు. నీవు తప్ప మాకింకెవరు దిక్కు? నిన్ను ఆశ్రయించితిమి. అసత్తునుండి సత్తునకుగొని పొమ్ము. తమస్సు నుండి జ్యోతిలోనికి తీసుకొనిపొమ్ము. మృత్యువు నుండి అమృతత్వమును పొందింప జేయుము. ఇదే మా వినతి. అనుగ్రహించుము. నీ దరిజేర్చుకొనుము.

పాహి మాం, పాహి మాం పాహి మాం పాహి.